# విశ్వనాథ
# నవ్యసంప్రదాయం


రచన :

**ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**

తెలుగు సాహితి, హైదరాబాదు విశ్వవిద్యాలయం

ఎడిటర్

**డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య**

రీడర్, 'తెలుగు సాహితి'

హైదరాబాదు విశ్వవిద్యాలయం






**జీవియస్ షష్టిపూర్తి ప్రచురణ**

## యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

Viswanatha Navyasampradayam -
An anthology of literary essays on the above topic by Prof. G.V. Subrahmanyam, University of Hyderabad, Published by YUVABHARATHI, A Literary and Cultural Organisation, Hyderabad - 1. Editor: Dr. Mudigonda Veerabhadraiah, Reader in Telugu, University of Hyderabad.



First Edition : September, 1995.

Copies : 1000.

**Price : Rs. 30**

Cover Design : Sri Seela Verraju

Yuvabharathi Publication No. 159
(under Self Financed Scheme)

Copies available with :

1. Yuva Bharathi, Literary & Cultural Organisation, Andhra Saraswatha Parishath Buildings, Tilk Road, Hyderabad - 500 001.
2 Convenor, Prof. G.V. Subrahmanyam Shashtipurthi Publications, Srivani - 1-8-702/105, Nallakunta, Hyderabad - 500 044.
   Phone : 633275.
3 Visalandhra Book House, 4-1-435, Vigyana Bhavan, Bank Street, Hyderabad - 500 001. and other Branches.
4. Navodaya Book Sellers, In front of Arya Samaj, Kothi, Hyderabad.

Printed at :

Padmavathi Art Printers,
1-1-517/B/1, New Bakaram, Gandhinagar,
Hyderabad - 500 380. Phone : 7611413.

Cover Page Printed at :

Vipla Printers Private Ltd.,
Near Shankar Math, Nallakunta,
Hyderabad - 500 044. Phones : 636242; 667476.

తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు ఛైర్మన్

కాకతీయ సిమెంట్స్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్

నిరాడంబర వర్తనులు, నిరంతర భక్తిభావ నిమగ్నులు

ధార్మిక చింతనాపరులు, ఉదారవదాన్యులు

స్నేహమూర్తులు, సమాజ సేవా ధురంధరులు

**శ్రీ పల్లంపాటి వెంకటేశ్వర్లుగారికి**

గౌరవపురస్సరంగా

**అంకితం**

పారావార గభీర సుందరమునై ప్రహ్లాద సందీప్తమై
సారాసార వివేక పూరమతియై సత్సంగ సంధాయియై
ధారాపాత దయాంతరంగ ఝరియై ధర్మావతారంబునై
వీరోత్సాహము వేంకటేశ్వరుల విద్వద్వందితున్ జేయుతన్.

## పూజ్యులు శ్రీ పల్లంపాటి వెంకటేశ్వర్లుగారూ!

ఆదిశంకర గురుపీఠ మధివసించి
సకలభారత మద్వైత చంద్రికలను
పంచు నాచార్య వర్యుల పాద సేవ
లెపుడు నక్షయ సంపద లిచ్చు మీకు.

నామ సామ్యంబు నెంచి మీ నీమ మెంచి
ఆస్తికంబైన జగతిపై నాస్థ నెంచి
భక్తి మార్గాన పరిణత భావ మెంచి
తిరుమలేశుడు మీ సేవ కోరుకొనియె.

శత్రువునైనను శాంతమూర్తిగఁ జేయు
మందహాసము మీదు మంత్రశక్తి
జడనరునైనను చైతన్యజలధిగా
మార్చ గల్గెడి మీదు మాటనేర్పు
నాస్తికునైనను నారాయణుని వైపు
నడిపింపఁగల్గు మీ నడతతీరు
లోభినైనను సర్వలోకైక హితునిగాఁ
దీర్చఁ గల్గిన మీదు తెగువతనము

వ్యక్తిగా నున్న సంస్థయై వ్యవహరించి
పరహితార్థము సేవలఁ బరఁగఁ జేసి
ధర్మ పురుషార్థ సాధన మర్మ మెఱిఁగి
బ్రదుకు పండించుకొనుట మీ భవ్యపథము.

భరత ఖండాన జాతీయ భావధార
సాగుచున్నంతకాలము సార్వభౌమ
పదవిఁ గవిలోకమందు విద్వద్విభూతి
విశ్వనాథుడు నిల్చును శాశ్వతముగ.

అట్టి మహనీయమూర్తి చేపట్టినట్టి
నవ్య సంప్రదాయోద్యమ దివ్యగీతి
పాడి వినిపించు వచన ప్రబంధ మిద్ది
అంకితము గొను మీకృతి నార్షబుద్ధి.




# విశ్వనాథకు యువభారతి అక్షర ప్రసూనం

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చొనటంకంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది" అనే లక్ష్యంతో యువభారతి రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీన మైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభి మానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంలో ముప్పై రెండేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. ఆలోచనలకు అక్షరాకృతులు యువభారతి ప్రచుర ణలు!

యువభారతి ముప్పైరెండో వార్షికోత్సవం, విశ్వనాథ శతజయంత్యుత్స వాలలో భాగంగా యువభారతి సంవత్సరం పొడుగునా నిర్వహించిన 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' కార్యక్రమాలలోని ఉపన్యాస వ్యాసాలను వెలువరిస్తున్న సాహిత్యోత్సవం - సంయుక్తంగా జరుగుతున్న సందర్భంగా సెప్టెంబరు 3వ తేదీన ఈ గ్రంథం వెలువడటం విశేషంగా భావిస్తున్నాం. విశ్వనాథ శతజయం తికి యువభారతి సమర్పిస్తున్న మరొక అక్షర ప్రసూనం!

ఆధునికాంధ్ర సాహిత్య వికాస చరిత్రలో నవ్యసంప్రదాయ వాదాన్ని రూపొందించి, చరిత్ర రచనను వ్యవస్థీకరించి, విశ్వనాథాదులు సాగించిన సాహిత్యోద్యమానికి సవ్యమైన అర్థంలో రూఢికెక్కించి, ఒక కాదనలేని వాస్త వంగా నిరూపించిన ప్రవక్త ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. విశ్వనాథ నాయ కత్వంలో సాగిన నవ్యసంప్రదాయోద్యమాన్ని గురించి వివరించే ఒక పరిచ యాత్మకమైన గ్రంథం వెలువడవలసిన అవసరం ఎంతైనా ఉందని సాహితీ లోకం కొంతకాలంగా భావిస్తోంది. ఆ అవసరాన్ని ఈ గ్రంథం తీరుస్తున్నది.

ఈ గ్రంథానికి ఆర్థిక సహాయం చేయటమే కాకుండా, కృతిస్వీకారానికి దయతో అంగీకరించిన వదాన్యులు శ్రీ పల్లంపాటి వెంకటేశ్వర్లు గారికి, అభిని వేశంతో ముందుమాట వ్రాసి యిచ్చిన ప్రసిద్ధ సాహితీ విమర్శకులు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య గారికి, ఈ వ్యాసాలు మొదట ప్రచురించిన ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి దినపత్రికలకూ, యువభారతి ప్రచురణలన్నింటికీ ముఖపత్రాలం కరణంలో తోడ్పడే సాహితీమూర్తులు శ్రీ శీలా వీర్రాజుగారికీ, ఈ గ్రంథాన్ని

అభిమానంతో ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్సుకు, కవరు పేజీని ముద్రించిన విప్ల ప్రింటర్స్ వారికీ మా కృతజ్ఞతాభివందనాలు.

జీవియస్ గారు బి ఏ., చదువుతున్నప్పుడే ఆంధ్రమహాభారతాన్ని మొదటి నుండి చివరిదాకా వారి తండ్రిగారివద్ద చదివారు. ఆ సందర్భంలో విశ్వనాథ వారి 'నన్నయగారి ప్రసన్న కథాకలితార్థ యుక్తి'ని జీవియస్‌గారు అధ్యయనం చేశారు వారి విమర్శ వ్యక్తిత్వానికి శ్రీకారం చుట్టింది విశ్వనాథవారి ఆ రచనే. అప్పటి నుండి జీవియస్ విశ్వనాథ వారికి ఏకలవ్య శిష్యులైనారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి నందుకున్న జీవియస్‌గారి 'వీరరసం' గ్రంథాన్ని విశ్వనాథవారు ప్రశంసించి ఆశీర్వదించారు. తెనాలిలో విశ్వనాథవారు జీవియస్‌ను సన్మానించి దీవించారు (చూడు: ఈ గ్రంథ ముఖచిత్రం). విశ్వనాథ సాహితీ సమాలోచనలో తమ సాహిత్య విమర్శను జీవియస్‌గారు విరివిగా సాగించారు.

విశ్వనాథ శతజయంతి ఉత్సవాలను మొదలుపెట్టి యువభారతి ద్వారా సంవత్సరం పాటు ప్రతినెలా నడిపించటంలో జీవియస్‌గారు, యువభారతీయులు కృషిచేసి ఒక రికార్డు సృష్టించారు విజయవాడలో, వరంగల్లులో, విశాఖపట్నంలో జరిగిన విశ్వనాథవారి శతజయంత్యుత్సవాలలో ప్రధాన వక్తగా జీవియస్‌గారు పాల్గొన్నారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి సారస్వత వేదికలో హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయం నిర్వహించిన విశ్వనాథ సదస్సులలో ప్రధానోపన్యాసాలు చేశారు. జీవియస్‌గారి పర్యవేక్షణలో విశ్వనాథ సాహిత్యం మీద పదకొండు మంది పరిశోధక విద్యార్థులు ఎం ఫిల్., పిహెచ్.డి., సిద్ధాంత వ్యాసాలు వ్రాశారు. విశ్వనాథ సాహిత్యాన్ని నవ్యదృక్పథంతో అనుశీలించి నవ్యసంప్రదాయ వాదానికి ప్రతిష్ఠ ప్రచారాలను కల్పించారు ఆచార్య జీవియస్.

యువభారతి ప్రచురణలలో ఇదివరకే ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు విశ్వనాథమీద వ్యాసాలు వ్రాశారు; విశ్వనాథ సాహితీవైభవానికి పీఠిక వ్రాశారు. 'ఆంధ్రసాహిత్య విమర్శపై ఆంగ్లప్రభావం' లో విశ్వనాథ విమర్శ వ్యక్తిత్వానికి సుబ్రహ్మణ్యంగారిచ్చిన నవ్యసమన్వయం ఎన్నో కొత్త వాస్తవాలను బైట పెట్టింది. నవ్యసంప్రదాయవాదం సుబ్రహ్మణ్యంగారు సాహిత్యక్షేత్రంలో నాటిన మరో కల్పవృక్షం. దాని సౌరభాలను పంచిపెట్టే ఈ రచనను యువభారతి ప్రచురణగా వెలువరించటానికి అవకాశమిచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

హైదరాబాదు,
3-9-1995.

డాక్టర్ బి. జయరాములు
కార్యదర్శి, యువభారతి.

# సాహిత్యచరిత్రను దారికితెచ్చిన దర్శనం

## —డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య

చరిత్రకూ, సాహిత్య చరిత్రకూ భేదముంది. ఒక రాజు రాజ్యమేలాడన్న విషయాన్ని అతని శత్రువు కూడా కాదనలేడు. కాదని అంటే అతని చరిత్ర రచన చరిత్రే కాకుండాపోతుంది. కాని, సాహిత్య చరిత్రలో ఈ రకమైన పరిస్థితి ఉన్నట్లుగా లేదు. హిట్లర్‌ని గాంధీమహాత్మునిగా చిత్రణ చేయగల్గుతున్నారిక్కడ. అట్లాగే గాంధీజీని దోషాల పుట్టగా కూడా వక్రీకరణ చేయగల్గుతున్నారిక్కడ. సాహిత్యానికీ, సాహిత్య చరిత్రకీ ఉండే స్వయం ప్రతిపత్తిని తిరస్కరించే 'మహానుభావుల' వల్ల ఈ దుస్థితి సాహిత్యలోకంలో స్థిరపడిపోయింది; పోతున్నది. దీన్ని తిరస్కరిస్తూ, కాదంటూ సోపపత్తికంగా సాహిత్యాధ్యయనపరులకు సత్యాన్ని చూపించాల్సిన అవసరం గుర్తించి ఆచార్య జి వి. సుబ్రహ్మణ్యం గారీ గ్రంథాన్ని రచించారు.

గడిచిపోయిన ఘట్టాలుండేది చరిత్ర. ఆ ఘట్టాలు ఇప్పుడుండవు. మళ్ళీ అవి జరగవు. అంటే - చరిత్రకు వర్తమానంలో అస్తిత్వం లేదు. అది కేవలం కాలిక సత్యం మాత్రమే. సాహిత్య రచన అట్లాంటిది కాదు రచన ఏనాడు ఎన్నివందల సంవత్సరాలక్రితం జరిగినప్పటికీ, దాని ఉనికి వర్తమానంలోనూ ఉంటుంది. పొమ్మంటే పోయేది కాదు. అట్లాంటి సాహిత్యం యొక్క చరిత్ర రచనకూ, రాజకీయ చరిత్రకూ రచనలో భేదం ఉండక తప్పదు. సాహిత్య చరిత్ర నిర్మాణంలో వక్రీకరణలు, దుర్వ్యాఖ్యానాలు, దుష్టాన్వయాలూ తగవని చెప్పే రోజులు, చెప్పగలిగే రోజులు వస్తాయి; వచ్చాయి.

ఐతే, నిష్పాక్షికుడైనవాడి వాదాన్ని లోకంలో ప్రచలితం కాకుండా చేయడానికి, సాహిత్యలోకంలోని కొందరికి రాజకీయ పార్టీల దన్ను ఉండింది, ఉంటున్నది. ఈ వక్రీకరణ నిజానికి ఆ పార్టీల వాళ్ళ సిద్ధాంత ప్రయోజనాల కోసరమేకూడా! వారి లక్షణాలను గురించి రాస్తూ విశ్వనాథ—

''తీవ్ర ప్రకృతికి సామ్యవాదమున కెక్కువ సంబంధమున్నట్లు కన్పించుచున్నది. వారు చెడుగుడిలో నిపుణులు. కవ్వించ నేర్చినవారు. ఆకలి, వర్ణ వ్యవస్థ పోవుట, సర్వజనులు సమానము, ఆర్థిక సామ్యము, పరదేశానుకరణము, విపక్షనాశనము మొదలైన బహుసిద్ధాంతములు వారికి కలవు, వానిని గురించి వ్రాసినదే వారికి కవిత్వమనిపించును. అదియే క్రొత్త కవిత్వము. తక్కిన దంతయు ప్రాత కవిత్వము "1

---

1. కవిత్వము యొక్క ఉత్తమత్వము : సిద్ధాంత సంబంధము; జయంతి అక్టోబరు 1959. పుట 230, విశ్వనాథ అసంకలిత సాహిత్యం IV. సం॥ ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య.

—అని అంటారు. ఈ రాజకీయపక్షం వాళ్ళు నిల్పిన రచయితలసంఘాల వాళ్ళు సాహిత్యచరిత్రకు చేసిన ద్రోహం రెండు రకాలైనది. 1. సంప్రదాయ శబ్దానికి కువ్యాఖ్యానం చేసి, దాన్ని ఒక తిట్టుతో తుల్యమైన శబ్దంగా రూఢి కెక్కించడం. 2. అసలైన అర్థంలోని సాంప్రదాయిక పంథా రచనలను తక్కువ చేసి, దాని ద్వారా సాహిత్యానికి కల్గిన వికాస, పరిణామాలను పైకి కన్పించనీయ కుండా సాహిత్యచరిత్ర రచనను దారి మళ్ళించడం. కొందరిట్లా ఈ సంప్రదాయ శబ్దానికి దురర్థాన్ని రూఢి కెక్కించినంత మాత్రంలో దానికి తిరుగు ఉండదా? అని అడిగితే - అట్లా ఉండదని చెప్పలేము కాని, దానికెంతో తీవ్ర ప్రయత్నం చేయాల్సి ఉంటుంది. ఆ ప్రయత్న ఫలితమే జి.వి. సుబ్రహ్మణ్యం గారి ఈ నవ్య సంప్రదాయోద్యమ వాద ప్రతిపాదన.

—"దుష్టవిమర్శకుడు చేయు నపకార మెచ్చట నున్నదనగా నొక సద్గ్రంథమునకే వ్యాప్తి కలుగకుండ చేయుటలో నున్నది. ఈ కువిమర్శకుడు కుకవి కంటె నెక్కువ సాహిత్య ద్రోహి.... కువిమర్శకుడు అవిద్వద్వావుకుల మనసులను భంగించును. సత్కార్యము యొక్క స్థితికి ధూమకేతు ప్రాయు డగును.... కుకవివల్ల జగద్ద్రోహము జరుగదు. కువిమర్శకునివలన జరుగును."[2]

—అని విశ్వనాథ ఒక సందర్భంలో రాసినది గమనించాల్సిన అభిప్రాయం. ఇలాంటి కువిమర్శల ఫలితంగానే వక్రీకరణలతో సాహిత్యచరిత్ర రాయబడింది. ఇట్లా రూఢి ఏర్పడడం వల్లనే కావచ్చు విశ్వనాథ 'ఎవరో కొందరు కవులు, సనాతన వాదులని దుష్ప్రచారము చేయింపించుకొన్న కవులు కూడ....'[3] అని ఒకచోట రాశారు! ఇట్లా సనాతన వాదాన్ని, సంప్రదాయ వాదాన్ని వ్యతిరేక దృక్కోణంతో కూడిన అర్థం కల్గినవిగా దుష్ప్రచారం జరిపి సాహిత్యచరిత్రలో ముఖ్యమైన ఘట్టాలను, పరిణామాలను కప్పివేయడం జరిగింది. మహాకవుల సమూహాన్ని, మహాకావ్య సముదాయాన్ని సంప్రదాయబద్ధమైనవన్న ఒక్క మాటతో గుణ పరిశీలనం చేయకుండా కొట్టివేసి సాహిత్య చరిత్రలో ఉజ్జ్వల స్థానాన్ని పొందకుండా చేశారు. ఈ అసత్యాన్ని, అన్యాయాన్ని ఎత్తి చూపుతూ, నాజూకుగా ఈ 22 వ్యాసాలను రాస్తూ 'నవ్య సంప్రదాయోద్యమం' అన్నది ఎట్లా వామపక్షీయులదన్నుతో పాక్షిక దృష్టితో నడిచిన సాహిత్యోద్యమానికి సమాంతరంగానూ, దాని తర్వాతనూ ఎట్లా సాగిందో, దానికి విశ్వనాథవారెట్లా నాయకత్వం వహించడం జరిగిందో స్పష్టంగానూ, హేతుబద్ధంగానూ తెలిపారు!

2. జయంతి, నవంబర్, 1959. పైగ్రంథంలోనే. పు. 233.

3. పైదే. పు. 229.

ఉద్యమాలకు పేర్లు పెట్టడంలో కూడా కొంత 'మతలబు' ఉన్నది. కేవల సాహిత్యోద్యమాలకు పేర్లు ఆ ఉద్యమాలు ముగిశాకనే ఏర్పడ్డవి. రాజకీయ నేపథ్యంతో, నియంత్రించబడిన ఉద్యమాలకు ముందే పేర్లూ, మేనిఫెస్టోలు, సభలూ, ప్రచారాలూ, అందుకుగాను పత్రికలూ, సభ్యత్వాలూ మొ॥న వ్యవహారం ఉండింది. కనీసం ఇంగ్లాండులోనైనా రొమాంటిసిస్టులు తమని తాము రొమాంటిసిస్టులుగా చెప్పుకోలేదు. షెల్లీ, కీట్స్, బైరన్‌లతో ముడివేస్తూ కాలరిడ్జ్, వర్డ్స్‌వర్తులు 1849 లో మాత్రమే మొదటిసారిగా దీన్ని కాల్పనికోద్యమమన్నారు.[4] వామపక్ష వస్తువుతో రాసిన కవిత్వ పద్ధతికి నామకరణం ఇట్లా జరుగలేదు. వారు చేసినది సంఘటితంగా దేశీయమైన కవిత్వోద్యమాన్ని ఎదుర్కోవడం. వారి అంతర్జాతీయ రాజకీయదృష్టి వారిని అట్లా ఎదుర్కోవడానికి కారణమైంది. ఆ 'అంతర్జాతీయ దృష్టే' వారి యుగకర్త శ్రీ శ్రీ మహాప్రస్థానంలో ఒక్క కవితలోనైనా భారతదేశం పేరైనా లేకుండా చేసింది! ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఒక చోటెక్కడో రష్యా జయిస్తే రష్యాను ప్రశంసించేట్లుగా కూడా చేసింది! అట్లాంటి వాళ్లు దేశీయంగా వస్తున్న సాహిత్య వికాసాన్ని హర్షిస్తారనీ, దాన్లో పాలు పంచుకొంటారనీ అనుకోవడం అత్యాశే. ఐనా, నవ్య సంప్రదాయోద్యమనాయకుడైన విశ్వనాథవారు శ్రీశ్రీని గురించి నిర్ణయిస్తూ తన 'హేతువాద యుగం' అన్న ఆకాశవాణి రూపకంలో 'ఈ క్రొత్త కవుల్లో ఒక్కడే మహాకవి, అతని పేరు శ్రీశ్రీ'[5] అని రాస్తారు! వస్తు దృష్టితో సాహితీ స్థాయీ నిర్ణయాలు చేయకుండా 'సాహిత్య విలువలు' ఆధారంగా రచనలకు విలువ కట్టడమన్నది నవ్యసంప్రదాయోద్యమంలో అతి ముఖ్య విషయం. జి వి. సుబ్రహ్మణ్యంగారి ఈ గ్రంథంలో ఈ అంశం స్పష్టపడ్తుంది. దీనికి విశ్వనాథ వారే మార్గదర్శనం చేశారు.

—"గొప్ప కవి యని అనుకొనబడుచున్న వాడొకడు కలడు వాని సిద్ధాంతములు మన కిష్టము కావు. వానిని మనము గొప్పకవి యని యనుచున్నాము. ప్రతిభాశాలి యనుచున్నాము వాని కావ్యమునందవి లేనివి లేవని వ్రాయుచున్నాము. అనగా మనమనుకొన్నవి లేవనియే కదా! అవి లేకపోయినను వాడు గొప్పకవి యని మనమంగీకరించుచున్నాము కదా!"[6]

ఒక కవిని కవిగా చెప్పడానికి కవిత్వ లక్షణాలతనికవిత్వంలో ఉండడం తప్ప మరిదేన్నీ చూడని నవ్య సంప్రదాయోద్యమ నాయకుని లక్షణం ఈ ఉద్య

4. చూడు- Theory of Literature, Rene Welleck and Austin Warren P. 264.
5. విశ్వనాథ అసంకలిత సాహిత్యం IV - పు. 103.
6. పైదే - పు 231.

మాన్ని ఉద్యమంగా గుర్తించని వాళ్ళల్లో కన్పించదు 'కాదనలేని వాస్తవం: నవ్య సంప్రదాయోద్యమం' అన్న ఈ గ్రంథంలోని వ్యాసంలో సాహిత్య చరిత్రను తప్పుదారి పట్టించేవారి అంచనాలను సుబ్రహ్మణ్యంగారు సోపపత్తికంగా ఖండించారు. అంతేకాకుండా 'ఇంకా మిగిలి ఉన్న సంప్రదాయాన్ని నవ్య సంప్రదాయంగా పిలుస్తున్నారు' అన్న అవగాహనా రాహిత్యాన్ని సుబ్రహ్మణ్యంగారి ఈ గ్రంథం అంతా సరిచేస్తున్నది. అందుచేత ఈ ఉద్యమాన్ని నవ్య సంప్రదాయోద్యమం అన్న పేరు ఉద్యమానంతరమే పెట్టబడినప్పటికీ, దీనికి ఉద్యమ లక్షణాలున్నవని, దీనివల్ల కల్గిన ఫలితాలవల్లనే చెప్పవచ్చును. అభ్యుదయ కవిత్వంతో సమాంతరంగా పుట్టి, దాని పరిసమాప్తిని కూడా చూసి ముందుకు సాగిందీ ఉద్యమం. అందువల్ల ఉద్యమవేళలో దీనికి పేరు లేకపోయినప్పటికీ కొరత ఏమీ జరగలేదు. కొరత లేకపోవడమే కాక సుబ్రహ్మణ్యంగారి మాటల్లో - "సంప్రదాయ వాదాన్నీ, నవ్యసంప్రదాయవాదాన్నీ ఎదుర్కొంటున్న ఎందరో అభ్యుదయ విప్లవవాదులకు ఎదురుగా మహారథుల్లా నిలిచి ఆధునిక చైతన్యంతో సంప్రదాయాన్ని రక్షిస్తున్న కవులు, రచయితలు వీరు. ఆధునిక యుగంలో సమాజం సమగ్ర సాహిత్యానుభవాన్ని పొందే అదృష్టాన్ని అందించిన, అందిస్తున్న అక్షరశిల్పులు, రసమూర్తులు నవ్యసంప్రదాయ కవితాయుగసారథులు."7

సంప్రదాయమూ, నవ్యసంప్రదాయమూ నడుమన ఉన్న సూక్ష్మభేదాన్ని తర్వాతి కాలంలో కోవెల సుప్రసన్నాచార్యులవారు వివరిస్తూ—

"నవ్యసంప్రదాయ మంటే గతానుగతికంగా వచ్చే సంప్రదాయ సాహిత్యంగా భ్రమించే వీలులేదు. దీనివల్ల సమగ్రావగాహన కలుగదు. పరంపరగా వచ్చే విశ్వసనీయములైన పురాణేతిహాసముల అనువాదాలేవీ నవ్యసంప్రదాయంలో చేరవు. ఎందుకంటే, వీటిల్లో సమకాలీన స్పందన చేరలేదు."8

—అని స్పష్టీకరించారు. నవ్యసంప్రదాయం అన్న శబ్దాన్ని పారిభాషిక పదంగా రూఢి కెక్కించిన సుబ్రహ్మణ్యంగారి ఆలోచనకు, ప్రతిపాదనకు ఇది తోడ్పడుతున్న ఆలోచన.

ఇక్కడ గమనించాల్సిన అతి ముఖ్య విషయం ఏమిటంటే- ఒక లేని ఉద్యమాన్ని ఎవరూ చరిత్ర పుటల్లో సృష్టించలేరు. సాహిత్య చరిత్రలో-కొందరు గుర్తించకుండా, దానిమీద దుప్పటి కప్పినప్పటికీ - తానుగా వ్యక్తమవుతున్న కొన్ని సమాన లక్షణాలయొక్క సమాహారానికి సాహిత్య చరిత్రకారుడు తప్ప

7. 'నవ్యసంప్రదాయ కవితోద్యమం - విశ్వనాథ' వ్యాసంలో. (తెలుగు అకాడమి ప్రచురణ)

8. 'వర్తమాన కవిత్వదర్శనం' అన్న వ్యాసంలో (అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు - పు. 90).

పేరు ఎవ్వరు పెట్టారు? అట్లా పెట్టకపోవడం సాహిత్యద్రోహం. విశ్వనాథ మాటల్లోనైతే దీన్ని జగద్ద్రోహం అనవచ్చును. దీనికి పేరుపెట్టి, ఈ ఉద్యమ లక్షణాలని స్పష్టీకరిస్తూ, ఇది ఏమేమి లక్ష్యాలను పెట్టుకొని, వాటినెట్లా ఎట్లా సాధించిందో నిరూపణం చేయడం విద్యావంతుని పని. ఈ పనినే ఆచార్య జి వి సుబ్రహ్మణ్యంగారి గ్రంథంలో చేసింది. ఐతే సుబ్రహ్మణ్యంగారే చెప్పినట్లు—

—"ఒక కాలంలో ఒక చైతన్యం ఉవ్వెత్తుగా పొంగుతున్నప్పుడు, దానిని కవులు పోషిస్తూ ఒక ధోరణినో, ఒక ఉద్యమాన్నో సాగిస్తున్నప్పుడు సమాజ చైతన్యంలోని మరో భాగంగా ఉండే తదితర ప్రవృత్తులు బలహీనంగా వున్నా చచ్చిపోవు. తమ శక్తులను కూడగట్టుకోవటానికి మందంగానో లేదా తీవ్రంగానో, వ్యక్తంగానో లేదా అవ్యక్తంగానో కృషి చేస్తుంటాయి. ఒక్కొక్కసారి ఆ శక్తు లన్నింటికీ ప్రతినిధిగా ఒక రచయితో లేదా కొందరు రచయితలో తమ ప్రయ త్నాలను బలంగా సాగించవచ్చు. ఇటువంటిపనే అభ్యుదయ కవిత్వోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లోనే విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీ మద్రా మాయణ కల్పవృక్షము రచిస్తూ, మెరుపులా సాధించిన నవ్య సంప్రదాయ యుగసిద్ధి."[9]

రెనెవెలెక్, ఆస్టిన్ వారెన్‌లేమో సాహిత్య యుగనామం (రొమాంటి సిజమ్ వంటివన్న మాట) "It is a historical category or, if one prefers the Kantian term, a 'regulative idea' (or rather a whole system of ideas) with the help of which we interpret the historical process"[10] అని అన్నారు.

నవ్యసంప్రదాయోద్యమం అన్నది సాహిత్యచరిత్ర వికాసాన్ని తెలిసికోవ డానికి తోడ్పడే చక్కని కీలకమన్నమాట చరిత్ర వికాసక్రమాన్ని తెలిసికొనే 'క్రమం' దీనివల్ల మనకు స్పష్టపడ్తుందన్నమాట ఈ కీలకాన్ని సాహిత్యాధ్యయన పరులకు అందించి, దారి మళ్ళించబడిన చరిత్ర నిర్మాణాన్ని మళ్ళీ దారికితెచ్చిన సద్విమర్శకులు, సాహిత్య చరిత్రకారులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారు. పై ఇద్దరు రచయితలు చెప్పినట్లుగా "While a period is thus a section of time to which some sort of unity is ascribed, it is obvious that this unity can be only relative."[11] ఒక యుగం

---

9. 'నవ్యసంప్రదాయ కవిత్వోద్యమం - విశ్వనాథ' అన్న వ్యాసంలో. (తెలుగు అకాడమి ప్రచురణ)
10. Theory of Literature P. 265.
11. Theory of Literature P. 265.

లోని రచయితలందరి రచనలూ ఒక మూసలోంచి తీసినట్లుగా ఉండవు ఐనా వారి రచనల్లో ఏదో ఒక రకమైన ఏకత కూడా ఉండకపోదు ప్రక్రియా పర మైన భేదాలు, ప్రయోగాలు ఎన్ని కన్పించినప్పటికీ, నవ్య సంప్రదాయోద్యమ రచనల్లో ముఖ్యంగా కావ్యాల్లో రస నిర్వహణ మన్నది సమాన లక్షణం. రసం ప్రధానంకాని కావ్యాలు లేకపోలేదు. అలాంటిచోట్ల వేరే కావ్య లక్షణాలలో ఏకత ఉంటుంది.

ఆధునిక కాలంలో వచ్చిన మూడు ప్రధాన సాహిత్యోద్యమాలలో - అంటే భావకవిత్వోద్యమం, అభ్యుదయకవిత్వోద్యమం,నవ్య సంప్రదాయోద్యమం- సాహిత్య విలువలకు ప్రాధాన్య మిచ్చినవి భావకవిత్వం, నవ్యసంప్రదాయం మాత్రమే. అభ్యుదయ కవిత్వానికి వస్తుప్రాధాన్యమే. కళా విలువలతో బాగా రాజీపడి చాలా కాలం మరుగునపడి పోవాల్సి వచ్చిందా ఉద్యమం. కళావిలువల్ని రాజీలేని పద్ధతిలో పోషిస్తూనే జాతి ద్రోహకరమైన సిద్ధాంతాలని, అమానుష పద్ధతులని ఖండించింది నవ్య సంప్రదాయోద్యమం. రాణా ప్రతాపసింహుని వంటి మహా క్షత్రియ వీరుడు కూడా గాంధీయమూర్తిగా భాసిస్తూ దేశ స్వాతంత్ర్యో ద్యమం లోని అహింసా మార్గాన్ని స్ఫురింపజేస్తుంటాడీ ఉద్యమంలో! సౌందర నందము, శివభారతం, రాణా ప్రతాపసింహ చరిత్రము, ఆత్మకథ, ఆంధ్ర పురాణము అన్న వాటిని పంచకావ్యాలుగా నిర్ణయించి నవ్యసంప్రదాయాన్ని గురించిన నేటి ఆలోచనకు విశ్వనాథ బీజాన్ని వేశారని సుప్రసన్న గారన్నారు[12] ఈ ఐదింటిలో నాల్గింటికి చరిత్రనో, చారిత్రకాంశాలో వస్తువు. ఇంతమాత్రమే కాక సాహిత్యంలోని వివిధ కోణాలలో, మూలాలలో నవ్యసంప్రదాయ లక్షణా లెలా ఉన్నాయో పరిశీలించి, దీనికి నవ్యసంప్రదాయ యుగమని నామకరణం కావించాల్సిన ఆవశ్యకతను మొదటగా గుర్తించింది ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు. చారిత్రక కావ్యాల నుంచి, విమర్శరంగం వరకు అనేక ప్రక్రియలలోనూ, అంశాలలోనూ నవ్యసంప్రదాయం ఎలా కన్పిస్తున్నదో సోదాహరణంగా సుబ్రహ్మణ్యం గారి గ్రంథంలో చూపించారు. అంతేకాకుండా, సాహిత్య చరిత్ర రచనకు పనికివచ్చేట్లుగా 'భావకవిత్వం మీద సాగించిన తిరుగుబాటుగా మొదట తలయెత్తినా, అభ్యుదయ కవిత్వోద్యమానికి ప్రత్యర్థిగా క్రమంగా రూపొందిన

12. 'విశ్వనాథ విమర్శ' - వివేచన 14 వ సంచిక - పు 188.
13. చూడు - 'అభ్యుదయవాదం : నవ్య సంప్రదాయవాదం' వ్యాసం.

సాహిత్యోద్యమం నవ్యసంప్రదాయోద్యమం'[13] వంటి పరిశీలనలు చేసి భావి సాహిత్య నిర్మాతలకు చక్కని దారి వేశారు సుబ్రహ్మణ్యంగారు.[14]

నిత్యత్వము, నవ్యత్వము విరోధం లేనివన్న నవ్యసంప్రదాయ రచయితల దర్శనాన్ని సుబ్రహ్మణ్యంగారి ఈ మొత్తం గ్రంథంలో అంతర్లీనంగా మనం చూడగల్గుతాము అంతేకాకుండా, సమాజ దర్శనాన్ని సాహిత్యదర్శనంగా పరివర్తింపజేసికొన్న ప్రతిభావంతులుగా నవ్యసంప్రదాయ రచయితలు మనకీ గ్రంథం చదివాక దర్శనమిస్తారు. ప్రాచీన సాహిత్య దర్శనాలలో నేటి నవ్య సంప్రదాయ సాహిత్య దర్శనమూలాలున్నప్పటికిన్నీ, అవి ఆధునిక మూల్యాలతో సంవాదం పొంది కొత్తగా ఒక సాహిత్య దర్శనంగా ఎలా పరిణమించాయన్న అంశం కూడా ఈ గ్రంథం చదివాక మనకు తెలుస్తుంది.

ఈ గ్రంథం ద్వారా సుబ్రహ్మణ్యం గారు స్పష్టీకరించిన మరొక ముఖ్యాంశం సాహిత్యదర్శనం విషయం. ఒక సాహిత్య దర్శనమే లేకుండా సాహిత్య చరిత్రల్లో స్థానాన్ని సంపాదించబూనడం ఆశ్చర్యకరమైన విషయం. సాహిత్య సిద్ధాంతం లేకుండా, కేవల సామాజిక సిద్ధాంతాలతో సాహిత్య క్షేత్రంలో దూరడం 'విడ్డూర'మైన విషయం. ఆర్థిక, రాజకీయ, సాంఘిక సిద్ధాంతాలు, నవ్య సంప్రదాయకుల వస్తువులలో రంగరించబడినప్పటికిన్నీ వారి రచనలన్నీ మౌలికంగా కళా ధర్మాలనే తమ ఆత్మ స్థానంలో నిల్పుకొన్నవి. పరిపూర్ణ కళానుభవమే ఈ ఉద్యమంలోని వారి అసలు లక్ష్యం. 'నవ్య సంప్రదాయ వాదులు ఆశించింది సాహిత్యాన్ని కళగా దర్శింపగల సౌందర్య దృష్టి; దానిని అనుశీలించి, అనుభవించగల ప్రామాణిక ప్రవృత్తి.'[15]

కళానుభవాన్ని కాదని పాఠకులలో చైతన్యం కల్గించ గల్గిన రచన చేయ గల్గడం అనూహ్యం. ఐనా, రచనకు సాహిత్య సిద్ధాంతాన్ని కాదనగల్గిన 'మేధావులు' ఉదయించారంటే అది విచిత్ర సన్నివేశమనే అనాలి. 'దీన్ని వ్యతిరేకించి, సామాజిక చైతన్యాన్ని రసదర్శనంగా మార్చుకొనే సాహిత్య ప్రక్రియలను చేపట్టి, అపూర్వంగా నిర్వహించి నవ్య సంప్రదాయోద్యమాన్ని సాగించారు నవ్య సంప్రదాయ కవులు. నవ్య సంప్రదాయ కవులది నవ్య రసమార్గమనటం మరింత

14. భావాభ్యుదయ నవ్యసంప్రదాయోద్యమాలను గురించి ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులవారు మూడు చక్కని వ్యాసాలను ఈ తర్వాత 'కవి - కవిస్వామ్యం' అన్న గ్రంథంలో రాశారు. ఈ గ్రంథంలో సాహిత్య చరిత్రలో ఈ మూడు కవితోద్యమాలపై సత్యదర్శనం ప్రారంభమైంది.

15. 'నవ్య సంప్రదాయవాదులు - తిప్పికొట్టిన దాడులు' - అన్న వ్యాసంలో.

సమంజసం'16 అని, ఈ మార్గంలోని రచయితల సాహిత్య సిద్ధాంతాన్ని తేలుస్తారు సుబ్రహ్మణ్యంగారు. రససిద్ధాంతం యొక్క ప్రభావం తొలిరోజులలో అభ్యుదయకవుల చేతనమీద కూడా ఎలా పడిందో 'నవ్య సంప్రదాయోద్యమం: సాహిత్య విమర్శ' అన్న వ్యాసంలో వీరు ఎత్తి చూపారు.

మొత్తం జాతీయోద్యమాన్ని నిర్లక్ష్యం చేస్తూ వచ్చిన అల్ప సంఖ్యాకుల ఉద్యమాన్ని కాదని, దాన్ని ఎదురొడ్డి నిలిచి దేశంలో నిర్మాణాత్మకమైన సాహిత్య సృష్టికి కారణమైన మహా సాహిత్యోద్యమాన్ని నడిపినవాడు విశ్వనాథ. ఆ మహా రచయిత కేవల రచయితగానే కాక ఒక సాహిత్యోద్యమ కర్తగా ఎట్లా సాహిత్య చరిత్రను సృష్టించాడన్నది ఈ గ్రంథం యొక్క కేంద్ర బిందువు. 'జాతీయోద్యమ స్పృహ సాహిత్యోద్యమంగా రూపొందటమే సామాజిక సాహిత్య స్పృహగా నవ్యసంప్రదాయవాదులు భావిస్తారు'17 అన్న లక్షణం విశ్వనాథవారి ప్రత్యక్షరంలోనూ కన్పిస్తుంది. ఒక మహా రచయిత ఒక మహా సాహిత్య పరంపరను పోషించి, పెంచి, కాపాడి, సాహిత్య స్రవంతిని పుష్టి పరిచినప్పటికీ, సాహిత్య ద్రోహం జరగనే జరిగి సాహిత్య చరిత్ర వక్రీకరింపబడింది. దీన్ని నిర్మూలించగలిగిన మేధాశక్తి, విశ్లేషణ, సత్య దర్శనం, పాండిత్యం, సాహిత్యానుభవం దండిగా ఉన్న మేధావి ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు. ప్రౌఢిమా, స్పష్టతా అన్న రెండు లక్షణాలు వీరి రచనల్లో ఉంటాయి. 'పద్యము వ్రాయుట యెట్టిదో, యొక వ్యాసము వ్రాసెడు శక్తియు నట్టిదే' అని విశ్వనాథవారే అన్నారు. సుబ్రహ్మణ్యంగారి వ్యాసాలన్నింటిలో ఈ శక్తి తొణికిసలాడుతున్నది. అంతేకాకుండా, వీరి వ్యాసాలన్నీ విజ్ఞానదాయకాలు. తోటి విమర్శకులకు జరిగిన అన్యాయాలను కూడా వీరి వ్యాసాలలో తొలగించడం మనం గమనించగల్గుతాము. ఈ వ్యాసాలన్నీ ఆంగ్లభాషలోకి కూడా అనువాదం కావాల్సి ఉన్నది. అప్పుడుకాని కూపస్థమండూకాల బోలు సిద్ధాంతాల అసలు రంగు బైటపడదు విమర్శకుడుగా, కళా తాత్త్వికుడుగా, తెలుగు సాహిత్య చరిత్ర వికాసాన్ని నిర్దిష్టంగా పరిశీలించిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి అరవయ్యేళ్ళంటే నమ్మదగినట్లుండదు ఇంకా ఎంతో సాహిత్య సేవ వారు చేయాల్సి ఉన్నది. దానికి భగవాన్ సాయిరాముడు వారిని ఆశీర్వదించాలని ప్రార్థిస్తూ, నమస్కరిస్తూ—

హైదరాబాదు,

1.9.1995. —వీరభద్రయ్య

16. 'నవ్య సంప్రదాయవాదుల నవరససూక్తం' - అన్న వ్యాసంలో.

17. 'నవ్య సంప్రదాయం : జాతీయదృక్పథం' - అన్న వ్యాసంలో.

# ఇందులో—

## అట్టమీది ఛాయాచిత్రాలు :

1. ముఖచిత్రం 1970 డిసెంబరు 31 వ తేదీన తెనాలి తాలూకా జూనియర్ కళాశాల హాలులో తిరుపతి వేంకటకవుల నాటక సాహిత్యం మీద జరిగిన సాహితీ సభలో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు జీవియస్‌ను శాలువతో సన్మానించి ఆశీర్వదించిన సందర్భంగా తీసిన ఛాయాచిత్రం. సభాధ్యక్షులు తెనాలి కె యల్. యన్. సంస్కృత కళాశాల ప్రధానాచార్యులు శ్రీ సూరి రామకోటిశాస్త్రిగారు. (చూడు : వినయభారతి : తాలూకా జూనియర్ కాలేజి, తెనాలి, విరోధకృత్ ఉగాది సంచిక 1971, సంపు. 14, సంచి. 1)

2. అట్ట వెనుక పై బొమ్మ : 1973 ఫిబ్రవరి 2 వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో జరిగిన సాహిత్య సభలో "ప్రథమాంధ్ర మహాపురాణము: ప్రబంధకథామూలము" అనే తన పిహెచ్.డి., సిద్ధాంత వ్యాసాన్ని మాన్యశ్రీ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అధ్యక్షులు)గారికి గౌరవంతో అంకితంగా సమర్పిస్తున్న జీవియస్. వేదికమీద డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు, శ్రీ ఎన్. నరోత్తమ రెడ్డిగారు (ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు) మొ॥ వారు ఆసీనులై ఉన్నారు.

3. అట్ట వెనుక క్రింది బొమ్మ : 1985 జనవరి 15 వ తేదీనాడు విజ్ఞాన దీపిక (హైదరాబాదు) త్యాగరాయ గానసభలో నిర్వహించిన సాహితీ సభలో "పిల్లలమర్రి పినవీరభద్ర కవి" అనే తన రచనను కృతిగా స్వీకరించిన గురుమూర్తి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిని సన్మానిస్తున్న జీవియస్. ఫోటోలో శ్రీ కె. వై. యల్. నరసింహారావు, శ్రీ ఎ. ఎన్. పురుషోత్తమరావు ప్రభృతులున్నారు.

# యుగకర్త విశ్వనాథ

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ, మస్మాదృశుం
డలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయ మూర్తి శిష్యు డయినా డన్నట్టి దా వ్యోమపే
శల చాంద్రీమృదు కీర్తి చెళ్ళపిళ వంశస్వామి కున్నట్లుగన్."

విశ్వనాథ సత్యనారాయణగారి పేరుతోపాటు తెలుగువారికి ఈ పద్యం జ్ఞాపకానికి వస్తుంది. ఆంధ్ర పౌరుషానికున్న వినయాహంకారాల విశేషాభివ్యక్తి ఈ పద్యం. విశ్వనాథ భారతికి చరణమంజీరం ఈ ఛందం. విశ్వనాథవారు తిరుపతి వేంకటకవుల ఆశుకవిత్వ, అవధాన కవిత్వోద్యమంలో గళమెత్తారు. కాల్పనికోద్యమంలో తమదైన ఒక శాఖను పండించుకొన్నారు. ప్రబోధ కవిత్వంలో తమ ప్రత్యేకతను ప్రకటించుకొన్నారు. నవ్యసంప్రదాయోద్యమానికి తామే నాయకులై దాదాపు నాలుగు దశాబ్దాలు యుగకర్తగా తెలుగు సాహిత్యాన్నంతా ఆవరించారు.

వెయ్యేళ్ళ తెలుగుసాహిత్యంలో 'కవిసార్వభౌముడు' అంటే శ్రీనాథుడు; 'కవిసమ్రాట్' అంటే విశ్వనాథ సత్యనారాయణ. వీరిద్దరు బిరుదాలకే బిరుదాలైన వారు. విశ్వనాథ 1895 సెప్టెంబరులో 10 వ తేదీన జన్మించారు. ఈ 1994 సెప్టెంబరులో నూరవయేట ప్రవేశిస్తున్నారు. 1995 సెప్టెంబరులో శతాబ్ది పూర్తి చేసుకుంటారు. ఈ సంవత్సరమంతా దేశమంతా విశ్వనాథ శత జయంతిని సమధికోత్సాహంతో జరుపుకొంటోంది. యువభారతి (సాహితీ సాంస్కృతిక సంస్థ) ఆ సాహితీ మహాయజ్ఞంలో తానూ ఒక సమిధ నిచ్చినట్లుగా సెప్టెంబరు 4 వ తేదీన విశ్వనాథ శతజయంతి మహోత్సవాలలో భాగంగా 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' ప్రారంభించింది. 1995 సెప్టెంబరు 3 వ తేదీ దాకా ప్రతి నెలా మొదటి ఆదివారం సమాలోచన కార్యక్రమం నిర్వహిస్తుంది అందులో సమర్పింప

బడిన ఉపన్యాస వ్యాసాలను ఒక గ్రంథంగా వెలువరిస్తుంది. జంట నగరాలలో విశ్వనాథ శత జయంతి మహోత్సవాలకు యువభారతి కార్యక్రమం ఒక శుభారంభం!

విశ్వనాథ ఈ శతాబ్ది తెలుగు కవులందరిలో జీనియస్. ఆయన ఏ బాటలో నడచినా సమ్రాట్టు. ఆత్మీయం, ఆత్మాశ్రయం, ఆత్మనాయకంగా అవిష్కృతమైన భావకవిత్వంలో సైద్ధాంతిక స్వభావాన్ని పోషించిన కవితా శాఖకు ఆయన అధ్యక్షుడు. భావకవిత్వం మీద తిరుగుబాటు ప్రకటించి, నవ్య సంప్రదాయోద్యమాన్ని ముందుకు నడిపించడంలో ఆయన సర్వసేనాని. భారతీయ సంస్కృతి ఆయన హృదయస్పందన. ఆంధ్రపౌరుషం ఆయన రక్తప్రవాహం. చారిత్రక కావ్యం ఆయన విశిష్టప్రయోగం. విషాదాంత నాటకం విశ్వనాథవారి ప్రాక్పశ్చిమ నాటకశిల్ప సమన్వయకేతనం. నవలలో ఆయన ముట్టని ప్రయోగం లేదు, పట్టని శిల్పంలేదు; చూపెట్టని సమకాలీన జీవితచైతన్య ప్రవృత్తిలేదు. విశ్వనాథ మధ్యాక్కరలు ప్రవృత్తి నివృత్తుల మధ్య ప్రతిస్పందించే జీవునివేదనల భవ్యసంగీతాలు. రామాయణ కల్పవృక్షం ఆధునిక మానవచైతన్యంలో ప్రపంచ మంతా ప్రతిఫలిస్తున్న ఆధ్యాత్మిక అన్వేషణకు అద్దంపట్టే ఇతిహాసకావ్యకల్పన. ఈ శతాబ్ది చైతన్యాన్నంతా అగస్త్యునిలా ఆపోశనపట్టి, భారతీయదార్శనిక మూల్యాలలో దానిని విలువకట్టిన ప్రజ్ఞామూర్తి విశ్వనాథ. ఏనాడైనా ఆధునిక జీవితంలోని భారతీయమూల్యాలను ఏ తరంవారికైనా తెలుగువారు వ్యాఖ్యానించి చెప్పదలచుకొంటే కథలలో, నవలల్లో, పాటలలో, పద్యాలలో, శతకాలలో, కావ్యాలలో, నాటకాలలో, విమర్శలలో, వ్యాఖ్యానాల్లో, ఉపన్యాసాలలో తన పలికిన పలుకే ఒక ప్రమాణంగా, ఒక ఆలోచన సరళికి ఆదర్శంగా నిలిచిన పూర్ణ ప్రతిభామూర్తి విశ్వనాథ!

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు సృష్టించిన సాహిత్యాన్నంతా గమనిస్తే, దాదాపు ఇరవయ్యో శతాబ్దపు పూర్వార్ధంలో జీవించిన తెలుగుసమాజం పొందిన పరిణామాలూ, ఆ పరిణామదశలలో జాతి అనుభవించిన సుఖదుఃఖాలూ, మారుతున్న కాలంలో జీవితపువిలువలను గురించి ప్రజలు సాగించే తర్క వితర్కాలూ, వాటి వాస్తవిక అనుభవాల అనుశీలనాలూ, వాస్తవజీవితంలో పరి పూర్ణతా సాధనకోసం మనిషిపడే జీవుని వేదన, పంచకోశాత్మక ప్రవృత్తుల

ద్వారా ప్రపంచం సాధించే పరిపూర్ణానుభూతి యొక్క కళాత్మకాభివ్యక్తి, సామాజిక సాంస్కృతిక జీవితమూల్యాల వివేచనం, ప్రపంచ సమస్యలకు పరిష్కారాలు భారతీయదర్శనాలే ఇవ్వగలవన్న ఆత్మవిశ్వాసం - ఇలా అన్నీ కలిసి ఒక సజీవ చలనచిత్రంలా మన కళ్ళముందు ప్రత్యక్షమౌతాయి. విశ్వనాథ వాఙ్మయం ఒక అర్ధశతాబ్ది సజీవ సమాజ జీవిత సమీక్ష!

భావకవితా యుగంలో విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి, గిరికుమారుని ప్రేమగీతాలు మరవురాని మహనీయ రచనలు. వరలక్ష్మి త్రిశతి అపూర్వమైన స్మృతికావ్యం. మహాకావ్యరచనలో శ్రీమద్రామాయణ కల్పవృక్షం సాటిలేని మేటి రచన. చారిత్రక కావ్య మార్గంలో ఆంధ్ర పౌరుషం, ఆంధ్ర ప్రశస్తి, ఝూన్సీరాణి, శివార్పణం - ఈ నాలుగూ నాలుగు విశిష్టప్రయోగాలు. విశ్వనాథ వారి ఆంధ్ర ప్రశస్తి ఆంధ్రజాతి అంతరాత్మను ఆర్ద్రం చేసింది.

"ఇమ్ముగ కాకుళమ్ము మొద లీవరకుం గల యాంధ్రపూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలొ చలించిపోవు నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని ఎన్నిజ
న్మమ్ములు గాగ నీతనువునన్ బ్రవహించునొ యాంధ్రరక్తముల్."

తెలుగులో ప్రబోధకవిత్వాన్ని రచించి ఆంధ్రాభిమానాన్ని జాగృతం చేసిన వారిలో నలుగురిని మనం ముందుగా చెప్పుకొంటాం. ఆంధ్రులు తమ గత వైభవాన్ని జ్ఞాపకం చేసుకొని అభిమానంతో తలయెత్తటమే కాకుండా ఆత్మ విశ్వాసంతో అహంకరించాలని ప్రబోధించినందుకు రాయప్రోలు సుబ్బారావు గారిని అభిమానిస్తాం. ఆంధ్రుల ఉదాత్తసంస్కారాన్ని చరిత్ర సన్నివేశాలతో వినిపించి జాతి సుప్తచైతన్యంలో ఉన్న స్వాతంత్ర్యేచ్ఛను పురివిప్పేటట్లు చేసిన విశ్వనాథవారిని ఆత్మీయంగా హృదయానికి హత్తుకుంటాం. రాష్ట్రగానాన్ని పాడి తెలుగు వారిని ఉద్యమచైతన్య మూర్తులుగా మార్చిన తుమ్మలవారికి వీరవందనా లర్పిస్తాం. ఆంధ్రేతిహాసాన్ని పురాణంగా వినిర్మించి జాతిని చరితార్థంచేసిన మధునాపంతులవారిని మనసారా అభినందిస్తాం. ఈ నలుగురిలో విశ్వనాథ వారిది విశిష్టపంథా.

విశ్వనాథవారు ఎంతటి కవులో అంతటి నవలా రచయితలు, నాటక కర్తలు, కథారచయితలు, విమర్శకులు, వక్తలు, ఏకవీర, వేయిపడగలు, చెలియలికట్ట, మా బాబు, బద్ధనసేనాని, తెఱచిరాజు, ప్రోయుతుమ్మెద - ఇలా వారి నవలల్లో ఒక్కొక్కటి ఒక్కొక్క వ్యక్తిత్వంతో ప్రయోగవైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. ఇంగ్లీషు నవలా ప్రక్రియలో తన కాలంలో వచ్చిన ప్రయోగాల కన్నింటికీ తెలుగులో సరివచ్చే రచనలు చేసిన ఏకైక నవలాకర్త విశ్వనాథ.

ఇంగ్లీషు సాహిత్యంలో నాలుగురకాల విషాదాంతనాటకాలు చిత్రించిన గౌరవం షేక్స్పియర్ మహాకవికి ఉన్నది, తెలుగులో అటువంటి విశిష్టప్రయోగ చతుష్టయాన్ని చేసి మెప్పించిన విషాదాంత నాటకశిల్ప చతురాననుడు విశ్వనాథ!

విశ్వనాథ వారిది కావ్యశిల్ప విమర్శ ప్రస్థానం. 'నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి' అనే విమర్శ గ్రంథం తెలుగులో 'ప్రాక్టికల్ క్రిటిసిజం'కు ప్రవేశద్వారం. అభిజ్ఞాన శాకుంతలంమీద, అల్లసాని పెద్దన అల్లికజిగిబిగి మీదా వ్రాసిన విమర్శలు ప్రతీకాత్మక విమర్శలకు ప్రామాణిక సూక్తాలు. ఆయన పద్యం పాడినా, పాట నాలపించినా తెలుగువారు తన్మయులై వినేవారు. ఱుస కొట్టి కసరుకొన్నా ముచ్చటపడి ఊరుకుండేవారు. విశ్వనాథ సాహిత్యాన్ని వ్యాఖ్యానిస్తోంటే వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య సంప్రదాయం వెలుగువాకలా జాలువారుతున్నట్లు అనుభవించేవారు. రచయితగా ఆయన ఒక సమగ్రవ్యక్తి; కళాప్రపూర్ణుడు.

> "కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
> తాంశములయందు తొంబదియైన పాళ్ళు
> ప్రాగ్వివశ్చిన్నతంబున రసము వేయి
> రెట్లు గొప్పది నవకథా దృతిని మించి."

'రసము వేయిరెట్లు గొప్పది' - అని విశ్వనాథ వ్యక్తిగా అన్నాడనటం కంటె నవ్యసంప్రదాయ యుగ ప్రవక్తగా అన్నాడనటం సమంజసం. నవ్య సంప్రదాయవాదం మొదట కాల్పనిక యుగ చైతన్యంమీద తిరుగుబాటు చేసింది. దానికి కారణం దార్శనికమైన భేదమే. కాల్పనిక సాహిత్యం పాశ్చాత్య సాహిత్య

సిద్ధాంతాల మూలబలం కలది. అయితే, అది తెలుగులో వెలుగునింపే నాటికి పాశ్చాత్య సాహిత్యాలలోనే పరిస్థితులు తారుమారయ్యాయి. ఆధునికయుగంలో టి. ఎస్. ఎలియట్ నుండి న్యూ క్రిటిక్స్ వరకు వ్యాపించివున్న పాశ్చాత్య సాహిత్యంమీద భారతీయ సాహిత్య దర్శన ప్రభావం గోచరిస్తున్న కాలమది. ప్రపంచ భాషా సాహిత్యాలన్నింటిలోనూ కావ్యానుశీలనానికి విశ్వజనీనంగా పనికి వచ్చే సాహిత్య సిద్ధాంతం 'రస సిద్ధాంత' మని విశ్వసిస్తున్న రోజులివి.

నవ్య సంప్రదాయవాదుల రస దర్శనం పాశ్చాత్యుల విషాదాంత నాటకం లోని 'కెథార్సిస్' అనుభవంలోని స్వభావాన్ని కూడా తనలో సంవదించుకొన్న అభినవరూపం, దానిని విశ్వనాథవారు కరుణరస దర్శనంలో అంతర్భవింప జేశారు. తెలుగులోని విషాద గంభీర నాటకాలలో గాని, విషాదాంత నాటకాలలో గాని, చారిత్రక కావ్య ప్రయోగాలలో గాని, రామాయణ కల్పవృక్షంలో పోషింప బడిన జీవుని వేదనలో గాని ప్రసరించిన రసదృక్పథం ప్రాచీన భరతశాస్త్ర సంప్రదాయానికి మాత్రమే పరిమితమైనది కాదు; ప్రాశ్చాత్య ప్రస్థానాలను గూడా తనలో సమన్వయించుకొన్న నవ్య దృక్పథం. దానికి ప్రవక్త, ప్రయోక్త విశ్వనాథ!

ఆంధ్ర సాహిత్య చరిత్రలో శృంగారరస దర్శనాన్ని అభినవంగా రూపొందించి, వివిధ ప్రయోగాలు చేసి చూపించి కావ్య యుగకర్తగా కీర్తింపబడు తున్నాడు కవిసార్వభౌముడు శ్రీనాథుడు. అలాగే ఆధునిక రసదర్శనాన్ని వివిధ ప్రక్రియలద్వారా, ప్రయోగాలద్వారా ప్రదర్శించి చూపించి నవ్యసంప్రదాయ యుగకర్తగా ప్రశంసింపబడుతున్నాడు కవిసమ్రాట్ విశ్వనాథ! *

(జీవియస్ కాలమ్ : ఆంధ్రభూమి : 16-9-1994)

# కవిసార్వభౌముడు : కవిసమ్రాట్టు

ప్రాచీనాంధ్రకవుల బిరుదా లన్నింటిలో మకుటాయమానంగా వెలుగొందేది 'కవిసార్వభౌమ' బిరుదం ఆధునికాంధ్రకవుల బిరుదాలలో అనుమానం లేకుండా అగ్రగణ్యమైనది 'కవిసమ్రాట్' బిరుదం. బిరుదాలలోనే కాకుండా ఆంధ్ర సాహిత్య చరిత్రలో నిర్వహించిన పాత్రలలో కూడా శ్రీనాథునికీ, విశ్వనాథకూ పోలిక ఉంది. మహాకవి శ్రీశ్రీయే ఆ సామ్యాన్ని భావించగలిగాడు. "ఈనాడు శ్రీనాథుడంతటివాడైన విశ్వనాథ సత్యనారాయణను నేను ఎంత గౌరవిస్తానో నీకు తెలియదూ?" అని శ్రీశ్రీ విశ్వనాథను ప్రశంసించాడు. 1973 జూన్‌లో విశ్వనాథను గురించి శ్రీశ్రీ రాసిన ఈ ద్విపదలు 'సత్యానికి ఉపదలు.'

"మాటలాడే వెన్నెముక
పాటపాడే సుషుమ్న
నిన్నటి నన్నయభట్టు
ఈనాటి కవి సమ్రాట్టు
గోదావరి పలకరింత
కృష్ణానది పులకరింత
కొండవీటి పొగమబ్బు
తెలుగువాళ్ళ గోల్డునిబ్బు
అకారాది క్షకారాంతం
ఆ సేతు మహికావంతం
అతగాడు తెలుగువాడి ఆస్తి
అనవరతం తెలుగు ప్రశస్తి
ఛందస్సు లేని ఈ ద్విపద
సత్యానికి నా ఉపద."

(కవివృద్ధ విశ్వనాథ - శ్రీశ్రీ-స్వాతి (మాసపత్రిక) 76వ సంచిక చూడు: విమర్శిని. II పు. 419.)

కవితాశైలిలో శ్రీనాథునికి విశ్వనాథకూ సామ్యం లేకపోవచ్చు కాని, తాను నివసించిన యుగ సాహిత్య దర్శనాన్ని తన ప్రయోగాల ద్వారా ప్రపంచించిన ప్రజ్ఞాప్రాభవాలలో వారిద్దరికీ పోలిక ఉన్నట్లు 'లోనారసి' చూచేవారికి గోచరిస్తుంది. అంత లోతు చూపు సారించకపోయినా బయటికికూడా అప్రయత్నంగా కనపడే కవితావ్యక్తిత్వ స్వభావాలు ఆ యిరువురిలో కొన్ని ఉన్నాయి. తనకు ముందున్న మహాకవుల కవితావ్యక్తిత్వాలను, విశేషాలను తాను నిర్వచించి, తన కవిత్వంతో వారి రచనాశిల్ప విశేషాల సన్నింటిని సంవదించుకుంటూనే, స్వీయ కవితాభివ్యక్తి గల సాహితీ ప్రస్థానాన్ని సాగించినట్లు పద్యమయంగా ప్రకటించటం శ్రీనాథ కవిసార్వభౌమునికిలాగా 'కవిసమ్రాట్' విశ్వనాథకు కూడా సహజ లక్షణం. అవిచ్ఛిన్న సంప్రదాయ దృష్టి గల ఇద్దరు కవి సమ్రాట్టుల అభివ్యక్తి శిల్పాలివి—

''వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొకొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు....'' (కాశీఖండం. 1. 13)

అని శ్రీనాథుడు రచించిన సీస పద్యం తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధం. ఇది ఒక క్రొత్త బాణీని సృష్టించింది. శ్రీనాథుడు చెప్పిన నన్నయగారి ఉభయవాక్ప్రౌఢిని, తిక్కనగారి రసాభ్యుచిత బంధాన్ని, ఎఱ్ఱయగారి సూక్తి వైచిత్రిని తరువాతి విమర్శకులు అనుశీలన సూత్రాలుగా గ్రహించి కవిత్రయ కవితావ్యక్తిత్వాలను పరిశీలించటం నేర్చుకున్నారు. శ్రీనాథుని కవితలో అవి ప్రతిఫలించిన వైఖరిని వివేచించటం మొదలుపెట్టారు. ఇటువంటి బాణీని విశ్వనాథవారు కూడా ప్రదర్శించారు. అయినా అది అనుకరణం కాదు - పునస్సృష్టి.

''ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన శిల్పపుఁ దెనుఁగు తోట
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు
పోతన్న తెలుగుల పుణ్యపేటి

శ్రీనాథుఁడు రసప్రసిద్ధ ధారాధుని
కృష్ణరాయఁ డనన్య కృతిప్రబంధ
పెద్దన్న పడపోతపెట్టి నిష్ఠురసంబు
రామకృష్ణుడు సురారామగజము
ఒకడు నాచన సోమన్న; యుక్కువుండు
చెఱిపి పదిసార్లు తిరుగవ్రాసినను మొక్క
వోని యీ యాంధ్రకవిలోక మూర్ధమణుల
మద్గురుస్థానములుగ నమస్కరించి....''

(రామాయణ కల్పవృక్షం : అవతారిక)

ఈ పద్యం శ్రీనాథుని పద్యంలా సాహిత్య సంప్రదాయంలో సజీవంగా ప్రవహిస్తోంది. ఈనాడు ప్రాచీన కవుల వ్యక్తిత్వాలను వివేచించేటప్పుడు విశ్వనాథ వేసిన విశేషణాలను పరిగణనలోకి తీసుకోకపోతే ఆ పరిశీలన సమగ్రం కాదని సాహితీవేత్తలు భావిస్తారు. ''నన్నయ్యయు, తిక్కన్నయు నన్నావేశించిరి, పరిణాహమనస్సంధన్నత వారలు పోయిన తెన్నున మెఱుఁగులను దీర్చిదిద్దుచు పోదున్'' - అని విశ్వనాథ పేర్కొన్నప్పుడు 'రెండవ వాల్మీకి,' 'శిల్పపుఁ దెనుఁగుతోట' అయిన నన్నయ తిక్కనలే ఆయనను ఆవేశించారని భావించాలి గాని మన ఊహలను, అభిమానద్వేషాలను అందులో పొందించటం సమంజసం కాదు.

విశ్వనాథవారి వివేచనలో శ్రీనాథుడు 'రసప్రసిద్ధధారాధుని'. స్వీయ భావనలో 'రసము వేయిరెట్లు గొప్పది నవకథాధృతిని మించి', అంటే - రస దర్శనానికి సంబంధించిన సామ్యం శ్రీనాథునిలో, విశ్వనాథలో మనం దర్శించ టానికి వీలుందన్నమాట! లోతుగా ఆలోచిస్తే ఈ లోగుట్టు తెలియవచ్చు. ఎందుకంటే విశ్వనాథవారే తమ సరస్వతిని గురించి ఇలా చెప్పుకున్నారు:

"తనలోతు నెఱుఁగని జనుల పూజకుఁ దిర
స్కృతిఁ జూపు మత్సరస్వతి సుభద్ర
తన లోతు నెఱిఁగిన జనుల పూజకు నవా
దృతిఁజూపు మత్సరస్వతి సమార్ద్రి"

......"మత్సరస్వతి భావసామ్రాజ్యలక్ష్మి;
శక్తి యున్నట్టిచో మెత్తబడెడు దేవి."

అందువలన కవిసార్వభౌముని రసదర్శనాన్ని, కవిసమ్రాట్టుల రస దృక్పథాన్ని లోతుగానే పరిశీలించవలసి వస్తుంది.

శ్రీనాథుడు శృంగారిగా ప్రసిద్ధి. శృంగారి అంటే స్త్రీలోలుడని కాదు. శృంగారరసప్రియుడని భావం శృంగారరసమంటే భరతశాస్త్ర సంప్రదాయంలో చెప్పే అష్టవిధ రసాలలో రతిస్థాయి అయిన శృంగారం కాదు. భోజుడు ప్రతిపాదించిన శృంగారరసం. భోజుని దృష్టిలో శృంగారమే ఏకైకరసం. అది అభిమానరసమనీ, అహంకారరసమనీ పిలువబడుతుంది. దానివల్లనే కావ్యానికి కమనీయత్వం ఏర్పడుతుంది. రసానికి సిద్ధి రసికునియందు కలుగుతుంది. రసికునిలోని ఆత్మసమ్యగ్గుణోద్భూతమైన అహంకారమే సుఖదుఃఖాత్మకంగా రస్యమానాలుగా చేస్తుంది. రసికునిలోని అభిమాన ప్రవృత్తి అనేక జన్మానుభవజనిత సంస్కారాలయొక్క ఉత్కృష్టదశ. అట్టి ప్రవృత్తికలవాడే రసికుడైన కవి. రసికుడైన సహృదయుడు. రసికుని శృంగారి అంటారు. శృంగారి అయిన కవి రచించిన కావ్యం రసమయం భోజుని దృష్టిలో అహంకారరసమే రసం. రత్యాది స్థాయిభావాత్మకమైన రసాలు అతని దృష్టిలో ఔపచారికాలు. వట్టి భావప్రకర్ష రూపాలే. అహంకారం అగ్నిసదృశమైన సహృదయుని మూలప్రవృత్తి. భావాదులు ఆ అగ్నికి శిఖల వంటివి. అవి దాని తేజస్సును హెచ్చించినట్టివే. మూలప్రకృతి అయిన అహంకారాగ్నియే లేకపోతే శిఖలు లేవు, రసదీప్తి లేదు. శృంగారం రసరాజమంటే రసాలన్నింటికీ మూలమైన రసమనీ, అదే అహంకారమనీ, దానిపేరే శృంగారమనీ భోజుని మతం.

భోజుని రసికత్వాన్ని ముమ్మూర్తులా తనలోనూ తన సాహిత్యంలోనూ, కావ్యాస్వాదనంలోనూ స్థాపించిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. అయితే, అతని కంటె ఆధునికుడు కావటంచేత భోజుడంగీకరించిన దశరసాలనే కాక భక్తిని కూడా రసంగా సంభావించాడు. అతని ఆశువు, చాటువు, కావ్యకవిత - అన్నీ శృంగార ప్రకాశకాలే. అతని సర్వకవితాభివ్యక్తికి మూలప్రకృతి శృంగారం. అందులో నుండి దశరసాలతోపాటు భక్తికూడా జనించి జ్వలిస్తుంది. శ్రీనాథునిది సాహంకారభక్తి అనీ, సాభిమాన భక్తి అని విమర్శకులు గుర్తించారు. ఆ అభిమానం, ఆ అహంకారం భోజప్రతిపాదితమైన రసాస్వాదన శక్తియొక్క మూలప్రకృతి. శ్రీనాథుడు తెలుగు సాహిత్యానికి మూడు మేలులు చేశాడు. అవి:
1. శృంగారమే రసం అనే ఆలంకారిక దర్శనానికి లక్ష్యాలను సమకూర్చాడు.
2. భక్తి వాత్సల్యాలు కూడా రసస్థితిని పొందగలిగిన భావాలని నిరూపించాడు.
3. శృంగారి అయిన కవికి తాను అనుభవించిన భావస్థితిని అందించటానికి అనువైన ఒక రసికవాగ్వైఖరి కూడా ఉండాలనే స్పృహను ప్రపంచించాడు. కవిత్రయ యుగంకంటె విలక్షణమైన కావ్యసాహిత్యం తెలుగులో వెలువడటానికి

శ్రీనాథుని రసదర్శనం, దానినుండి పుట్టిన కవితాశైలి కారణాలైనవనటంలో ఎటువంటి సంశయమూ లేదు.

ఆధునికులైన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు కరుణరస దార్శనికులు. "ఏకోరసః కరుణ ఏవ...." అని భవభూతి ప్రతిపాదించిన సిద్ధాంతానికి రస సమీకరణస్థాయిలో వ్యాఖ్యానం చెప్పి కరుణరసవాదానికి ఒక అస్తిత్వాన్ని కలిగించటమే కాకుండా, కరుణయే సర్వరసాలకు మూలమైన రసమని తాను విశ్వసించినట్లు చెప్పారు. వారి 'జీవునివేదన' అనే అంశం కరుణరస సమీకరణవాదంలో నుంచి పుట్టిన అద్వైతపరిభాషగా విజ్ఞులు భావిస్తున్నారు. కరుణరసవాదానికి విశ్వనాథ వివరణమిది-"లోకములో తన సొంతబ్రతుకుతో అక్కఱలేకుండ నంతరాంతరముననే యనుభవించు భావములు - భయము, జుగుప్స ఆశ్చర్యము, దుఃఖము. ఇవి ఎవనికివాడు లోన ననుభవించునవే తప్ప వానికి బహిరావిష్కృతిలేదు. వీనిలో మకుటాయమానమైనది దుఃఖము. ఈ దుఃఖము జన్మలక్షణమని కూడ చెప్పబడినది. ఎవడీ దుఃఖము యొక్క స్వరూపము తెలియునో వానికి సర్వరసములు కరతలామకములుగానుండును. వానిని వినయము భజించును. వాడు పరమేశ్వరునికి దగ్గరివాడు. వాడు కావ్యజ్ఞుడు. వాడు కష్టమునం దొక సుఖమును చూడగలడు. వాని గుండియ జాలికి ఉనికిపట్టు. వాని హృదయమునం దార్ద్రతాలక్షణము నెలకొనును. ఆ యార్ద్రతాగుణమే హృదయమునందు నెలకొన్నచో సర్వకావ్యములయందలి రసములు వానికి కరతలామలకములు. అందుకనియే భవభూతి "ఏకోరసః కరుణ ఏవ....తత్సమస్తమ్-శోకము స్థాయిభావము, రసము కరుణము. కావున తక్కిన రసములన్నియు రసములు కావు, ఒక్క కరుణరసమే రసము. తక్కిన రసములన్నియు దీనినుండియే పుట్టును లేదా ఇందులో లీనమగును. ఇది భవభూతిదృష్టమైన పరమార్థము. మానవ హృదయమును, బ్రదుకులోని సారమును విచారించి నిర్ణయించిన విషయము'' (కావ్యానందము).

ఆధునిక ప్రపంచ మానవ జీవితానికి మూలరసం కరుణం. ఆధునిక సిద్ధాంతాలన్నింటిలో ఈ రసవాదమే బహురూపాలతో ప్రత్యక్షమౌతోంది అటువంటి కరుణరసాన్ని కావ్యప్రక్రియలన్నింటిలో పట్టంకట్టిన మహాకవి విశ్వనాథ. శృంగారసద్రష్ట, స్రష్ట-కవిసార్వభౌముడు; కరుణరసద్రష్ట, స్రష్ట-కవిసమ్రాట్టు! అందుకే వీరిద్దరూ ఇద్దరే! *

(జీవియస్ కాలమ్ : ఆంధ్రభూమి : 23-9-1994)

# విశ్వనాథ నవ్యసంప్రదాయం

"నిజానికి శిల్పము కాని, సాహిత్యము కాని జాతీయమై యుండవలెను. విజాతీయమై యుండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవారికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద పక్షి ఎగిరినను రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత, ఇది సంప్రదాయము" (మహతి).

విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యోద్యమం వెనుకనున్న బలమైన జాతీయతా చైతన్య మీ మాటలలో స్పష్టమౌతోంది. సాహిత్యం, శిల్పం విజాతీయం కాకుండా జాతీయం కావాలన్న పిలుపు కాలమిచ్చింది. ఆ సమకాలీన చైతన్యానికి 'విశ్వనాథ' - సృజనాత్మక సాహిత్య శక్తి. విశ్వనాథవారిని సవ్యంగా అర్థం చేసుకోకపోతే ఆయన ప్రగతి విరోధిగా భ్రమపడే ప్రమాదం ఉంది. మాన్యశ్రీ పి.వి. నరసింహారావుగారు చేసిన హెచ్చరిక గమనించదగింది—

"శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రగతికి వ్యతిరేకులుగారు. ప్రాచీన సంస్కృతి మీద వారికి గల శ్రద్ధ అంధ శ్రద్ధకాదు. వారు సంప్రదాయబద్ధులైన పిడివాదులుకారు. ఓర్వలేనివారుకారు. అక్కడక్కడ ధర్మారావు సంభాషణల్లో వితండవాదం గోచరిస్తుంది. అయితే, దానికి కారణం ఉంది. ప్రతిపక్షాలవారు చేస్తున్న తీవ్రమైన ఆరోపణలకు, ఆక్రమణలకు సమాధానంగా శ్రీ విశ్వనాథ అంతటి వితండవాదాలు చేయించారు. స్వధర్మ రక్షణకు అవి ఉద్దేశింపబడ్డాయి. స్వయంగా దురాక్రమణ కావించాలనే ఉద్దేశ్యం కొంచెమైనా వారికి లేదు. సహస్ర ఫణ్ (వేయిపడగలు)లో అనేకచోట్ల ఈ విషయం మనకు గోచరిస్తుంది."

సంస్కృతికి సంబంధించినంతవరకు పి.వి గారి మాటలు అక్షర సత్యాలు. ఈ దృక్కోణంతోనే విశ్వనాథ సాహిత్య శిల్ప దృక్పథాన్ని కూడా గమనింపవలసి ఉంటుంది. ఆ బాటలో కొన్ని మాటలు.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో మార్గ, దేశి పద్ధతులు వినిపిస్తాయి. అవి శివకవులు కన్నడం నుండి అరువు తెచ్చినవి. ఏమైనా, శివకవులు చెప్పేదేమిటంటే- శుద్ధమార్గ, శుద్ధదేశి పద్ధతులు వారికి గ్రాహ్యాలు కావు. ఆ రెండూ కలిసి ఏర్పడిన దేశి ఉపాదేయం వారికి. పంపాదులనుసరించిన దేశి పద్ధతి అదే. నన్నెచోడాదులు ఆశించిన దేశి విధానం కూడా అదే. ఈ సంప్రదాయాన్ని ఉదాహరణంగా తీసుకొన్నా విశ్వనాథవారు చెప్పుతున్న జాతీయమైన సాహిత్య శిల్ప విషయం కొంత స్పష్టమౌతుంది. ఈ అంశాన్ని ప్రక్రియాపరంగా, శిల్పపరంగా, రసపరంగా, భావజాలపరంగా ఇలా ఎన్నో రకాలుగా వివరించవచ్చు. ప్రస్తుతానికి ప్రక్రియాపరంగా స్థూలంగా పరిశీలిద్దాం. ఎందుకంటే, ప్రక్రియా పరిశీలనం మిగిలిన వాటికన్నిటికీ ప్రాతిపదికలాంటిది

విశ్వనాథవారు జాతీయ, విజాతీయ శబ్దాలు వాడారు ఒక్కొక్క జాతి సృష్టించుకొని అనుభవించే సాహిత్యానికి అనుభూతి ప్రాతిపదికలనందించే మూల ప్రక్రియలు కొన్ని ఉంటాయి. వాటినుండి వివిధ ప్రక్రియలు శాఖోపశాఖలుగా పెరిగి విస్తరిల్లవచ్చు. భారతీయ సాహిత్యాలన్నింటిలో పురాణ, ఇతిహాస, కావ్య, రూపక, గేయాలు మూల ప్రక్రియలుగా ప్రసిద్ధిచెంది ఉన్నాయి. ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రక్రియలన్నీ వీటికి ప్రతిరూపాలో, మిశ్రరూపాలో, శాఖోపశాఖలో అయి ఉంటాయి. వీటి స్వరూప స్వభావాలను, తాత్త్వికచింతనను, అనుభవ సాంద్రతను గుర్తించటం తెలుగుజాతికి సులభం. నైజం.

వీరేశలింగం పంతులుగారు పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాన్ని తెలుగులో ప్రవేశపెట్టారు. ఇంగ్లీషు సాహిత్య మూల ప్రక్రియలు ఎపిక్, లిరిక్, ట్రాజెడీ, నావెల్. ఆ సాహిత్య సమాలోచనమంతా ఆ ప్రక్రియల శక్తిని, యుక్తిని తెలిసి అధ్యయనం చేయటంలో, సృజనం చేయటంలో, అనుభవించటంలో ఉంటుంది. పైనాలుగు ప్రక్రియలలో నవలకు మిగిలిన మూడింటికున్న సాహిత్యగౌరవం లేదు. ఏమైనా, వీరేశలింగం పంతులుగారు పునరుజ్జీవన యుగచైతన్యాన్ని, సంస్కరణ ప్రవృత్తినీ పోషించటానికి నవలను, వ్యాసం వంటి వచన ప్రక్రియలను ఎన్నుకొన్నారు. పాశ్చాత్యప్రక్రియల ప్రాతిపదికలు జాతీయమైనవి కావు కాబట్టి వాటిని, విశ్వనాథ వారి పరిభాషలో, విజాతీయాలని పిలవాలి.

పాశ్చాత్య ప్రక్రియా పరిజ్ఞానాన్ని ప్రాతిపదికగా చేసికొని ప్రయోగాలు చేసినవారు గురజాడ; రాయప్రోలు, దేవులపల్లి, కట్టమంచి, రాళ్ళపల్లి మొదలైన వారు. ఆంగ్ల పునరుజ్జీవన యుగంలోని లిరిక్‌ను లక్ష్యంగా పెట్టుకొని, గేయ ప్రధానమైన లిరిక్కును గురజాడ రచిస్తే, పద్యప్రధానమైన లిరిక్కును రాయప్రోలు దిద్దితీర్చారు. ఆపైన దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు కాల్పనిక యుగపు లిరిక్కు వంటివాటికి తెలుగులో వెలుగునింపారు. కట్టమంచివారు కాల్పనిక యుగ విమర్శ సూత్రాలను తెచ్చి ప్రాచీనాంధ్ర ప్రబంధాలకు పట్టించి ఎడాపెడా వాయించారు. రాళ్ళపల్లివారు పాశ్చాత్య సౌందర్య శాస్త్రంలోని రస సిద్ధాంతాన్నీ, విషాదాంత నాటక తత్త్వాన్నీ తెలుగులో ప్రపంచించారు. నిస్సంశయంగా వీరి ప్రయోగాల తాత్త్విక మూలాలు పాశ్చాత్యాలే ఆ లక్షణాలు తెలియకపోతే అవి సొంతం ఆస్వాదనీయం కావు కూడా!

ఒకవైపు వీరేశలింగం పంతులుగారు పాశ్చాత్య ప్రక్రియా సంప్రదాయాన్ని ప్రచారంలోకి తెస్తూంటే, మరొకవైపు తిరుపతి వేంకటకవుల కవితోద్యమం అచ్ఛమైన దేశీయస్వభావాన్ని ప్రదర్శించి, ప్రజాదరణాన్ని విశేషంగా చూరగొన్నది. పద్యనాటకం రంగంమీద విజయయాత్రలు సాగించింది. తెలుగులో పాశ్చాత్య నాటకానువాదాలకు ఏమాత్రం ప్రోత్సాహం లభించలేదు. భారతీయ నాటకాలకు, భారతీయ వస్తువులతో వ్రాసిన విషాదాంత నాటకాలకు ప్రాచుర్యం లభించింది.

ఈ చారిత్రిక పరిణామ సత్యాలను గమనిస్తే తిరుపతి వేంకటకవుల తరువాతి తరంవారు, ముఖ్యంగా వారి శిష్యులు, ప్రక్రియాపరంగా తెచ్చిన మార్పులు మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. కాల్పనిక, అభ్యుదయ కవిత్వంలో వెలువడిన ప్రయోగాలన్నీ చాలవరకు పాశ్చాత్యప్రక్రియలకు ప్రతిబింబాలే. విశ్వనాథాదులు ఈ ప్రవృత్తిని గర్హించారు. అయితే విదేశీ వస్త్ర బహిష్కారంలా తగలపెట్టమనలేదు; 'క్విట్ ఇండియా' ఉద్యమంలోలా దేశం వదలి పొమ్మనలేదు. విశ్వనాథాదుల జాతీయతావాద మెటువంటిదంటే—

ఈ దేశంలో పుట్టిన ప్రక్రియలలో పాశ్చాత్య ప్రక్రియలు లీనం కావాలి కాని, దేశీయ ప్రక్రియలు విదేశీ ప్రక్రియలలో లీనం కారాదు. అంతేకాదు, విదేశీ

ప్రక్రియలనే స్వీకరించి దేశీయ ప్రక్రియలను చిన్నచూపు చూడరాదు. భారతీయ సంస్కృతిలో ఈ దేశంలో నివసించటానికి వచ్చినవారి సంస్కృతులు స్నేహ సౌహార్దాలతో లీనం కావడం ఇక్కడి జాతీయత, సంప్రదాయం. విశ్వనాథవారు సాహిత్యపరంగా, శిల్పపరంగా కూడా ఆ అవిచ్ఛిన్న సంప్రదాయాన్నే కోరారు.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు భారతీయ మహా కావ్య సంప్రదాయంలో పాశ్చాత్యుల ఎపిక్ సంప్రదాయాన్ని విలీనం చేసుకోగలిగిన ఒక నవ్య సంప్రదాయాన్ని ఆవిష్కరించారు. శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలా అది ఫలించింది. భారతీయ గేయకావ్య సంప్రదాయంలో లిరిక్‌ను లీనం చేసుకొన్న గొప్ప రచన "కిన్నెరసాని పాటలు." భారతీయమైన కరుణరస సమీకరణ వాదంలో పాశ్చాత్యుల కెథార్సిస్‌ను సమన్వయించుకొని అధునికమైన "ఏకోరసః కరుణ ఏవ'' అనే సిద్ధాంతాన్ని ఖండకావ్యాలద్వారా, చారిత్రక కావ్యాలద్వారా, విషాదాంత నాటక ప్రయోగాలద్వారా విశ్వనాథవారు ప్రపంచించి చూపించారు. విశ్వనాథవారి 'నర్తనశాల' విషాదాంత నాటకాన్ని గర్భీకరించుకొన్న భారతీయ నాటకం. మిగిలిన మూడూ ఆ మార్గంలోనే విశిష్ట ప్రయోగాలు. విశ్వనాథ నవలలు పాశ్చాత్య రూపాలను భారతీయ ప్రవృత్తితో పుక్కిటపట్టిన సృజనాత్మక ప్రయోగాలు. పాశ్చాత్య సాహిత్య శిల్పాలు భారతీయ మహాసముద్రంలో నదుల్లాగా సంగమించాయి. విశ్వనాథ శుద్ధ పాశ్చాత్యం గాని, శుద్ధ దేశీయంగాని కోరలేదు, పాశ్చాత్య శిల్పంతో బలపడి, తన వినూత్న వ్యక్తిత్వంతో ప్రకాశించే జాతీయ సాహిత్య శిల్పాన్ని కోరాడు. అంతేకాదు - ప్రతి అక్షరం దానికి ప్రత్యక్షంగా వ్రాసి చూపించాడు.

విమర్శకుడుగా విశ్వనాథను వివేచించేటప్పుడు కూడా ఈ రహస్యాన్ని మరచిపోగూడదు. ఆయనమీద ఆంగ్ల సాహిత్య విమర్శ ప్రభావం లేదనలేము. కట్టమంచివారు ఆంగ్ల కాల్పనికోద్యమ విమర్శ చైతన్యాన్ని మాత్రమే తెలుగులోకి తేగలిగారు. విశ్వనాథవారు మాథ్యూ ఆర్నాల్డ్ నుండి న్యూక్రిటిక్స్‌వరకూ సాగిన విమర్శ చైతన్యాన్ని మెలకువగా తెలుగులోకి తేగలిగారు. ఒక విధంగా ఆనాటికి ఇంగ్లీషు సాహిత్య విమర్శయే భారతీయ సాహిత్య విమర్శచేత ప్రభావితమై ఉంది. అందువల్లనే విశ్వనాథ భారతీయాధిక్యతను విమర్శలో చాటి చెప్పారు.

వీరేశలింగంపంతులు గారి నుంచి విశ్వనాథ సత్యనారాయణగారి దాకా సాగిన సాహిత్య విమర్శను ఆంగ్లప్రభావ పరిశీలనదృష్ట్యా గమనిస్తే క్రమంగా - ఆకృతిమీదా, ఆలోచనమీదా, అనుభవంమీదా ప్రభావం పడిన జాడలు గోచరిస్తాయి. పంతులుగారి నుంచి కట్టమంచికి ముందుదాకా ఆంగ్లప్రభావం ఆంధ్ర విమర్శయొక్క ఆకృతిమీద పడింది. కట్టమంచి నుంచి ఆలోచనమీద ప్రసరించింది. రాళ్ళపల్లి దువ్వూరులు దాన్ని అనుభవంవైపు మళ్ళించారు. విశ్వనాథ విమర్శలో అనుభవంమీది ప్రభావం ఒక పరిపూర్ణతను సాధించింది.

ఆకృతిమీద పడిన ప్రభావం విమర్శచేత సాధన చేయిస్తుంది. ఆలోచనపై పడిన ప్రభావం విమర్శచేత భావన చేయిస్తుంది. అనుభవంమీద పడిన ప్రభావం విమర్శచేత దర్శనం చేయిస్తుంది. దర్శనం చేయగల రచయిత ప్రక్రియలను ప్రజ్ఞతో సృష్టించగలడు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఇంగ్లీషు సాహిత్యంలోని ఎపిక్, లిరిక్, ట్రాజెడీ, నావెల్ - అనే మూల ప్రక్రియలకు విదేశీ స్వభావాన్ని పోగొట్టి భారతీయ స్వభావాన్ని కలిగించి, దేశీయ ప్రక్రియలలో అంతర్భవింపజేసి, జాతీయతను ప్రకటించటంతోపాటు సంప్రదాయాన్ని సాధించారు విశ్వనాథవారు. పాశ్చాత్యదర్శన మూలాలైన ప్రక్రియలకంటె, సాహిత్య శిల్పాలకంటె జాతీయ మూలాలైనవే శక్తిమంతాలని చెప్పి, వాని మెప్పించిన దేశీయతాభిమాని విశ్వనాథ. ఆ కాలంలో ఆయన నడచిన మార్గం నవ్యసంప్రదాయం!

జీవియస్ కాలమ్ : (ఆంధ్రభూమి : 30-9-1994)

# నవ్య సంప్రదాయోద్యమం : విశ్వనాథ భూమిక

సమాజం ఆచరించటానికి యోగ్యమై అర్థవంతమైన అవగాహనతో కూడు కొన్న ఒక జాతియొక్క సజీవ విజ్ఞానం సంప్రదాయం. సంప్రదాయం లేని సమాజం ఉండదు, ప్రవాహం లేని నదిలాగా. అయితే, సంప్రదాయం ఆచరణ స్థాయిలో సామాన్య ప్రజాజీవితంలో ప్రవహిస్తూ ఉంటుంది. ఆచరణ వెనుక అవగాహనను రక్షించుకొనే స్థాయి మేధావి వర్గంలో గోచరిస్తుంది. ప్రపంచ జాతుల సంప్రదాయ ధారల్లో ప్రదర్శితమయ్యే ప్రగతి పథాలను పరిశీలించి తమ జాతి జీవన విధానానికి అనువైనవానిని సంపదించుకొనే వినూత్న ప్రయత్నా లను చేసే దార్శనికులలో సంప్రదాయం సజీవంగా ముందుకు సాగుతుంది. సంప్రదాయం సజీవ విజ్ఞానరూపం కాబట్టి దర్శనం దాని జీవశక్తి. దర్శనం జీవి తానికి కొత్త వ్యాఖ్యానం. పాత విలువలతో కొత్త విలువలకు సమన్వయం. ఈ సమన్వయంలో పాత కొత్తలకు అన్వయం చెప్పటంలో, ఆచరణయోగ్య తను సాధించటంలో దార్శనికుల నడుమ మేధావులమధ్య సంఘర్షణలు రావచ్చు, అభిప్రాయభేదా లేర్పడవచ్చు, సిద్ధాంత రాద్ధాంతా లేర్పడవచ్చు. ఇవన్నీ పాత కొత్తల మేలుకలయికగా రూపొందే సంప్రదాయ ధారకు అవగాహనతో కూడు కొన్న సమన్వయాన్ని అందించటానికి దార్శనికులు, మేధావులు చేసే విజ్ఞాన మయ వివేచనమే. దార్శకుల నవ్య దర్శనమో సమన్వయమో మొదట మేధావి వర్గంలో ఇంకాలి. వారు వాటి వ్యాఖ్యానం చేసి నిత్య జీవితానికి, ఆచరణకు వినియోగపడేటట్లుగా సామాన్య ప్రజలకు వినిపిస్తారు. తాము ఆచరిస్తున్న ఆచరణ లకు అర్థం మారిందని తెలిస్తేనో అర్థంలేదని తెలిస్తేనో కాని ప్రజలు తమ ఆచా రాలను మానరు. ఈ మూడు పొరల్లోనూ సంప్రదాయం ప్రవహిస్తుంది. అయితే, దార్శనిక విజ్ఞానంగా ఉండే సంప్రదాయం జాతి జీవనానికి తాత్త్వికభూమిక. అర్థవంతమైన అవగాహనగా పరివర్తనం చెందే దార్శనిక విజ్ఞానం ఉద్యమ భూమిక. ఆచరణయోగ్యమైన సమాజజీవన పద్ధతిగా మారే అవగాహన సమాజ

వాస్తవ చేతన. తాత్త్విక భూమిక సమాజ చేతనలోని వాస్తవాచరణంగా మార టానికి కొంతకాలం పడుతుంది. మొదటి పొరలోనుండి మూడో పొరదాకా సంప్ర దాయం ఇంకేసరికి మొదటి పొరలోనే మరొక మార్పు రావచ్చు. అందు వలన ఈ మూడు పొరలలో ఐక్యత, ఏకవాక్యత అనేవి ఒక నిర్దిష్టమైన కాలంలో ఉండవచ్చు; ఉండకపోవచ్చు. అలా ఉండకపోయిన కాలంలో సంప్ర దాయం సమాజంలో అంతస్సంఘర్షణకు గురియౌతున్నట్లు గోచరిస్తుంది. ఆ సంఘర్షణ ఆచరణపరిధిలో బలంగా ఉంటే సంస్కరణోద్యమంగా రూపొందు తుంది. అవగాహన పరిధిలో గాఢంగా గోచరిస్తే అభినవప్రయోగోద్యమంగా అవతరిస్తుంది. విజ్ఞానపరిధిలో సిద్ధాంతాల ప్రమాణాలతో జీవితాన్ని విలువకట్టే తాత్త్విక సూత్రాన్వేషణోద్యమంగా వెలువడుతుంది. మూడు పొరల్లో నిండి ప్రవహించే సంప్రదాయం కొన్ని యుగాలు జాతి జీవనాన్ని కానిస్తుంది. కాని, మార్పే సంప్రదాయానికి మనుగడనిచ్చేది; మార్పే క్రొత్తదనాన్ని అందించేది.

జాతి జీవనంలాగానే సాహిత్యజీవితంలో కూడా సంప్రదాయం అవిచ్ఛి న్నంగా ప్రవహిస్తూనే ఉంటుంది. సాహిత్యదర్శనం సంప్రదాయ తాత్త్విక భూమిక. వివిధ ప్రయోగాల ద్వారా సాహిత్యదర్శన కళాత్మక వ్యాఖ్యానం ఉద్యమభూమిక. ఉద్యమభూమిక ద్వారా అందే అవగాహన ప్రాతిపదికతో కళాత్మక విలువలను అనుశీలించే విమర్శ విధానం ఆచరణభూమిక. సాహిత్య రంగంలో ఒక క్రొత్త రచన వెలువడిందంటే ఒక క్రొత్త విలువ పొటమరించిం దన్నమాట. దానివెనుక ఒక అవగాహనకాని, సమన్వయంగాని దృక్పథంగాని తత్త్వంగాని, దర్శనంగాని తప్పక ఉండి ఉంటుంది. దానిని గ్రహించి వ్యాఖ్యా నించినప్పుడే ఆ క్రొత్త రచన అందించే విలువయొక్క రుచి అవగతం అవుతుంది. ఆ విలువ సంప్రదాయంలో-అంటే సాహిత్య ప్రస్థాన ప్రగతిలో- ఒక ఘట్టంగా, ఒక పరిణామంగా, ఒక వికాసంగా అన్వయింపబడేంతవరకు సిద్ధాంత రాద్ధాంతాలు తప్పవు. అవగాహన కుదుటపడితే ప్రయోగం సాహిత్య సంప్ర దాయంలో - సాహిత్య సజీవదర్శన విజ్ఞానంలో ఒక భాగంగా కుదురుకుంటుంది. అలా కుదురుకొనకపోతే సాహిత్యప్రయోగం జాతి అనుభవంలో ఇమడలేదు. కొన్నాళ్ళు క్రొత్తగా కనపడ్డా కొద్దికాలంలోనే కనుమరుగైపోతుంది. కాబట్టి

సంప్రదాయంలో సమన్వయంపొంది సజీవంగా సంప్రదాయాన్ని ముందుకు సాగింపగలిగిందే వినూత్న ప్రయోగం. టి. ఎస్ ఎలియట్ మాటలు గమనింప దగినవి - "The existing order is complete before the new work arrives; for order to persist after the supervention of novelty, the whole existing order must be, if ever so slightly, altered; and so the relations, proportions, values of each work of art towards the whole are readjusted: and this is confirmity between the old and the new."[1] గతానికీ వర్తమానానికీ మధ్య జరిగే ధ్రువీకరణమే సజీవసంప్రదాయ ప్రగతి. ప్రగతి నెంత సాధించినా సంప్రదాయం జాతిజీవలక్షణాన్ని కోల్పోదు; కోల్పోరాదు.

ఆధునికాంధ్ర సాహిత్యరంగంలో వినవడే సాహిత్య పారిభాషిక పదాల్లో సంప్రదాయవాదం, నవ్యసంప్రదాయవాదం అనేవి సంప్రదాయానికి అనుకూలమైనవి గానూ; కాల్పనికవాదం, అభ్యుదయవాదం విప్లవవాదం మొదలైనవి సంప్రదాయానికి విరుద్ధమైనవిగానూ కనపడుతూ ఉన్నాయి. వీటిలో నవ్యసంప్రదాయోద్యమంలో కవిత నిర్వహించిన పాత్రను సమీక్షించటం ఈ వ్యాస తాత్పర్యం.

ఇంగ్లీషులో 'నియోక్లాసిజమ్' అనే పదానికి సమానార్థకంగా తెలుగులో 'నవ్య సంప్రదాయవాదం' అని కొందరు వ్యవహరిస్తున్నారు. కాని, ఈనాడు ఆ అర్థంలో ఆ పారిభాషిక పదం రూఢికెక్కలేదు. కాల్పనిక కవితాయుగ చైతన్యం నుంచి విడివడి విశ్వనాథ సత్యనారాయణగారు 1933 - 34 ప్రాంతంలో శ్రీమద్రామాయణ కల్పవృక్షం రచించటం ప్రారంభించిన నాటినుంచి నవ్య సంప్రదాయోద్యమం ప్రారంభమైనట్లు విమర్శకులు భావిస్తున్నారు. అయితే, ఈ మాట దాదాపు 1982 తరువాతనే ప్రచారంలోకి వచ్చింది. అంతకుపూర్వం సంప్రదాయోద్యమమనే అనేవారు. ఈ మాటకు ప్రాచుర్యం కలిగించింది విశ్వవిద్యాలయాచార్యులే అనుకుంటాను. ఆధునికాంధ్ర సాహిత్యధోరణులను, ఉద్యమాలను వివేచించి, వాటి స్వభావాలకు అనుగుణంగా ఉండే పేర్లను పెట్టాలనే ప్రయత్నంలో 1933 - 34 నుంచి శ్రీశ్రీ 'మహాప్రస్థానం'తో అభ్యుదయ కవిత్వోద్యమం రూపుతాలిస్తే, విశ్వనాథ కల్పవృక్షం రచనతో నవ్యసంప్రదాయ కవిత్వోద్యమం బలపడట్టు సమన్వయించటం జరిగింది. శ్రీమద్రామాయణ కల్పవృక్ష

రచనం 1961 దాకా సాగింది. ఆదేకాలంలో అభ్యుదయ కవిత్వోద్యమం పుట్టటం, పెరగటం, విరగటం కూడా జరిగింది. నవ్యసంప్రదాయ ప్రయోగాలు నేటికి సాహితీక్షేత్రంలో సజీవంగా సాగుతున్నవని చాలమంది అంగీకరిస్తున్నారు. నియోక్లాసిజమ్‌ను నవీన ప్రబంధోద్యమమనీ, నవ్య కావ్యదృక్పథమనీ పిలిచేవారు కొందరున్నారు. అయితే, నవ్యసంప్రదాయోద్యమం అనే పదం నియోక్లాసిజమ్‌కు అనువాదం కాదు. అది స్వతంత్రంగా రూఢికెక్కిన పారిభాషిక పదం.

ఇంగ్లీషు సాహిత్యంలో వచ్చిన నవ్య సంప్రదాయ యుగానికీ, తెలుగులో వచ్చినదానికీ స్వరూప స్వభావాల్లో సామ్యం కొంత ఉన్నా భేదమే విశేషంగా గోచరిస్తుంది. ఇంగ్లీషులో నవ్యసంప్రదాయ యుగం రెస్టోరేషన్ యుగం తరువాత 17వ శతాబ్ది చివరి నుంచి 18 వ శతాబ్ది చివరిదాకా ప్రవర్తిల్లింది. దాని తరువాత కాల్పనిక కవిత్వోద్యమం వచ్చి, 19 వ శతాబ్ది పూర్వపాదంలో తన ప్రత్యేకతను ప్రదర్శించింది. కాల్పనిక కవిత్వోద్యమానికి ప్రతిగా విక్టోరియన్ సాహిత్య యుగ చైతన్యం 19 వ శతాబ్ది పూర్వార్ధంలోనే మొదలై, ఆ శతాబ్ది చివరిపాదందాకా సాగింది. కాగా, తెలుగులో నవ్యసంప్రదాయ కవిత్వోద్యమం భావకవిత్వయుగం తరువాత సాగింది. ఈ చారిత్రిక సత్యం నవ్యసంప్రదాయ కవిత్వోద్యమంలోని కొన్ని విలువలను వివేచించటానికి తోడ్పడుతుంది.

నవ్యసంప్రదాయ కవితా చైతన్యం, కాల్పనిక కవితా చైతన్యం ప్రాచుర్యం వహించిన ఆయా కాలాలను సాహిత్య చరిత్రలో వేరువేరు యుగాలుగా పరిగణించే పద్ధతిని కొందరు అంగీకరింపరు. అవి రెండూ పరస్పరం ప్రత్యర్థులుగా సాహిత్యంలో సదా సాగుతూ ఉండే శక్తిమంతాలైన చైతన్యాలని వారు పేర్కొంటారు. "There are many people who think of Neo-classic and Romantic as terms standing for ideas rather than fixed periods, as representing the great polar opposits of English peotry, irrespective of dates, literary movements or eras. Most critics, however, prefer to limit the application of the terms to specific periods to believe that it is possible to isolate some major aspects of the theory of Neo - classic poetry which set the poetry in sharp and essencial contrast

that of two generations of romantic poets"[2] అని యుగ వివేచనాన్ని సమర్థించేవారూ ఉన్నారు. తెలుగు విమర్శకులందరూ దాదాపు పై రెండో అభిప్రాయాన్నే బలపరుస్తున్నారు.

తెలుగులో 'సంప్రదాయ కవిత్వం' Traditional Poetry అనే అర్థంలో వాడబడటంలేదు. Classical Poetry అనే అర్థంలో వాడుతున్నాం. సంప్రదాయవాదం అంటే క్లాసిసిజం అనే చెప్పుకోవాలి. 'క్లాసిక్' అంటే ప్రథమశ్రేణి అనీ, ఆదర్శస్థాయి అనీ మొదట్లో అర్థం ఉండేది. ఏ ప్రక్రియలోనైనా ప్రయోగం జరిగినప్పుడు దాన్ని అనుశీలించటానికి 'క్లాసిక్ ఫారమ్' ను ప్రమాణంగా గ్రహించటం సంప్రదాయ మార్గం. ప్రాథమిక ప్రయోగంనుంచి పరిణత ప్రయోగం దాకా పరిణతిని సాధించే పద్ధతి గాని, ఆదర్శరూపం నుండి ప్రక్రియా వైవిధ్యాన్ని సాధించే ప్రయోగాలను నిర్వహించే పద్ధతిగాని సంప్రదాయ మార్గంలో సాధారణంగా గోచరిస్తుంది. స్థూలంగా మొదటి పద్ధతిని సంప్రదాయ మార్గమనీ, రెండవ పద్ధతిని నవ్యసంప్రదాయ మార్గమనీ పేర్కొనవచ్చు.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కావ్యప్రక్రియకు క్లాసిక్‌రూపం ప్రబంధం. దానిని తెలుగు కవులు యుగ యుగాల ప్రయోగాలతో పదహారో శతాబ్దిలో సాధింపగలిగారని విమర్శకులు వివేచించటం ప్రసిద్ధమే. నన్నెచోడుని నుండి క్రమంగా పరిణతి చెందిన ఆ ప్రక్రియా వికాసం ఆయాకవుల కవితోద్యమ స్ఫూర్తితో ఆదర్శస్థాయికి అందుకోగలిగింది. ఇలాగే ఒక్కొక్క ఆరంభం ఉంటుంది. ప్రయోగ వికాసదశ ఉంటుంది. పరిణతరూప సాధన దశ ఉంటుంది. ఆ వికాసం వెనుక ఆయా కవులు ఆ ప్రక్రియను దర్శించిన సాహిత్య దృక్పథాల ప్రత్యేకతలు కూడా ప్రత్యక్షమౌతూ ఉంటాయి. వాటికి సంబంధించిన అవగాహనను, అనుశీలనను, ఆదర్శరూప సాధనను సంప్రదాయోద్యమ మంటారు. ఒక్కొక్క ప్రక్రియ వెనుక ఒక ఉద్యమం ఉన్మీలిత మౌతుంది.

కావ్యనాటక ప్రబంధేతిహాసాలవంటి బలమైన సాహిత్య ప్రక్రియలు మాత్రమేకాక శతక దండకాలవంటి సాధారణ ప్రక్రియలు కూడా సాహిత్యంలో ఉన్నాయి. వీటిల్లో క్లాసిక్ రూపాలువున్నా ఆదర్శశిఖరాల్లాగా ఉండవు. అయి

నప్పుడు ఆ ప్రక్రియల్లోని ప్రయోగాలను నిర్మించే యత్నాన్ని ధోరణిగా పేర్కొనవచ్చు. అంటే-తెలుగులో ప్రబంధ కవితోద్యమం, శతక రచనాధోరణి ఇలా ఉండటం సహజమన్నమాట. సంప్రదాయంలో ఉద్యమం ఏమిటి అనేవా రున్నారు. అది అర్థంలేని ప్రశ్న తాత్త్వికభిత్తిక ఉన్న ఏ ప్రయోగ ప్రయత్న మైనా ఉద్యమ స్ఫూర్తిని పొందగలుగుతుంది. ధ్వని ప్రస్థానంలో కవిత్రయం సాధించిన కావ్యేతిహాసకవితోద్యమం మూడు శతాబ్దాలు సాగింది. శృంగార రసోన్ముఖమైన రీతిప్రస్థానం శ్రీనాథునిలో మొలకెత్తి ఒక శతాబ్దం కవిత్వాన్ని ఉద్రూత లూపింది. భక్తి కవితాప్రస్థానం పాల్కురికితో మొదలై పోతన్నలో క్లాసిక్ రూపాన్ని అందుకోగలిగింది. వక్రోక్తి ప్రస్థానం ప్రేరణగా సాగిన ప్రబంధకవుల వివిధప్రయోగాలు ప్రౌఢ కవితావతారాలుగా రెండు శతాబ్దాలు తమ మనుగడను సాగించి కొన్ని క్లాసిక్ రూపాలను అందించగలిగాయి. సంప్ర దాయవాదానికి సాహిత్యసిద్ధాంతం తాత్త్విక భూమిక; ప్రయోగం ప్రగతి; క్లాసిక్ రూపం గమ్యం.

హోమర్, వర్జిల్, డాంటే, షేక్స్పియర్, వాల్మీకి, వ్యాసుడు, భవ భూతి, నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన మొదలైనవారు ఆయా భాషా సాహిత్యాల్లో ప్రథమశ్రేణి కవులు, వారి రచనలు క్లాసిక్కు. ఆ రచనలను ఆధారంగా చేసికొని తరువాతివారు కొన్ని సాహిత్య సిద్ధాంతాలనూ, సూత్రాలనూ ఏర్పరచుకొంటారు. వాటి ననుసరించి రచింపబడినవి. 'నియోక్లాసిక్' రచన లనిపించుకుంటాయి. ఈ భేదాన్ని నవ్యసంప్రదాయ కవితోద్యమాన్ని వివేచించే టప్పుడు విస్మరించటానికి వీలు లేదు. కాని, విమర్శకులు కొందరు ఈ వివేచ నాన్ని అంత సూక్ష్మంగా పాటించటం లేదు. "The great Neo-classic poets are fundamentally conservatives and traditionits"[3] అనే ధోరణితో నవ్యసంప్రదాయకవులు నవ్యతను సాధించలేరనీ, గతాను గతికమైన రచనను నిర్వహిస్తారనీ భావించి వారిని పరిగణనలోకి తీసికోరు. దానికి కారణం ఆ ఉద్యమాన్ని గురించిన సరియైన అవగాహన వారికి లేక పోవటమే.

కాల్పనిక కవితాయుగ కవికి, నవ్యసంప్రదాయ కవితాయుగకవికి ఉండే భేదాన్ని తెలుసుకోవటానికి శ్రీ వడలి మందేశ్వరరావుగారి ఈ మాటలు తోడ్ప

దతాయి- "రొమాంటిస్టు ఎలాగైనా స్వేచ్ఛాప్రియుడు. వెనుకటి బంధనాలను ఊడ్చుకుంటాడు. శృంఖలాలను తెంచుకోవటం అతనికవసరం. అతని నూతన ఆలోచనలు వెనుకటి మూసలలో ఇమడవు. అందుచేత గతంతో అతను తెగ త్రెంపులు చేసుకోవాలనుకుంటాడు. క్లాసిసిస్టు అలా అనడు పైకి. సంప్రదాయ వాదిలా కనవడతాడు. స్వేచ్ఛను కోరుతున్నట్టే కనపడడు, కాని, వెనుకటి కవులు చూపిన బాటను సునిశితంగా పరిశీలిస్తాడు. ఆ మార్గాన్నే పయనించినట్లు కనవడతాడు. కాని, ఆ మార్గాన్ని విస్తృత పరుస్తాడు. వెనుకటి ఛందస్సుల్ని అంగీకరించినట్లు కనపడతాడు. అందులో కొత్త లయను ప్రవేశపెడతాడు. వెనుకటి అలంకారాలనే వాడినట్లు కనవడతాడు. కాని, ఇతని శబ్దచిత్రాలు కొత్తగా ఉంటాయి. కాని, ఇవన్నీ బాహ్యస్వరూపానికి సంబంధించినవి. క్లాసిసిస్టును నిక్కచ్చిగా పట్టి ఇచ్చేది అతని ఆలోచనా విధానం, శిల్పదృష్టి, లోచూపు. సంప్రదాయంమీద తిరగబడినా, అనుసరించినా అతని ఆలోచనావిధానం విశ్లేషణను ఆకర్షిస్తుంది; శిల్పదృష్టి అకుంఠితంగా ఉంటుంది; లోచూపు లోకానికి ఉపకరించేది అవుతుంది."[4] ఈ మాటలు తెలుగులోని నవ్య సంప్రదాయవాద కవులకూ, విశేషించి విశ్వనాథకూ తప్పక అన్వయిస్తాయి.

"నేను ఏమి వ్రాస్తానో నేను తెలుసుకొని వ్రాస్తాను. అనాదినుంచీ ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకుంటూ వస్తున్నది. ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి, నేను సఫలుణ్ణయి, వాళ్ళను జ్ఞానవంతులను చేస్తున్నాను అనే భావం నాకు ఉన్నది. ఈ భావం ఉన్నవాళ్ళు చాలమంది ఉన్నారని నాకు తెలుసు.... పూర్వ సాహిత్యం ఒకటి ఉన్నది.... నేనుపోతే నాతో పోయేవాళ్ళు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలైనవారు"[5] అని చెప్పుకున్న విశ్వనాథ ప్రాచీనాంధ్ర కవుల ప్రమాణాలను గౌరవిస్తూనే తనదైన మహాకావ్య రచనను చేపట్టిన నవ్య సంప్రదాయయుగ చైతన్యమూర్తి.

నవ్య సంప్రదాయ యుగకర్త విశ్వనాథ. ఆయన ఇంగ్లీషు సాహిత్యం లోని నవ్య సంప్రదాయయుగ కవులకంటె, విమర్శకులకంటె, విక్టోరియన్ యుగకవుల సాహితీ ధోరణికే సన్నిహితుడుగా కనపడతాడు. జీవితాన్ని ఉదాత్త నైతిక తాత్త్విక కళాదృక్పథంతో దర్శించి భావించటమే కవుల ధర్మ

మనీ, కవిత్వం ద్వారా సమాజంలో శాశ్వత నైతిక ప్రమాణాల విలువలు పునరుద్ధరింపబడాలనీ, ఉత్తమ కావ్యేతివృత్తాలు, ఉదాత్త శైలి కవితకు అత్యవసరమనీ తలంచిన విక్టోరియన్ యుగకవుల దృక్పథాలు విశ్వనాథలో కనవడతాయి. శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారన్నట్లు- "కాల్పనికోద్యమ ప్రభావంతో ప్రారంభమైన విశ్వనాథ సత్యనారాయణ సాహితీ కృషి అనతికాలంలోనే ఆ ప్రభావాన్ని అధిగమించి, ఆయన యేర్పరచుకొన్న విశిష్ట దృక్పథాన్ని ప్రతిబింబిస్తూ పరిణతి చెందింది. ఆయన ప్రతిభ భావనాత్మకమే కాదు; ఆలోచనాత్మకం కూడా. అపైన ఆధిభౌతిక దర్శనశక్తి (Capacity for spiritual insight) ఒకటి ఆయన భావనకు, సామాన్యంగా కాల్పనికయుగ రచయితలకు లేని, తత్త్వపరిపూర్ణతను ఇచ్చింది."6

తెలుగులో కాల్పనిక యుగ చైతన్యానికి వ్యతిరేకంగా నవ్యోద్యమాలకు రెండింటికి శ్రీకారం చుట్టినవారు శ్రీశ్రీ, విశ్వనాథ. వీరిద్దరూ సమాజంలోని రెండు ప్రవృత్తులకు ప్రతినిధులుగా నిలిచారు. వీరిద్దరూ కవితలను సమాజం కోసమే వ్రాశారు. సమాజం చైతన్యాగ్నివంటిది. సాహిత్యానుభవంకోసం పంచజిహ్వాలతో అర్రులు చాస్తూ ఉంటుంది. వాస్తవ, కాల్పనిక, వైజ్ఞానిక, జీవచైతన్య, ఆధ్యాత్మికానుభూతుల కొరకై సమాజం తన కామనను వ్యక్తంచేయటమే ఆ పంచజిహ్వాల ప్రవృత్తి. ఆ పంచజిహ్వాలతో ఆస్వాదించే కళానుభవమే పరిపూర్ణం, సమగ్రం. సమాజానికి సమగ్రానుభవాన్ని అందించటమే ఒక్కొక్క సాహిత్యయుగధర్మం. అయితే, సమాజం ఒక్కొక్కసారి ఒక్కొక్క జిహ్వ కనువైన అనుభూతికోసం తీవ్రయత్నం చేసిన ఘట్టాలు కూడా చరిత్రలో కనపడతాయి. ఒక కాలంలో సమాజం వాస్తవ దృక్పథాన్ని పెంచుకుంటుంది; మరొక కాలఖండంలో కాల్పనికతను వరిస్తుంది; మరొక తరుణంలో జీవచైతన్య శక్తినీ, అలాగే మరికొన్ని కాలాల్లో హేతువాదాన్నీ, భక్తినీ, ఆధ్యాత్మికానుభవాన్నీ వాంఛిస్తుంది. వాటికి తగిన ప్రేరక శక్తులు ఆయా కాలాల్లో బలంగా పుంజుకోవటం చూస్తుంటాం. ఒక కాలంలో ఒక చైతన్యం ఉవ్వెత్తుగా పొంగుతున్నప్పుడు, దానిని కవులు పోషిస్తూ ఒక ధోరణినో, ఒక ఉద్యమాన్నో సాగిస్తున్నప్పుడు - సమాజ చైతన్యంలోని మరో భాగంగా ఉండే తదితరప్రవృత్తులు బలహీనంగా ఉన్నా చచ్చిపోవు. తమ శక్తులను కూడగట్టుకోవటానికి మందంగానో లేదా తీవ్రంగానో; వ్యక్తంగానో లేదా అవ్యక్తంగానో కృషి చేస్తుంటాయి. ఒక్కొకసారి ఆ శక్తులన్నింటికీ

ప్రతినిధిగా ఒక రచయితో, లేదా కొందరు రచయితలో తమ ప్రయత్నాలను బలంగా సాగించవచ్చు ఇటువంటిపనే అభ్యుదయ కవితోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లోనే విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్ప వృక్షం రచిస్తూ, మేరువులా సాధించిన నవ్యసంప్రదాయ యుగసిద్ధి.

సమాజ సాహిత్యానుభూతిని దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే విశ్వనాథ వారి రామాయణ కల్పవృక్ష రచనా పరమార్థం మరింత స్పష్టంగా గోచరిస్తుంది కాల్పనిక కవితాయుగంలో వెలసిన వివిధ కవితా శాఖలూ, కవుల రచనల్లో గోచరించే వివిధ ధోరణులూ- ఆ కాలంలోని సమాజ ప్రవృత్తి కాల్పనిక చైతన్యం ద్వారా ఒక సమగ్రానుభూతిని పొందాలని యత్నించినట్లు నిరూపిస్తున్నాయి. గురజాడ కాల్పనిక చైతన్యంలోని వాస్తవికతా ప్రవృత్తిని పోషించాడు; రాయప్రోలు వారు అమలిన శృంగార సిద్ధాంతంద్వారా వైజ్ఞానికానుభవస్ఫూర్తిని కాల్పనిక యుగ చైతన్యాని కందించారు. హేతువాదులు కూడా ఇటువంటి ప్రవృత్తిని పోషించినవారే. ప్రణయతత్త్వశాఖను పూయించిన కవులందరూ జీవచైతన్యాను భూతిని కాల్పనిక ప్రవృత్తికి పోషకంగా అనుసంధించారు. దేశభక్తి, మధుర భక్తి ప్రవృత్తులు ఆధ్యాత్మికానుభవంలోని అభినవరుచుల నందిస్తూ కాల్పనిక చైతన్యానికి ఒక సమగ్రత నాపాదించాయి. ఇలా భావకవిత్వయుగంలో కాల్పనిక చైతన్యం కేంద్రంగా చేసికొని సమాజం సమగ్రానుభవసిద్ధిని సాధించింది.

విశ్వనాథ సత్యనారాయణగారు ఈ స్థితిని సమీక్షించి, అంతకంటె ఒక అడుగు ముందుకువేసి, పంచవిధ ప్రవృత్తులద్వారా సమాజం పొందే కళానుభవాన్ని సమాహారరూపంగా అందింపగలిగిన ఒక మహాకావ్యాన్ని రచించటానికి పూనుకు న్నారు. రామాయణ కల్పవృక్షం పేరుకు తగ్గట్లు సమాజం కాంక్షించే వాస్తవిక కాల్పనిక, వైజ్ఞానిక, జీవచైతన్య, ఆధ్యాత్మికానుభవాల సంపుటిని అందింప గలిగిన విశిష్ట రచన. ఆయన జీవుని వేదన సమగ్ర కళానుభూతికోసం సమాజ జీవచైతన్యం వ్యక్తం చేస్తున్న ఆవేదన. పంచజిహ్వాల సమాజచేతనకు విశ్వనాథ వారు అందించిన అమృత నైవేద్యమే, అనుభవ కోశమే శ్రీమద్రామాయణ కల్పవృక్షం.

ఆ కావ్యంలోని సన్నివేశాలూ, పాత్ర స్వభావాలూ సమాజంలో కానవచ్చే వాస్తవ జీవిత వృత్తాలకు ప్రతిబింబాలుగా ఉండటంవల్ల వాస్తవానుభవాన్నీ, కాల్పనిక చైతన్యంతోనూ కల్పనా మహనీయ విశేషాలతోనూ పద్యాల్లో వ్రాసిన నవలా అన్నట్లు పఠితలను రమింపచేయటంవలన కాల్పనికానుభవాన్నీ, భారతీయ తత్త్వశాస్త్ర మర్యాద ధారతో- అందులోనూ అద్వైత మతదృష్టితో- రామకథా తత్త్వాన్ని వ్యాఖ్యానించటంచేత జ్ఞానానుభవాన్నీ, జీవవేదనా భరితమైన ఆ కావ్య మంతా జీవచైతన్య ప్రవృత్తిభరితమై ఉండటంచేత రసానుభవాన్నీ, భక్తి కర్మ జ్ఞాన మార్గాల విశిష్ట సమన్వయంగా సాగే భారతీయ జీవన పరమార్థధార పరమ రమ్యంగా కావ్యార్థాలలో వ్యంజింపబడటంచేత ఆధ్యాత్మికానుభవాన్నీ సమాజ సమగ్రానుభవసంసిద్ధికి అందించే శక్తిమంతమైన కావ్యంగా రూపొందింది. పరి పూర్ణ కావ్యరసానుభూతికోసం పరితపించే సాహితీ జగత్తుకు ఉపాయనంగా అందించిన కావ్యం-నవ్యసంప్రదాయ కవితా ప్రవృత్తికి పతాక-శ్రీమద్రామాయణ కల్పవృక్షం.

నవ్యసంప్రదాయవాదిగా విశ్వనాథ "రసము వేయిరెట్లు గొప్పది నవకథా దృతిని మించి" అని పునఃస్థాపింపదలచాడు. ఆధునికయుగంలో కళానుభవాన్ని ఆస్వాదయోగ్యంగా చేయటానికి మూడు పద్ధతు లేర్పడ్డాయి. వాటిని 1. ఆత్మీ యీకరణమనీ, 2. సామాజికీకరణమనీ, 3 సాధారణీకరణమనీ పిలువవచ్చు. స్వాత్మీయీకరణం భావకవిత్వాన్ని ఆస్వాదించటానికి పఠిత కుపకరించే పద్ధతి. సామాజికునికి అనుభవయోగ్యమైన స్వీయానుభవాన్ని ఆత్మనాయకంగా కవి కవితలో వ్యక్తీకరించటం, దాన్ని సహృదయుడు ఆత్మీకరించుకొని తాదాత్మ్యంతో అనుభవించటం అనే ప్రక్రియ ఇందులో గాఢంగా కనపడుతుంది. కాబట్టి దీన్ని సాత్మీయీకరణం అని పేర్కొనటం జరిగింది. "అభ్యుదయ కవిత్వం ఉత్తేజం ద్వారా క్రియాశీలతా పర్యవసాయి లేక కార్యోత్సాహ పర్యవసాయి" (రా.రా.). ఇలా పర్యవసించే పద్ధతి సామాజికీకరణం. ఇందులో కవి కవితలలో ప్రకటించే ఉద్రేక ఉత్తేజాలకంటె సహృదయులు రచనవలన పొందే ఉద్రేకానికి, ఉత్తేజానికి ఉద్యమకర్తవ్యాల పట్ల ఉన్ముఖీకరణానికి ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. ప్రక్రియ ఏదైనా ఈ పద్ధతిలో ఫలితం ఒక్కటే.

ఈ రెండు పద్ధతులకంటె సంప్రదాయధారగా వస్తున్న రసానుభవ విధానమే సులభమైనదనీ, ఉదాత్తమైనదనీ విశ్వనాథ నిరూపింపదలచుకున్నాడు. రససిద్ధాంతంలో సాధారణీకరణం ప్రసిద్ధం. అది కథ నాశ్రయించిన కావ్యాలకే ఎక్కువగా వర్తిస్తుంది. సామాజికానుభవ చైతన్యాన్ని గమనించిన కవి సామాజికుల సహానుభూతిని పొందగలిగిన పాత్రలను, సన్నివేశాలను, భావాలను సంపుటీకరించి సాహితీ ప్రక్రియలను వెలువరుస్తాడు. ఆ ప్రక్రియల్లో కావ్యం, ఇతిహాసం ఉదాత్తమైనవి. కావ్య పాత్రలద్వారా వ్యక్తమయ్యే భావాలను, అనుభవాలను పఠిత సాధారణీకరణం ద్వారా స్వీయానుభవాలుగా మార్చుకొని సాత్త్విక చైతన్యంతో విశ్వజనీనంగా రమిస్తాడు. ఆ రమణంలోని చిత్త ద్రవస్థితియే రసానుభవం. ఇది పాతబడ్డదని భావించటం పొరపాటు. ఇది విశ్వజనీనం కాబట్టి ప్రతి యుగంలోనూ బ్రతికే ఉంటుంది తద్విరుద్ధమైన ప్రయోగాలకు ప్రాబల్యం వచ్చినప్పుడు స్వీయశక్తి ప్రదర్శనకోసం అభినవాసక్తితో విజృంభిస్తుంది. అంతేతప్ప దానికి చావు లేదు. పై మూడు విధాలలో అత్యంత సరళమైనదీ, శక్తిమంతమైనదీ ఈ సాధారణీకరణం. నవ్యసంప్రదాయవాదికి సాధారణీకరణం పరమప్రమాణం. కాల్పనిక, అభ్యుదయ, విప్లవ కవిత్వాలలో పొందలేని ఈ కళానుభవస్థితికి విశ్వనాథవారి కావ్యం కల్పవృక్షం.

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని ఆధునిక స్పృహను గురించి విమర్శకులు వివేచన చేశారు ఆధునికయుగంలో మానవునికి ప్రకృతిపట్ల గల అహంకార పూరితమైన విజిగీషా ప్రవృత్తికి రావణుని పాత్ర ప్రతినిధి. ప్రకృతిపట్ల వినయ దృష్టిగల మానవునికి ప్రతినిధి హనుమంతుడు. మానవుని అహంకార ప్రవృత్తి వల్లనే ఈనాడు ప్రకృతి సంక్షోభం ఏర్పడుతున్నది. దానివలన ప్రపంచానికి ఎన్నో దుష్ఫలితాలు కలుగుతున్నాయి. ఆ సంక్షోభాన్ని మార్చి ప్రకృతి సమతౌల్యాన్ని ప్రతిష్ఠాపించి విశ్వశాంతిని ప్రతిష్ఠాపించాలని నేటి మానవయత్నం. ఆ యత్నం కల్పవృక్షంలో శ్రీరాముని ప్రయత్నంగా ప్రతీకాత్మకంగా విశ్వనాథ వారు చిత్రించారని విమర్శకులు వ్యాఖ్యానిస్తున్నారు. ఆధునిక మానవసమాజంలో ఉన్న వివిధ ప్రవృత్తులకు ప్రతినిధులుగా, ప్రతీకలుగా చిత్రించినవారే శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని పాత్రలన్నీ. ఈ దృష్టితో చూస్తే శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఆధునిక మానవసమాజ చిత్రణకు పూనుకున్న ప్రతీకాత్మక కావ్యేతి

హాసం; ఆధునిక మహాకావ్యం. ఈ విధంగా ఆ కావ్యాన్ని దర్శించి, నిర్మించటం నవ్యసంప్రదాయ ప్రయోగ ప్రతిభకే సాధ్యం.

నవ్యసంప్రదాయం ఒక కవితకు, కావ్యానికి మాత్రమే పరిమితం కాలేదు. విశ్వనాథ నవ్యసంప్రదాయ దృక్పథంతో నిర్మింపదగిన ప్రక్రియల నన్నింటిని చేపట్టి వాటిని బంగారం చేశారు. మచ్చుకు మరికొన్నింటిని గమనిద్దాం: బ్రిటీషు వలస పాలకుల వలస భావాలతో భారతదేశానికి రచింపబడిన చరిత్రలో కుట్రలూ, దుర్వ్యాఖ్యానాలూ ఉన్నాయని జాతీయ చరిత్రకారులు నిరూపించి, వలస చరిత్రకారుల రచనలను తీవ్రంగా వ్యతిరేకించారు. ఇటువంటి వ్యతిరేకతనే విశ్వనాథవారు 'పురాణ వైర గ్రంథమాల' అనే నవలల వరంపరలో వ్యక్తం చేశారు. జాతీయవాద చరిత్రకారుల దృష్టి నవ్యసంప్రదాయ భావధారకు ఒరవడి పెట్టింది. దానిని ముమ్మూర్తులా ప్రదర్శించింది విశ్వనాథవారి 'పురాణ వైర గ్రంథమాల.'

బ్రిటీషు పాలకుల వలస పాలన విధానాన్ని, భారతీయ సంస్కృతిపట్ల వారు ప్రదర్శించే దమన పద్ధతినీ, వారి ప్రచ్ఛన్న దోపిడీ వ్యవస్థనూ, బ్రిటీషు పాలనలో జరుగుతున్న పరిణామాలలో జాతీయమైన, దేశీయమైన వ్యవస్థలకు కలుగుతున్న అన్యాయాలను, వాటివలన ఉత్పన్నమౌతున్న అనేకానేక జీవన సమస్యలను జాతీయవాద దృక్పథంతో సమీక్షించి, వ్యాఖ్యానించి, దేశీయమైన విలువలకు వ్యాఖ్యానం చెప్పే వైఖరిని విశ్వనాథవారు నవల, కథానికా ప్రక్రియల నాశ్రయించి కూడా ప్రపంచించారు. అందువలన విశ్వనాథవారి నవలలు అచ్చమైన జాతీయవాది చేస్తున్న తిరుగుబాటులాగా ఉంటుంది. మన జాతి జీవశక్తిని అర్థం చేసుకోగలిగితే విశ్వనాథవారి నవలల్లోని భావజాలాన్నీ, భావజాలాన్ని పట్టి రూపొందే ప్రక్రియా వైవిధ్యాన్నీ విలువకట్టి వివేచించగలం. ఇంగ్లీషు చదువుల వలన దేశీయ విద్యా విధానంలో ఉన్న విలువలు ఎన్ని ఎలా విధ్వంసమౌతున్నాయో వెలువరించి, వాటికి ఆధునిక సమాజ జీవితంలో గల ప్రయోజనాలను ప్రపంచించటానికి వెలసిన నవలలు-చెలియలికట్ట, సముద్రపు దిబ్బ మొదలైనవి. వివాహం, కుటుంబ వ్యవస్థ, ప్రకృత్యారాధనం మొదలైన దేశీయ వ్యవస్థలకు బ్రిటీషు యుగంలో ఏర్పడ్డ సవాళ్ళకు సంప్రదాయంలోని మౌలిక మూల్యాలకు భంగం లేకుండా ఆధునిక యుగంలో పరిష్కారాలను చర్చించారు. ఇటువంటి

భావజాలానికి పరాకాష్ఠ 'వేయిపడగలు'. వేయిపడగలు నవ్యసంప్రదాయ ప్రస్థానంలో వెలువడిన సాంఘిక నవలా కావ్యేతిహాసం. విశ్వనాథ వారందించిన స్ఫూర్తితో నవ్యసంప్రదాయ ధోరణులను నవలారచనలో పాటించిన ప్రసిద్ధులలో నోరి నరసింహ శాస్త్రిగారు, ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు, తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు (అద్వయానంద భారతిస్వామి) ముందుగా పేర్కొనదగినవారు.

పాశ్చాత్య విద్య పాశ్చాత్యీకరణం సమాజంలోని పాతవిలువలను తుడిచి పెట్టివేస్తూ, ఆరోగ్యదాయకమైన కొత్త విలువలను సృష్టించలేకపోవడం వలన ఏర్పడిన శూన్యాన్ని (vacume), విలువల సంక్షోభాన్ని (value crisis) చిత్రించటానికి, వాటిని అధిక్షేపించటానికి, సంప్రదాయంలోని మౌలికమైన విలువలను ఉపయోగించుకోవటం వలన ఏర్పడే పరిష్కారాలను గురించి విశ్వనాథవారు తమ నవలలలో, కథలలో విస్తృతంగా చర్చించారు. కళాత్మకంగా సమస్యలను చిత్రించారు. విశ్వనాథవారి నవలా వాఙ్మయం నవ్యసంప్రదాయ చైతన్యంతో పొంగులువారిన ప్రయోగ జగత్తు.

ఇటీవలికాలంలో సమాచారాన్ని సేకరించి నవలలు వ్రాసే పద్ధతి బాగా ప్రచారంలోకి రావటం గమనిస్తాం. విశ్వనాథ ఈ రకమైన పద్ధతిని తమ నవలల్లో ఎప్పుడో ప్రవేశపెట్టినట్లు వారి ఏ నవలైనా వెల్లడి చేస్తుంది. నవల వ్రాసేది కేవలం కథకోసంకాదు. రచయిత ఆ కథాభూమికకు అవసరమనుకున్న అనేక విషయాలను అందులో చొప్పిస్తాడు. విజ్ఞానపు భాండాగారాన్ని పాఠకుడి ముందు కుమ్మరిస్తాడు. విశేషానుభవంతో, పండిన స్వీయానుభూతులను నవలల్లో అమరుస్తాడు. ఆరు నదులు, సముద్రపుదిబ్బ, వేయిపడగలు, ప్రళయనాయుడు మొదలైన నవలలు ప్రపంచ రాజకీయ సాంస్కృతిక ఆర్థిక తాత్త్విక దృక్పథాలకు ఎంతగా ఆలంబనాలయ్యాయో, అంతగా దేశీయతాముద్రకు, జానపద గాథలకు నిలయాలుగా కనపడతాయి. విశ్వనాథవారి ప్రతి నవలా వాస్తవ సంఘటననో, చరిత్రనో ఆధారంగా చేసికొని చెప్పినదే. వాటిని విశ్లేషించి పరిశీలించినపుడు ఈ పునాదులు గోచరిస్తాయి. వీటిల్లో కూడా వస్తువు, భాష, కథనం ఎంత వైవిధ్యాన్ని వ్యక్తీకరించటానికి వీలున్నదో విశ్వనాథ ప్రదర్శించి

చూపించారు. వచన రచనలో వ్యవహారిక భాషాశైలి వారి సొత్తు. నవలా రచనలో 'ఆశుపద్ధతి' విశ్వనాథ ప్రవేశపెట్టారు. ఏకకాలంలో మూడు నాల్గు నవలలను డిక్టేట్ చేయడం గమనిస్తే ఇటీవలి బిజీ సీరియల్ రైటర్సుకు కూడా విశ్వనాథ మార్గదర్శకుడా అనిపిస్తుంది.

విశ్వనాథ మధ్యాక్కరలనే పేరుతో పది శతకాలను రచించి ఆధునిక శతక సాహిత్యంలో ఒక నవ్య సంప్రదాయాన్ని స్థాపించారు. మనసులోని మాటను ఆర్తితో, ఆత్మీయంగా, అరమరికలు లేకుండా పరమాత్మునితో చెప్పుకోటానికి మధ్యాక్కర మధురంగా తోడ్పడుతుందని విశ్వనాథ నిరూపించారు. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో నన్నయాదులు పరిమితంగా వాడినా బహువిధ రస భావ వ్యంజకంగా ఆ వృత్తాన్ని నడిపి చూపించారు. అయితే, గడచిన నాలుగైదు శతాబ్దాలుగా మధ్యాక్కరను ఎన్నుకొని ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని సాధించే యత్నం చేసిన కవి కానరాడు. ఈ వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో మధ్యాక్కరతో ఒక శతక ప్రక్రియనే నిర్మించవచ్చునని దర్శించి, పది శతకాలు రచించి, వేయివిధాలుగా ఆ వృత్తాన్ని నడిపించి, పదివేల విధాల శిల్పాలను అందులో ప్రదర్శించవచ్చునన్న ప్రజ్ఞను ప్రదర్శించిన ప్రతిభామూర్తి విశ్వనాథ సత్యనారాయణ.

విశ్వనాథవారి పంచశతి గాథాసప్తశతిని తలపింపచేస్తుంది రూపంలో. కాగా, అందులో వ్యాఖ్యానింపబడే జీవన సత్యం మాత్రం నిత్యనూత్నమైనది గాను హాస్యరస స్ఫురణను కలిగించేదిగాను కనపడుతుంది. ప్రబంధ ఫక్కీలో వారు రచించిన శ్రీ కుమారాభ్యుదయము తెలుగు పల్లెసీమలకు పట్టిన అద్దం. పల్లీయుల వ్యావసాయిక సంస్కృతికి, దేశీయ వాతావరణానికీ అది రంగభూమి. వ్యావసాయిక జీవనేతివృత్తంపై రూపొందించిన ప్రతీకాత్మక ప్రబంధ మిది. దేశభక్తి కవిత్వం విశ్వనాథతో సరికొత్తదైన ఊపునందుకున్నది. విశ్వనాథ విమర్శలో శిల్పానుశీలన ధోరణిని ప్రవేశపెట్టి, కావ్యాన్నంతా ఒక కళా ఖండంగా, ఒక అనుభూతి పూర్ణంగా సమన్వయించే నవ్యవిమర్శ పద్ధతిని ప్రవేశపెట్టారు. విమర్శలో సాహిత్యాంశాలే కాక ఇతర శాస్త్రాంశాలు ఎన్నో చోటు చేసుకొంటాయి. ఖగోళశాస్త్రం, భూగర్భశాస్త్రం మొ॥ ఆధునిక శాస్త్రాంశాలను సహాయభూతాలుగా చేసికొనే విశ్వనాథ దృక్పథం సరికొత్తది.

పాశ్చాత్య వ్యామోహజనితమైన అంధానుసరణాన్ని తొలగించుకోవడం ద్వారా మనల్ని మనం సంస్కరించుకోవా లంటాడు విశ్వనాథ. అతిమాత్రంగా ప్రచలితమైన ఇంద్రియ లౌల్యాన్ని ప్రేమగా నామకరణం చేయటం ఎంత ఆధునికమని ఎందరు సమర్థించినా దాన్ని విశ్వనాథ వ్యతిరేకించాడు. ఆంగ్ల విద్యావిధానం మన చదువులలో, సంస్కారాలలో కలిగించిన, కలిగిస్తున్న లోపాలను గుర్తించక దానికి పట్టం గట్టే భావజాలాన్ని విశ్వనాథ నిరసించారు.

విశ్వనాథవారు తమ జీవితకాలంలో ప్రపంచంలోనూ, దేశంలోనూ, తన రాష్ట్రంలోనూ సాగుతున్న సాంఘిక, సామాజిక, సాంస్కృతిక, సాహిత్య, మత, నైతిక రంగాలలో సాగుతున్న ఉద్యమాల నన్నింటినీ అధ్యయనం చేసి, వాటికి తన స్పందనలను, ప్రతిస్పందనలను తన సాహిత్యంలో రికార్డు చేసిన వివేకజ్ఞుడు. 'నేను ఏమి వ్రాస్తానో తెలిసే వ్రాస్తాన'ని చెప్పుకొన్న జ్ఞాతశిల్పి. స్వాతంత్ర్యోద్యమం, రష్యన్ విప్లవం, కమ్యూనిస్టు ఉద్యమం, ఆంధ్రోద్యమం, చరిత్రాధ్యయనోద్యమం, తాత్త్విక ఆధ్యాత్మికోద్యమం, పునరుజ్జీవనోద్యమం, సంస్కరణోద్యమం, భాషోద్యమం, నాస్తికవాదం, జానపద చైతన్యోద్యమం, పర్యావరణ పరిరక్షణోద్యమం-ఇలా ఎన్నో ఉద్యమ చైతన్యాలపై విశ్వనాథవారు స్పందించారు. సమకాలీనోద్యమాలకు సమగ్రంగా స్పందించి తన దృక్పథాన్ని నిర్భయంగా, నిజాయితీతో చెప్పిన ఋజువర్తనుడు. తాను నమ్మింది, తాను చెప్పింది, తాను జీవితంలో ఆచరించింది ఒక్కటిగా సాగించుకున్న మానవతా మూర్తి విశ్వనాథ.

వేయిపడగలు, ఝూన్సీలక్ష్మి, శివార్పణం మొదలైనవి స్వాతంత్ర్యోద్య మాన్ని; ఆంధ్రపౌరుషము, ఆంధ్రప్రశస్తి, బద్దన్న సేనాని మొ॥నవి ఆంధ్రో ద్యమాన్ని; పురాణవైర, నేపాలచరిత్ర, కాశ్మీర్ చరిత్ర నవలలు మొ॥ ద్వారా ప్రాచీన కాలానికి చరిత్రను అనుసంధించే ఉద్యమాన్ని; విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు, హాహాహూహూల ద్వారా భాషాశాస్త్ర ప్రభావాన్ని; సముద్రపు దిబ్బ, శార్వరినుండి శార్వరిదాకా, వేసరాజు, నాస్తికధూమము మొదలైన వాటి ద్వారా నాస్తికోద్యమాన్ని; దమయంతీ స్వయంవరం, నంద్రిగామ రాజ్యం మొదలైన వాటితో రాజకీయోద్యమాలనూ; ఆరు నదులు, స్వర్గానికి నిచ్చెనలు, శతకసంపుటి,

భక్తికావ్యాలు మొ॥న వాటితో తాత్త్వికోద్యమాలనూ విశ్వనాథ వారు తమ సాహిత్యంలో ప్రతిఫలింపజేసి, వాటికి తాను ప్రతిస్పందించారు.

విశ్వనాథ వారికి శిష్యులున్నారు, ప్రశిష్యులున్నారు. అనుయాయులతో పాటు ప్రత్యర్థులూ ఉన్నారు. అత్యంత వివాదాస్పద వ్యక్తిగా పేరుపొందారు. ఆయన తిట్టినా, దీవించినా అందరూ ఆమోదించేవారు. ఆయన భావజాలంతో ఎవరైనా అంగీకరించకపోవచ్చును గాని, ఆయన ఈ శతాబ్దికన్న 'జీనియస్' అని అందరూ ముక్తకంఠంతో అంగీకరిస్తారు. శతాబ్దాల తరబడి చదివినా జాతి మననం చేసుకోదగినంత సృజనాత్మక సాహిత్యాన్ని నిర్మించిన ప్రతిభామూర్తి విశ్వనాథ.

కమ్మని తెలుగు నుడికారానికీ, ప్రౌఢ సంస్కృత సమాస సంగ్రథనానికీ ఆయన పెట్టింది పేరు. పద్యంలో సైతం వ్యావహారిక భాషా ప్రయోగాన్ని సజీవంగా చేసి చూపించిన సాహితీమూర్తి. ఉపన్యసించటంలో, పద్యం చదవటంలో, వాక్యవిన్యాసంలో, వ్యక్తిత్వావిష్కారంలో తనదైన బాణీని కల్పించుకోవటమే కాకుండా, సమకాలీనులైన పండితులతోనే కాక, సామాన్య ప్రజానీకంతో ఆత్మీయమైన సంబంధాలు పెట్టుకొని తన కథలను గాథలను జాతికి మిగిలించిన సజీవ చారిత్రిక సాహిత్య సమ్రాట్టు విశ్వనాథ!

తెలుగు సాహిత్య వికాసచరిత్రలో 1935 తరువాత వెలువడిన అభ్యుదయ విప్లవధోరణులకు ప్రతిగా జాతీయచైతన్యంతో నవ్యసంప్రదాయోద్యమాన్ని శాంతియుతంగా సాగించిన సాహిత్యోద్యమ నాయకుడు విశ్వనాథ!

ఒక్క మాటలో చెప్పాలంటే - నవ్యసంప్రదాయోద్యమం గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమం వంటిది. ఈ దేశంలోని మట్టిలోని గట్టిదనం ప్రదర్శించి ప్రపంచానికే శాంతిమార్గాన్ని చూపించిన ఉద్యమం సత్యాగ్రహోద్యమం. అటువంటిదే నవ్యసంప్రదాయోద్యమం!

**సూచికలు :**

1. Selected Prose of T. S Eliot: Editor: John Hayward, Penguin Books Ltd, (3rd Edition) 1958, పు. 38-39.
2. Litrary Criticism - A Glossory of major Terms: Patric Murray, Longman group Ltd, Lordon, 1978.
3. Ibid.
4. సాహిత్యం - విమర్శ: సమదర్శిని ప్రచురణ, 1984, పు. 70-71.
5. మహతి - యువభారతి ప్రచురణ, 1972, వ్యాసము: నేనూ - నా సాహిత్య రచనలు. పు. 4.
6. సాహిత్యంలో దృక్పథాలు - నవోదయ పబ్లిషర్స్. పు. 48.

[ఈ వ్యాసంలో కొంతభాగం డా॥ కోవెల సంపత్కుమారాచార్య సంపాదకత్వంలో తెలుగు అకాదమి ప్రచురించిన 'విశ్వనాథ సాహిత్య వ్యక్తిత్వం'లో ప్రచురితం. (1989)]

# 'సంప్రదాయం నిలిచేవుంటుంది హమేషా'

'నవలాయుగం' తరువాత 'నవ్యసంప్రదాయ కావ్యయుగం'గా దాదాపు 1935 నుండి 1975దాకా ఉన్న కాలాన్ని సాహిత్యవికాస చరిత్రలో పేర్కొనటం సమంజసమని నేను ప్రతిపాదించాను(చూడు: ఆదివారం ఆంధ్రప్రభ, 5.2 1989) దీనిని వెంటనే అందరూ అంగీకరిస్తారని నేను అనుకోవటంలేదు. అలా సర్వజనామోదయోగ్యంగా ఏ సిద్ధాంతమూ, ఏ పారిభాషికపదమూ చరిత్రలో పుట్టటం సామాన్యంగా జరగదు. కాని, అటువంటివి పుట్టటం, దానిమీద చర్చలూ, తర్జన భర్జనలూ సాగటం, చివరకు సాహితీలోకం ఆశించిన అనుభవాన్ని వ్యక్తీకరించేవిగా రూఢికెక్కి స్థిరపడటం జరుగుతుంది. ప్రబంధం, భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం మొదలైనవి ఇటువంటి కోవకు చెందినవే. నిజానికి ఏ పారిభాషిక పదంమీద ఎక్కువ చర్చ జరుగుతుందో అది చిరంజీవిగా నిలుస్తుందన్నమాట! ఇలాంటిదే 'నవ్యసంప్రదాయం' అనే పారిభాషికపదం. 'గతితార్కిక భౌతికవాదం' అనే తెలుగు పారిభాషికపదం అంత సమర్థనీయంగా కుదరకపోయినా ఆయా వక్తలు, రచయితలు వాడుతున్న అర్థంలో అది రూఢి కెక్కింది. పారిభాషిక పదాలు ప్రతి పదార్థ తాత్పర్యాలకు లొంగని ఒక అనుభవవ్యంజక ప్రతిపత్తిని సంతరించుకొని ఉంటాయి. పై పదాలన్నీ అటువంటివే. 'నవ్యసంప్రదాయం' అనే పదం కూడా అలాంటిదే. దానిని గురించి, వివరంగా తెలుసుకోవాలంటే ముందుగా సంప్రదాయాన్ని గురించి, ఆ తరువాత నవ్యసంప్రదాయాన్ని గురించీ కొంత ముచ్చటించవలసివస్తుంది.

సంప్రదాయ శబ్దానికి సాహిత్యంలో ప్రాచుర్యాన్నీ, ప్రచారాన్నీ కలిగించింది ఇరవయ్యో శతాబ్దమే. క్రీ.శ. 1900 సంవత్సరం ఒక యెల్ల. అంతకు ముందున్న సాహిత్యమంతా సంప్రదాయ సాహిత్యమని ఆయా యుగాల్లో ఉన్నవారు చెప్పుకొన్నదానికంటె ఈ శతాబ్దంలోని కవులూ, విమర్శకులే దానిని ఆ పేరుతో, ఒకోసారి దబాయిస్తూ- పిలుస్తున్నారు. 1935 నుంచి ఈ ధోరణి

మరీ బలంగా సాగింది. 1935 కు ముందు కవులకు నవ్యతమీద అభిమానం వున్నా సంప్రదాయం అనబడే దానిమీద అనాదరణం లేదు. మంచిని కొంచెంగానైనా గతంలో నుంచి ఎంచుకొని తమ కవితల్లో ఉంచుకొందామనే సమాదరణ దృష్టి ఉండేది. దాన్నే సంప్రదాయమని పిలిచినవారూ ఉన్నారు. ఏమైనా 1935 దాకా సంప్రదాయమంటే కవులలో, రచయితలలో గౌరవభావం ఉండటంచేత ఆ పదం గౌరవవాచకంగానే వినపడుతూ ఉండేది, వాడబడుతూ ఉండేది. మరి ఆ తరువాత అభ్యుదయ కవిత్వం 'సంప్రదాయాన్ని' నిరసిస్తూ, దానిమీద తిరుగుబాటు సాగించింది. అది ఒక వ్యూహం ప్రకారం సాగింది కూడా. సంప్రదాయం మీద దాడి తీవ్రమయ్యేసరికి సాహిత్య సంప్రదాయ రక్షకులు ప్రతి వ్యూహాలు పన్నారు. అవిచ్ఛిన్న సంప్రదాయార్థులై ప్రయోగాలు సాగించారు. ఈ సంఘర్షణలో సంప్రదాయ మథనం సాగింది.

సంప్రదాయం స్వయంగానే చస్తుందని కొందరూ; స్వయంగా చావకపోయినా సంప్రదాయవాదుల్లోని ఛాందసుల చేతుల్లోనే చావు మూడక తప్పదని కొందరూ; అప్పటికీ అది చావకపోతే దుడ్డుకర్రలతోగానీ, మెషీన్ గన్స్‌తోగానీ చంపేయవచ్చని కొందరూ; అలా చచ్చికూడా మరలా ఎప్పుడైనా లేచివస్తుందేమోనని పెద్ద బొంద తీసి, అందులో బందోబస్తుగా పాతిపెట్టాలని కొందరూ ఎన్నో ఊహలూ, ప్రయోగాలూ, ఉద్యమాలూ, విప్లవాలూ సాగించారు. కాని, అభ్యుదయ కవితా నాయకుడు పాడే సాహిత్యోపనిషత్తులో—

''చూశావా! ఆరుద్రా! ఒక తమాషా
సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా
మూఢాచారాలు మారుతూ ఉంటాయి నిజం
కాని, సంప్రదాయం తాత ముత్తాతల ధనం
జాతికి జీవన నాళిక - జానపదగీతిక''

అని వినిపిస్తుంది.

ఆయన చెప్పింది ఏ సంప్రదాయమైనా, అదీ సంప్రదాయమే. ఆ సంప్రదాయం తాతముత్తాతల ధనం. సంప్రదాయాన్ని ఎంత విరోధించేవాడైనా ధనాన్ని కాదన్నవాడిని చరిత్రలో చూడలేదు. తాగి తందనాలాడటానికైనా ఆ

ధనం వినియోగపడుతుంది. అంతదాకా ఎందుకూ-ధనం - అంటే సంపద - తగల బడితే తప్ప, లేదా, తగలబెడితే తప్ప నశించదు. నిజానికి అది సర్క్యులేట్ అవుతుంది. తిరుగుతూ అది క్రొత్త క్రొత్త రూపాలతో పెరుగుతుంది. తిరిగే ధనం నశిస్తే పెరిగే ధనం మందగిస్తుంది. ఒక్కొకసారి పెరిగే ధనం తిరగటం మానేస్తే తన చావును తానే కొని తెచ్చుకొంటుంది. ఏమైనా, సంప్రదాయం చావదని తెలిసినా, అది చస్తే తప్ప పునస్సృష్టి జరగదని విప్లవించే వర్గం, సంప్రదాయాన్ని అభ్యుదయ నిరోధకశక్తిగా భావించి, ఆ పదాన్ని అధిక్షేపార్థంలో, నిందార్థంలో, వెనకబడినతనంగా, పుచ్చిపోయిన చచ్చిపోయిన వ్యవస్థగా సంభావించి సాహిత్య క్షేత్రంలో వ్యవహరిస్తుంటారు. వీరి దృష్టిలో సంప్రదాయం Negative Term. Negative Terms ఎప్పుడూ Negative approach నుంచి పుడతాయి. Negative approach నుంచి మూల విచ్ఛేదం చేసే తిరుగుబాటు ధోరణులు వెలువడతాయి. ఇది సంప్రదాయం కాదు.

'సంప్రదాయం : ప్రయోగం' మీద డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి సమీక్ష ఇది- "అచుంబితమైన ఆలోచనాపాటవ మున్నవారే సంప్రదాయములను నిర్మించి పోవుదురు. అల్పప్రతిభులు వట్టి తిరుగుబాటుతో తృప్తి నొందుదురు....సాహిత్య రంగములో జరుగునవి ప్రయోగములే కాని, మూలచ్ఛేదము చేసెడి తిరుగుబాటులు కావు. ఒకవేళ అట్టివి జరిగినను అవి రాశికి వచ్చునవి కావు. ....సంప్రదాయ మాత్మగాగల నూత్నప్రయోగములు సదా వాంఛనీయములే.... అవాంఛనీయ మొక్కటే. అదే నేలవిడిచి చేసిన సాము; అదే సంప్రదాయమును బొత్తిగా కాదని చేసెడు ప్రయోగము." (ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు : ప్రయోగములు. ద్వి. ము. 1977, పు. 9.) సంప్రదాయాన్ని పూర్తిగా కాదని ప్రయోగం చేయటానికే వీలుండదనీ, ఒకవేళ చేసినా అదీ ఒక సంప్రదాయాన్ని సృష్టిస్తుందనీ, అందువలన సంప్రదాయానికి ఏవిధంగానూ చావు లేదనీ నారాయణరెడ్డిగారి వివేచనం. ఈ సత్యాన్నే 'సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా' అని చాటిచెప్పారు శ్రీశ్రీ. ఇది ఒక 'తమాషా' అని అంత్యప్రాసకోసం అన్నా - 'ఆలోచిస్తే ఆశ్చర్యం కలిగించేవి సుమా!' అని ఆయన భావం.

ఇరవయ్యో శతాబ్దంలో సంప్రదాయాన్ని గురించి వ్యాఖ్యానించాలంటే సంస్కృతం కంటె ఇంగ్లీషునే ఎక్కువగా ఆశ్రయిస్తాం. ఎందువల్లనంటే,' సంప్ర

దాయ సాహిత్యం' అని కానీ, 'సంప్రదాయ కావ్యాలు' అని కానీ సంస్కృతాంధ్ర లక్షణ గ్రంథాలలోని కావ్య విశ్లేషణ పద్ధతులలో వినపడదు; కనపడదు. కాని, ఇంగ్లీషు సాహిత్య విమర్శలో ఈ రకం పారిభాషికపదాలు పదబంధాలు ప్రచారంలో ఉండటంచేత, మనంకూడా వారిలాగా వాడుకోవటం అలవరచుకొన్నాం. టి. యస్. ఎలియట్ వివరించిన 'Tradition' అనే పారిభాషికపదమే తెలుగు విమర్శలో వాడే సంప్రదాయ శబ్దానికి అర్థంగా, పరమార్థంగా నేడు మనం గ్రహిస్తున్నాం. 'Not only of the pastness of the past, but of its presence' అనే దృష్టితో సమీక్షిస్తున్నాం. సంప్రదాయం అంటే అంధానుకరణం కాదనీ, అభినవలోచనం అని సంభావిస్తున్నాం. సంప్రదాయాన్ని గురించి నవ్యంగా ఆలోచించేవారుకూడా ఆధునిక పాశ్చాత్య దృక్కోణంతో ఆ శబ్దార్థాన్ని దాని వినియోగాన్ని వివేచిస్తున్నారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు (హైదరాబాదు) వారి 'సారస్వతవేదిక'లో, 1978 లో 'సంప్రదాయ కవిత'ను గురించి మాట్లాడుతూ డాక్టర్ నాయని కృష్ణకుమారిగారు "ఈ శీర్షిక మీద ఉపన్యసించడానికి ముందు ఈ శీర్షిక ఉద్దేశించిన అర్థాన్ని అవగతం చేసుకోవడంలోనూ, ఆ అవగాహను బట్టి ఉపన్యాస విషయానికి హద్దులు నిర్ణయించుకోవడంలోనూ నేను చాలా శ్రమపడవలసి వచ్చింది. సంప్రదాయ కవిత్వం అన్న పదానికి సమానార్థకపదం ఆంగ్లంలో Traditional Poetry. దాన్నే మనభాషలో తిరిగి చెప్పటానికి ప్రయత్నిస్తే ఆ ఆంగ్లపదానికి ప్రాచీన కవిత్వం అనే అర్థాన్ని యిచ్చేవాళ్లు చాలామంది ఉంటారు...." అని ఉపక్రమించి, "సంప్రదాయమంటే అంతా ప్రాచీనమూ, చాదస్తమైనదీ అని అర్థం కాదనీ, గతం వర్తమానానికి అందించే కాలానుగుణమైన మార్పుల్ని సంతరించుకున్న వారసత్వ మనీ చెప్పడానికి ఇంత తంటాలు పడుతున్నాను ." అని నిర్ధారించి, "ఇటువంటి వారసత్వంలేని కవిత్వమంటూ ఏదైనా ఏర్పడినా అది స్థిరంగా నిలవగలుగుతుందా మరి?"-అని ప్రశ్నించారు. (చూడు : తెలుగు సాహిత్య వికాసం: సంపా: డా॥ కె. కె. రంగనాథాచార్యులు (1979) పు. 1.4) నాయని కృష్ణకుమారిగారి శ్రమ అంతా ఎక్కడ ఉన్నదంటే - Traditonal Poetry అనే పదాన్ని తెలుగులో చాలామంది 'Old Poetry' అనే అర్థంలోనే వాడుతూంటే, అది కాదని, 'కాలానుగుణమైన మార్పులు సంతరించుకొన్న వారసత్వం గల కవిత్వ'మని నిశ్చయించటంలో ఉంది. దీనికి అంత కష్టపడటం ఎందుకు? అని మనకు అనిపించవచ్చు.

1981 లో, 'సారస్వత వేదిక'లోనే 'సంప్రదాయవాదం' మీద ప్రసంగించిన డాక్టర్ ముకురాల రామారెడ్డిగారు ఆధునిక కాలంలో సంప్రదాయం వక్ర వ్యాఖ్యానాలకు గురికావటం వలన ఇటువంటి కష్టం ఏర్పడుతోందని సూచించారు. వారి మాటలివి-"సంప్రదాయం అంటే 'పాతది' అని బాహాటంగా అర్థం చెప్పే సాహిత్య రచయితలు అనేకులు బయలుదేరారు నేటికాలంలో. అంతేకాదు, ఆ మాట వింటేనే ఈసడించుకొంటున్నారు. వీళ్ళ శిష్యవర్గ జనాభా బాగా పెరిగిపోతున్నది. వీళ్ళంతా కలిసి మాది 'ఆధునికం' అంటే- 'కొత్తది' అంటున్నారు. వీళ్ళవాదాలు విని సంప్రదాయజ్ఞులు చప్పరించేస్తున్నారు. ఏమి చేసినా సంప్రదాయజ్ఞుల బలం సన్నగిల్లుతున్న రోజులివి. ఎలా తోస్తే అలా చెప్పి, మేం చెప్పిందే 'ఆధునికం' అన్నవాళ్ళ బలగమే బాగా వర్ధిల్లుతున్నది. ఇదంతా ఎందుకు జరుగుతున్నది? అంటే - సంప్రదాయ లక్షణాలు, ఆధునిక లక్షణాలు స్థూలంగానైనా తెలియకపోవటంవల్ల, వాటి పరిణామాలు చారిత్రక దృక్పథంతో త్రిపారువేసి చూచుకోక పోవడంవల్ల కొంత గజిబిజి జరుగుతున్నదని చెప్పవచ్చు." (ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న దృక్పథాలు: సంపా: డా॥ కె. కె. రంగనాథాచార్యులు (1982) : పు. 204-205.) ఆధునిక యుగంలో సంప్రదాయవాదాన్ని గురించిన సక్రమమైన అవగాహన సాహితీపరులకు అందించవలసిన అవసరం ఎంత ఉన్నదో ముకురాలవారి మాటలు తెలియజెపుతున్నాయి.

నేటి తెలుగు సాహిత్యంలో 'సంప్రదాయం', 'సంప్రదాయకవిత్వం', 'సంప్రదాయ కావ్యం', 'సంప్రదాయ ధోరణి', 'సంప్రదాయవాదం' మొదలైన పారిభాషిక పదాలు వినపడుతూ ఉన్నాయి. అయితే, 'సంప్రదాయోద్యమం' అని చెప్పే వరిపాటిలేదు. కాని, 'నవ్యసంప్రదాయోద్యమం' అని రూఢిలో ఉంది. ఆధునిక యుగంలోని సంప్రదాయ కావ్యాలను గురించి ఒక అవగాహన పెంచుకోవాలంటే, సంప్రదాయాన్ని గురించిన ఈ క్రింది చారిత్రక పరిణామగతిని మనం ప్రాతిపదికగా ఉంచుకోవాలి.

ఏ సాహిత్య చరిత్రలో నైనా ఒక పరిణామం బలంగా సాగేటప్పుడు టి. ఎస్. ఎలియట్ పేర్కొన్నట్లు - మూడు రకాల కవులు, రచయితలు గోచరిస్తారు. ఒక రకం - గతాన్ని మాత్రమే గౌరవించేవారు. మరొక రకం - భవిష్యత్తుమీది ఆశతో గతాన్ని కాలదన్నేవారు. ఇక మూడోరకంవారు - గతంలోని మంచినీ, వర్తమానంలోని వ్యక్తిత్వాన్నీ సంవదించుకొన్న సంయుక్త మూర్తిమత్వాన్ని సమతౌల్యంతో సాధించేవారు. వీరిలో మొదటివారు అనుకర్తలు.

వీరికి గతంమీద భక్తి ఎక్కువ. గతానికి నీడలాగా, గతాన్ని నెమరువేసుకొనే లాగా వర్తమానాన్ని భావిస్తారు. వీరిని సంప్రదాయవాదులని కొందరంటారు. నిజానికి వీరు సంప్రదాయవాదులు కారు, గతాన్ని గుడ్డిగా అనుసరించేవారు. అయితే, సంప్రదాయం మాత్రం ఎప్పుడూ గుడ్డిది కాదు.

రెండవరకంవారు తిరుగుబాటుదారులు. వీరి దృష్టిలో సంప్రదాయం గత వైభవం లాంటిది. మృతప్రాయమైనటువంటిది. వర్తమానానికి పనికిరానిది; త్యజింపతగింది. వీరు ద్వేషించే పదాలలో మొదట పేర్కొనదగింది 'సంప్రదాయం.' వీరు సంప్రదాయానికి కల్పించే అర్థాలే దానిని అపార్థం చేసుకొనటానికి దారితీస్తాయి. తెలుగులో అభ్యుదయ వాదుల్లోని వామపక్షీయులు, విప్లవవాదులు సంప్రదాయానికి మొదటిరకంవారే ప్రతినిధులని, వారి ధోరణే సంప్రదాయమని తమ తమ అర్థాలు చెప్పి, అసలు అర్థాన్ని వక్రీకరించటం జరిగింది. అదీ, ఒక వ్యూహాన్ని అనుసరించి. కొందరి దృష్టిలో మూడోరకం లేనేలేదు అభ్యుదయ వాదుల్లో చీలికలు తెప్పించిన మౌలికమైన అంశాల్లో సంప్రదాయాన్ని గురించిన వారి భావాలు కూడా ఉన్నాయని ఆ చరిత్ర తెలిసిన మనం మరచిపోలేం. ఏమైనా దానివలన సాహిత్యలోకంలో గందరగోళం కలిగినమాటమాత్రం సత్యం.

ఈ పరిస్థితుల్లోనే సంప్రదాయాన్ని గురించి, దాని శక్తినిగురించి కవులు, రచయితలు, విమర్శకులు గాఢంగా భావించటం, దానిని శాస్త్రీయంగా ఆలోచించటం, ప్రయోగాల రూపంగా ప్రపంచించటం ప్రారంభించారు. ఆధునిక తాత్త్విక ధారలతోనూ, సమకాలీన జాతీయోద్యమ ప్రవృత్తులతోనూ కలిసి, సంప్రదాయం అభినవరూపంతో సాహిత్యక్షేత్రంలో నర్తించటం ప్రారంభించింది. ఇది దాదాపు 1930-35 మధ్య ఆరంభమైంది. (దీనికంటే ముందే నాటక, నవలా ప్రక్రియలలో ఈ చైతన్యం కొన్ని గొప్ప ప్రయోగాలు వెలువడటానికి దోహదకారి అయింది.) దీనినే 'నవ్య సంప్రదాయోద్యమ'మని వివేచిస్తున్నాం.

1935కు ముందున్నది సంప్రదాయ చైతన్యమనీ, ఆ కాలంలోని కావ్యాలు సంప్రదాయధోరణిని వ్యక్తం చేస్తున్నాయనీ వామపక్ష రచయితలు, విమర్శకులు విస్తృతంగా ప్రచారం చేశారు. సాహిత్య సమాలోచనంలో దాదాపు రూఢి కెక్కించినంతపని చేశారు. ఈ చారిత్రక వాతావరణంలో 1935 తరువాత జాతీయోద్యమ స్ఫూర్తితో, హైందవ సంస్కృతి పునరుజ్జీవన చైతన్యంతో,

మహాకావ్య నిర్మాణం, లేదా, క్లాసిక్ ప్రమాణాలుగల కావ్య ప్రక్రియలను, ప్రయోగాలను సాగించినవారు నవ్య సంప్రదాయోద్యమ కవులు. ముందువారి కంటె వీరు సాధించిన నవ్యతను తెలియజెప్పటానికి 'నవ్య సంప్రదాయం' అని పేరు పెట్టారు అది దాదాపు ఆ అర్థంలో రూఢి కెక్కింది.

ఒకవేళ సంప్రదాయ కావ్య చరిత్రను ప్రత్యేకంగా వ్రాయాలని ప్రయత్నం చేస్తే, ఆధునిక యుగంలో ముఖ్యంగా రెండు అధ్యాయాలు నిర్మించ వలసి వస్తుంది. అందులో మొదటి అధ్యాయం క్రీ. శ 1900 నుండి 1934 దాకా వ్యాపించి ఉంటే, రెండవది 1935 నుండి 1980 దాకా విస్తరించి ఉంటుంది. వీటిల్లోనే అవసరాన్నిబట్టి అంతర్విభాగాలను ఏర్పరచుకోవచ్చు. అయినా, మొత్తంమీద మొదటి అధ్యాయాన్ని 'సంప్రదాయ ధోరణి' అనీ, రెండవ అధ్యాయాన్ని 'నవ్య సంప్రదాయోద్యమం' అనీ నిర్దేశించవచ్చు.

వీరేశలింగం పంతులుగారి దగ్గరనుంచీ తెలుగు సాహిత్య ప్రక్రియలన్నీ తెలుగుకు క్రొత్తవైనా పాశ్చాత్య ప్రక్రియా సంప్రదాయానికి కొత్తవి కావు. ఇది బాగా గుర్తుంచుకోదగిన అంశం. అంతేకాదు, ప్రాచీన కావ్యాలకు మనం సొంతంగా లక్షణాలను నిర్దేశించుకోకుండా సంస్కృతాలంకార శాస్త్ర మర్యాదను, సంప్రదాయాలను అనుసరించి అన్వయాలు చెపుతున్నాం. ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలన్నింటికీ సంప్రదాయ మూలాలున్నాయి. అయితే, అవి ఇంగ్లీషులో ఉన్నాయి. తెలుగులో వెలసిన ప్రక్రియలన్నీ అనుకరణలు కావు; మన కవులు తమ దేశ కాల పాత్రాల ననుసరించి తెలివితో విశిష్టంగా వినిర్మించినవి. అందువల్లనే అవి అనుకరణలు కావు; ఏదో ఒక సంప్రదాయాన్ని మన్నించిన విశిష్ట ప్రయోగాలు.

'సంప్రదాయం' అనే పారిభాషిక పదం వక్రీకరింపబడిన అర్థంలో రూఢి కెక్కిందని తెలుసుకొని, సవ్యంగా దాని స్వరూప స్వభావాలను సంభావించటం, ప్రయోగించటం నేటి సాహితీవేత్తల ప్రథమ కర్తవ్యం. 'సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా.'

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 10-12-1989)

# ప్రశ్నించటం ప్రగతికి ప్రారంభం

"The critic's duty is to keep communications open between reader and writer, the present and past and also to indicate what of the past needs most attention in our own time, to keep in fact, the classics before our eyes. A related duty is to discriminate among the masses of the books being produced at the present moment in order to endure that the best work gets a fair hearing. To do all this requires a highly developed sense of value." - Philip Hobsbaum. (Essentials of Literary criticism.)

ఈనాడు తెలుగులో సాహిత్య విమర్శకులు నిర్వహించవలసిన కర్తవ్యాలను మనం ఫిలిప్ హాబ్స్‌బామ్ మాటల్లో నెమరువేసుకోవచ్చు. అంతేకాదు, ఈ కర్తవ్యాలను గుర్తించి ముందంజ వేస్తున్న విమర్శక వర్గాన్ని కూడా మనం నేడు గుర్తించవచ్చు. భారతీయ భాషా సాహిత్యాలలో Post Modernism అనే ధోరణి దాదాపు అయిదారేళ్ళుగా బలాన్ని పుంజుకొంటున్నది. తెలుగులో విప్లవ కవిత్వానంతర ధోరణులలో అంతర్లీనంగా ఆవిర్భవిస్తున్న సాహిత్య చైతన్యం దానికి సజాతీయమైనదే. అభ్యుదయ కవిత్వోద్యమకాలంలో ఆ చైతన్యానికి అనుగుణంగా ఆలోచించి, ప్రయోగాలు నిర్వహించిన కవులూ, విమర్శకులూ తమకు కావలిసిన పారిభాషిక పదాలను సృజించుకొన్నారు తమ ధోరణికి అనుకూలంగా మరికొన్ని పారిభాషిక పదాలకు తమ తమ అర్థాలను కల్పించి రూఢి కెక్కించారు. తమ వాదానికి అనుగుణమైన ఒక పంథాను ఏర్పరచుకొన్నారు. సాహిత్యరంగంలో ఏ ఉద్యమాన్ని ప్రవర్తింపచేసేవారైనా పై పనులన్నీ చేస్తారు.

చారిత్రకంగా అభ్యుదయ కవిత్వోద్యమాన్ని కాదనటం వాస్తవాన్ని కాదనే గ్రుడ్డితనం అవుతుంది. అయితే, పరిణామం కలగదని భావించటం కూడా

వాస్తవ విరుద్ధమే అవుతుంది. అభ్యుదయ కవిత్వం అనేది విప్లవ కవిత్వం వచ్చే సరికి పాతదై పోయింది. కొందరు అభ్యుదయ కవిత్వోద్యమంలోని భాగమే విప్లవ కవిత్వం అని పేర్కొన్నారు. వారి సిద్ధాంతంప్రకారం అభ్యుదయ కవిత్వోద్యమమే కలకాలం ఉంటుంది; ఉండాలని వారి కామన! విప్లవవాదులు కొందరు దీని నంగీకరించరు. అభ్యుదయవాదులకంటే వారు ముందుకు పోయి నట్లు చెప్పుకుంటారు. అభ్యుదయం తరువాత వచ్చేది వెనుకబడినతనమా? ఎన్నటికీ కాదు. అభ్యుదయం ఒకనాటి ఉద్యమానికి ఆ కాలంవారు పెట్టుకొన్న పేరు. ఆ ధోరణి మారితే ఆ పేరు కూడా మారుతుంది దానితోపాటు విమర్శ దృక్పథం మారుతుంది; సాహిత్యగమనం మారుతుంద్; అలాగే ప్రయోగప్రవృత్తి మారుతుంది. అందువలన చారిత్రకంగా ప్రతి ఉద్యమమూ, ప్రతి ధోరణీ గౌర వింపదగినవే. అయితే, మార్పు వస్తున్నప్పుడు, వచ్చినప్పుడు ఆదినుండీ అప్పటి దాకా వచ్చిన సాహిత్యాన్ని సమీక్షించే దృక్పథం మారుతుంది. క్రొత్త ధోరణి గానీ, ఉద్యమంగానీ వచ్చినప్పుడు పూర్వధోరణులతూ, ఉద్యమాలకూ సంబంధిం చిన సిద్ధాంతాలనూ, పారిభాషిక పదాలనూ విమర్శించి నవ్యమార్గాలను ఆవిష్క రించటం సహజం. నిజానికి సాహిత్య ప్రగతిలో ఈ ప్రవృత్తి లేకపోతే పరిణా మమే ఉండదు. ఎప్పుడూ ఒకే ధోరణి ఉండదు; ఉద్యమం ఎంత ఉద్ధృతంగా సాగినా దానికి ఉపశాంతి ఉండకమానదు. అలాగే, భారతీయ భాషా సాహిత్యా లలో అభ్యుదయ, విప్లవ ధోరణులు, ఉద్యమాలు వెనుకబడి పోస్ట్ మోడరన్ ప్రవృత్తులు ఉద్యమస్ఫూర్తితో ముందంజవేస్తున్నాయి. తెలుగువారిలో ఆ వేడి ఇప్పుడు తెలుస్తున్నది. అభ్యుదయ కవిత్వానంతరధోరణులు ఆధునిక దృక్పథంతో భారతీయాత్మను, భారతీయతను- అంటే జాతీయతను, జాతీయ జీవనధర్మాన్ని, జీవనతత్త్వాన్ని దర్శించి వ్యాఖ్యానించి చెప్పే ప్రయత్నం చేస్తున్నాయి. అంతర్జా తీయ దృక్పథం జాతీయ దృక్పథంకంటె విశాలమైనదనీ, ఉన్నతమైనదనీ, ఉపాదేయమనీ వ్యాఖ్యానించిన అభ్యుదయవాదం నేడు ప్రపంచంలో పునర్విమ ర్శకు గురి అవుతున్నది. జాతీయమైన అస్తిత్వం లేనిదే అంతర్జాతీయంగా గుర్తింపు కలగటంలేదు ఏ జాతికీ, ఏ దేశానికీ. ఒక రాజకీయ సిద్ధాంతాన్ని విశ్వసించి ఆచరిస్తున్న నేటి దేశాలలో ఆ సిద్ధాంతాన్ని ఒక్కొక్క దేశం తన జీవన విధానానికీ, సంస్కృతికీ, తాత్త్వికచింతనకూ అనుగుణంగా మలచుకొని తన వ్యక్తిత్వాన్నీ, ప్రత్యేకతనూ చాటుకొంటున్నది. భిన్నత్వంలో ఏకత్వం అనేది సాంస్కృతికంగా మన భారతదేశానికి ఎలా అన్వయిస్తుందో, రాజకీయంగా

నేటి కమ్యూనిస్టు దేశాలకు కూడా వర్తిస్తున్నది. ప్రపంచం నలుమూలలా మార్పు ముంచుకొని వస్తున్నది మానవుని స్వేచ్ఛ ఒక రాజకీయ, ఆర్థిక, సామాజిక సిద్ధాంతంవలన రాదనీ, అతని ఆధ్యాత్మిక లేదా తాత్త్వికమైన జీవన వికాసానికి ఏర్పడే స్వాతంత్ర్య వాతావరణానికి కల్పించే రక్షణవలననే ఏర్పడుతుందనీ, అటువంటి సమాజాన్ని ప్రపంచంలో పునర్భవింపచేయటానికి ఏ జాతి కాజాతి లేదా ఏ దేశానికాదేశం లేదా సాంస్కృతిక సామ్యంగలిగిన ఏ ప్రాంతానికాప్రాంతం వ్యష్టిగా కృషి చేస్తూ, సమష్టిగా జగత్కుటుంబశ్రేయస్సుకు పాటుపడాలనే భావం ప్రపంచమంతటా నేడు ప్రజ్వలిస్తున్నది. ఈ భావం సంకుచితం కాదు; ఈనాడు ప్రపంచ అస్తిత్వాన్ని రక్షించే విశ్వవ్యాప్తమైన భావం. నేటి తెలుగు రచయితకు ఇది క్రొత్త ఊపిరి; క్రొత్త ఉద్యమం.

ఈ దృకథ్పంతో గతాన్ని సమీక్షిస్తున్నాం; మన పురాణాలు, ఇతిహాసాలు, మహాకావ్యాలు మన కెలా వర్తమాన స్ఫూర్తిని కలిగిస్తున్నాయో పునః పరిశీలించటం ప్రారంభిందాం; మనం వెనక్కుపోవటం లేదు; ముందుకు పోవటానికి తగిన సత్తువను గతంలోనుంచి ఓపినంత పుంజుకొంటున్నాం. ఈనాడు అసంఖ్యాకంగా పుస్తకాలు ప్రచురింపబడుతున్నాయి. అన్నీ అందరూ చదువలేరు; చదువవలసిన అవసరమూ లేదు; అయితే, ఏవి చదవాలో జాతికి చెప్పవలసిన బాధ్యత మనకున్నదని గట్టిగా నమ్ముతున్నాం; నా జాతికి, నా సంస్కృతికి, నా భారతీయతకు, నా అస్తిత్వానికి, నా అనుభూతికి, నా అభివ్యక్తికి, నా దర్శనానికి సాహిత్యానికీ ఉన్న సంబంధాన్నీ, నా సాహిత్యం అంతర్జాతీయ వికాసానికి ఎలా దోహదం చేయగలదో అన్న ఆలోచననూ ప్రతి భారతీయుడూ చేయటం అత్యంత ఆధునికధోరణిగా పరిగణిస్తున్నాం. ఇటువంటి ఉద్యమం నేడు తెలుగులో ఊపిరిపోసుకుంటున్నట్లు కళ్ళారా చూస్తున్నాం.

దాదాపు కడచిన అరవైయేళ్ళనుంచీ వస్తున్న సాహిత్యధోరణులను గానీ, ఉద్యమాలనుగానీ పరిశీలిస్తే వాటిని మూడు రకాలుగా వివేచించవచ్చు: 1. రాజకీయ పార్టీ మద్దతుకానీ, అజమాయిషీకానీ ఉన్న రచయితల సంఘాలు నిర్వహించినవి. 2. పార్టీ బలం వెనుకలేని స్వతంత్ర రచయితల సంఘాలుగాని, కొందరు రచయితలు సంఘటితంగాగాని సాగించినవి. 3. సంఘీభావ స్పృహ లేకుండానే సమకాలీనమైన ఒక చైతన్యాన్ని రచయితలు ఎవరంతట వారుగా

పోషించినవి. వీటిలో మొదటిదానికి ఉదాహరణంగా అభ్యుదయ రచయితల సంఘాన్ని పేర్కొనవచ్చు. దానికి కమ్యూనిస్టు పార్టీ వెన్నెముక. అలాగే విప్లవ రచయితల సంఘం కూడా మార్క్సిస్టుల పార్టీకి ఉపాంగం ఆ పార్టీలలో ఎన్ని శాఖలుంటే ఆ సంఘాలలో అన్ని శాఖలు ఉండటం సహజం. వీటి జయాప జయాలు, స్తబ్ధతలు, నిర్వీర్యతలు, విజృంభణలు, విభేదాలు - అన్నీ పార్టీల స్థితిగతులమీద ఆధారపడి ఉంటాయి. 1955 లో కమ్యూనిస్టు పార్టీ ఎన్నికలలో (ఆంధ్రరాష్ట్రంలో) చిత్తుగా ఓడిపోవటం అభ్యుదయ రచయితల సంఘ ప్రగతికి పెద్ద దెబ్బైపోయింది. దానితో అరసం ఉద్యమం మందగించింది. అభ్యుదయ రచయితల సంఘం బలంగా ఉన్న రోజుల్లో (1946 - 48) కమ్యునిస్టుపార్టీలో చీలికలంతగా ఉండేవి కావు. విప్లవ రచయితల సంఘం ఏర్పడిన నాటికి (1970) పార్టీలో గ్రూపులు బలంగా ఏర్పడ్డాయి. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలో చనా ధోరణులను మన దేశ పరిస్థితులకు అనుగుణంగా అన్వయించుకొనే పద్ధతు లను రూపొందించుకోవటంలో ఆ గ్రూపుల మధ్య ఏకాభిప్రాయం లేదు. అందువలన సాహిత్యధోరణుల్లోనూ చీలికలొచ్చాయి.

విప్లవవాదాన్ని గురించీ, విప్లవవాదులలో ఏర్పడిన చీలికలను గురించీ ఆచార్య చేకూరి రామారావుగారు చెప్పిన కొన్ని మాటలు—

1. ''రాజకీయంతో సంబంధం లేని సాహిత్య విప్లవవాదమంటూ ఏదీ లేదు. రాజకీయమనే మాటకు కమ్యూనిస్టులలో కూడా ఒకే అర్థం ఉన్నట్టు లేదు. సాయుధ పోరాటమే విప్లవమని కొందరంటే; మార్గమేదైనా, సోషలిజం దిక్కుగా జరిగే పరివర్తనమే విప్లవమని మరికొందరంటారు. తెలుగు భాషకు సమగ్రమైన నిఘంటువు తయారుచేసేవాళ్ళు 'విప్లవం' అనే మాటకున్న అర్థభేదాలు వివరించ దలుచుకుంటే చాల శ్రమపడాలి.'' (ఆధునిక తెలుగు సాహిత్యంలో విప్లవవాదం (వ్యా) - ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు (1982) - సంపా. కె.కె. రంగనాథాచార్యులు; పు. 194.)

2. ''కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలికలు, ఈ ఉద్యమాల్లోనూ ప్రతిఫలిస్తున్నాయి.'' (పు. 192.)

3. ''చీలిన కమ్యూనిస్టులూ, రచయితలూ చీలిక తప్పనిసరి అనీ, అనివా ర్యమనీ, దానికి విచారించాల్సిన పనిలేదనీ వాదిస్తారు. ఒకరిమీద ఒకరు పత్రికల్లో, కరపత్రాల్లో నిందలు వేసుకుంటారు. వీటికయ్యే ఖర్చును భరించేది ప్రజలే. ఇవన్నీ ప్రజల కోసమే జరుగుతై. ప్రజల పేరుమీదుగా జరుగుతై. దుర

దృష్టకరమైన విషయమేమంటే. ఈ చీలికల మహాసంరంభంలో ప్రజలు ప్రేక్షక మాత్రులు. ఈ చీలికలు అన్ని వేళలా సిద్ధాంత ప్రాతిపదికమీదనే జరుగుతా యనుకోను. ఒక్కోసారి నాయకుల స్వభావాలు కూడా కారణం కావచ్చు. కాని, కాయితంమీద సిద్ధాంతాలే కనిపిస్తయ్." (పు 199.)

4. "సాహిత్యంలో అభ్యుదయవాదం - విప్లవవాదం అని రెండు ప్రధాన వాద భేదాలున్నై. విప్లవవాదుల్లో అరుణోదయ - జననాట్యమండలి భేదాలు ఒక వంకా, వి.ర.సం, జనసాహితి భేదం ఇంకో వంకా ఉన్నాయి." (పు. 202.)

5. "పందిటాపురం, ఆదిలాబాదు రైతు పోరాటాలను విప్లవవాదులు కీర్తిస్తారు. అభ్యుదయవాదులు పట్టించుకోరు. ఇంద్రవెల్లి గోండుల హత్యాకాండ గురించి విప్లవవాదులు రాస్తారు. ఇతరులు ఉపేక్షిస్తారు. ఇక్కడా వాళ్ళవాళ్ళ అభిమాన రాజకీయ గ్రూపుల పాత్రనుబట్టే రచనా వ్యాసంగం ఉంటుంది. అంతర్జాతీయరంగంలో చైనాను ప్రశంసిస్తూ కొందరు రాస్తే, రష్యాను ప్రశం సిస్తూ కొందరు రాస్తారు. కంపూచియా సమస్యలో అభ్యుదయ, విప్లవవాదులు భేదిస్తారు. జనరాలిటీస్‌లో ఈ భేదం కనపడదు. స్వదేశీ పోరాటాల్లో విప్లవవాదుల మధ్యకూడా ఏకత్వం లేదు. అదే సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది." (పు. 203.)

6. "మార్క్సిస్టు విమర్శకు నమూనాగా గ్రహించదగిన గ్రంథ విమర్శ గాని, ప్రక్రియా విమర్శగాని తెలుగులో ఇంకా రావలసి ఉంది. ఈ విషయంలో విప్లవవాద సాహిత్యం అభ్యుదయ సాహిత్యం కన్నా సాధించిందేమీ లేదు." (పుట. 202.)

7. "1970-80 సంవత్సరాల మధ్యకాలం తెలుగులో విప్లవవాదయుగంగా గుర్తించవచ్చు" (పు. 203.)

రాజకీయ పార్టీలపై ఆధారపడిన ఉద్యమాలను గురించి ఒక వివాదం ఉంది. రాజకీయ వాదుల దృష్టిలో ఉద్యమం అంటే రాజకీయ ఉద్యమమే. సాహిత్యంలో ఉద్యమం ఉండదు. రాజకీయ ఉద్యమానికి ఆసటగా, బాసటగా, ఒక్కొకసారి సాంస్కృతికమైన ఉద్యమాంగంగా సాహిత్యం ఉంటుందే కాని, సాహిత్యానికి రాజకీయేతరమైన ఉద్యమం ఉండదని కొందరు వాదిస్తారు. మరి కొందరు సాహిత్యోద్యమాలను పేర్కొనే పద్ధతిని అనుసరిస్తారు. అంతేకాదు, రాజకీయేతరాలైన మరికొన్ని సాహిత్యోద్యమాలను కూడా మన్నిస్తారు. విప్లవ కవిత్వోద్యమం చాలవరకు రాజకీయపరమైనదే. అభ్యుదయ కవిత్వోద్యమం

మిశ్రరూపంగా ఉంటుంది. అయితే విప్లవకవులు, అభ్యుదయ రచయితలు భావ కవిత్వాన్ని కూడా ఉద్యమంగా పేర్కొనటం కనపడుతుంది. ఈ పద్ధతిని మార్క్సిస్టు రాజకీయవేత్తలు ముఖ్యంగా ఒప్పుకోరు ఈ విషయమై రాజకీయ వాదులకూ, రచయితలకూ అప్పుడప్పుడు అభిప్రాయ భేదాలు వస్తూంటాయి. ఏమైనా, రాజకీయ పార్టీలతో ముడిపడిన రచయితల సంఘాలు సాగించే ఉద్యమాలకు 'మీట' రాజకీయంలో ఉంటుంది; 'మాట' రచయిత నోట పలుకుతుంటుంది.

ఇక రెండవ రకం. తెలంగాణా రచయితల సంఘం, ఫ్రీవర్స్ ఫ్రంట్ మొదలైనవి ఇందులో పేర్కొనవచ్చు. ఒకటి తెలంగాణాలో కవితా చైతన్యాన్ని పెంపొందింప జేయటానికి, మరొకటి కుందుర్తి నాయకత్వంలో వచన కవితా ప్రక్రియలను విస్తరింపజేయటానికి విశేషంగా కృషిచేశాయి కొందరు రచయితలు సంఘటితంగా సాగించిన కృషికి ఉదాహరణంగా దిగంబరకవులను, వారి రచనలనూ పేర్కొనవచ్చు. వీరి కృషిని గురించి ప్రశంసిస్తూ కొందరు మార్క్సిస్టులు - వీరు తెలుగు కవితకు షాక్ ట్రీట్ మెంటిచ్చారని అంటారు. అభ్యుదయవాదులు కొందరు వీరి ధోరణిని నిరసిస్తారు. శ్రీ సోమసుందర్‌గారి మాటల్లో-"వర్తమాన వ్యవస్థను తీవ్రమైన బూతులతో దుయ్యబట్టటం చూసి, దిగంబరులు అభ్యుదయకరపాత్ర నిర్వహించగలరని కొందరు భ్రమపడ్డారు. ప్రజాస్వామిక వ్యవస్థ పనికిరాదని, నియంతృత్వ మొక్కటే సర్వసమస్యా పరిష్కారమనీ భావించే కరుడుకట్టిన ఫాసిస్టులు సైతం వర్తమాన వ్యవస్థను తీవ్రంగానే విమర్శిస్తారు. తీవ్రంగా విమర్శించినదంతా అభ్యుదయమే ననుకొని భ్రమ చెందటంలో నిష్కృతి కలిగించదు. అతివేల ప్రగల్భంతో అట్టహాసం చేసిన దిగంబర ఉద్యమం ఆయిదేళ్ళయినా బ్రతకకుండానే కళ్ళుమూసింది." (అభ్యుదయ కవిత్వంలో ప్రమాణాలూ, పరిణామాలు (వ్యా); అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు (1987 పు. 40.)

ఇక మూడవ విభాగానికి ఉదాహరణగా అభ్యుదయకవిత్వానికి ప్రతిగా వచ్చిన నవ్యసంప్రదాయ కవిత్వోద్యమాన్ని పేర్కొనవచ్చు. ఈ ఉద్యమం కవులకు రచయితల సంఘాలు లేవు; మేనిఫెస్టోలు లేవు; కార్యాచరణ సూత్రాలు లేవు; ఆదేశించి అదుపుచేసే రాజకీయపార్టీలు కూడా లేవు. అయినా, సమకాలీన జాతీయ సమగ్ర చైతన్యానికి స్పందించి, కర్తవ్య పరాయణత్వంతో రచయితలు

దేశీయమైన వివిధ ప్రక్రియల్ని భక్తి శ్రద్ధలతో ప్రతిభామయంగా నిర్వహిస్తూ వచ్చారు. ఈ రచయితలకు సంఘటితమైన ఒక సంస్థ లేకపోయినా, సాంస్కృతికమైన ఒక సమన్వయ సంస్కార వ్యవస్థ అంతర్గతంగా అవగాహనగా బలంగా ఉంది. నేడు రచయితలలో అభినవంగా రేకెత్తిన చైతన్యం నవ్యసంప్రదాయాన్ని నవ్యంగా సమన్వయించటానికి యత్నిస్తోంది.

నేటి యువతరం సాహిత్యంలో అంతర్నిగూఢంగా ప్రవహించే జాతీయతా శక్తిని అన్వేషిస్తున్నది; విశ్లేషిస్తున్నది; వివేచిస్తున్నది; అభివ్యక్తీకరిస్తున్నది; ప్రయోగంగా ప్రదర్శిస్తున్నది; అంతస్సత్త్వంగా అనుభవిస్తున్నది. ప్రక్రియలో, ప్రవృత్తిలో, భాషలో, భావంలో, వస్తువులో, శిల్పంలో అంతర్జాతీయమైన అవగాహనకు తన జాతీయమైన అస్తిత్వం ఒక బలమైన సాధనం కావాలని యత్నిస్తున్నది. ఈ తరుణంలో ప్రతి భాషా సాహిత్యవేత్తా, రచయితా తన గత సాహిత్య చరిత్రలో ఇటువంటి ప్రవృత్తిగల రచయిత లెవ్వరో లెక్కించుకొంటున్నాడు; ఆయా రచయితల సాహిత్య దర్శనాలను, ప్రక్రియలను, ప్రవృత్తులను విశ్లేషించుకొంటున్నాడు; సాహిత్యచరిత్రను పునర్విభజనంచేసి, పునర్వ్యాఖ్యానించటానికి పూనుకొన్నాడు.

తెలుగులో ఈ ఉద్యమప్రచారం ఇప్పుడు మొదలైంది. నాలుగైదేళ్ళుగా ఈ చైతన్యం బాగా పుంజుకొంటున్నది. 1987 లో ప్రచురింపబడిన "అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు"అనే వ్యాస సంకలనం ఈ చైతన్యాన్ని కొంత సంపుటీకరించింది. ఆదునిక సాహిత్య చరిత్రలో ఈ నవతరంవారు తాము నిర్వహింపవలసిన పాత్రను సంఘటితంగా సాగించాలనే ప్రయత్నం సాగుతోంది. ఆంధ్ర సారస్వత పరిషత్తువారి 'సారస్వత వేదిక' ఈ యేడు 'నవ్యసంప్రదాయోద్యమం' మీద నిర్వహిస్తున్న ఉపన్యాస వ్యాస పరంపర ఈ మార్గంలో మరో బలమైన ముందడుగు.

ఈ పరిస్థితుల్లో, తమకంటె ముందు, కొన్ని సాహిత్య మర్యాదలకు వామపక్షీయులు తమవాదాలకు అనుగుణంగా చెప్పిన వ్యాఖ్యానాలను నేడు యువకులు తిరగదోడుతున్నారు; తిరిగి ప్రశ్నిస్తున్నారు. ప్రశ్నించటం ప్రగతికి ప్రారంభం!

*

(సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ: 17-12-1989.)

# పేరులో పోలికలున్నా
# తీరులో పొరులు మనవే!

"పల్లెపదం మంచిది విన్నప్పుడు
ఝల్లు మంటుంది దేశీయుని గుండె
ప్రబంధం గొప్పది చదువుతున్నపుడు
చుర్రుమంటుంది పాఠకుని మెదడు
సంప్రదాయం తెలియాలి మొదటిదానికి
సంస్కారం కావాలి రెండోదానికి
ఏది మహాకావ్యం? ఏది పూజనీయం?"

'సాహిత్యోపనిషత్తు'లో ఆరుద్ర వేసిన ఈ ప్రశ్నకు శ్రీశ్రీ సమాధానం ఈ క్రిందిది—

"మహాకావ్యానికి క్రైటీరియా
సైజూ బరువూ కావయా
నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే
నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే!
పల్లెపదం ప్రబంధం అన్నావు
ఒకటి గుండెనీ ఇంకొకటి మెదడునీ కదిలిస్తాయన్నావు....
బాగుంది ఒప్పుకొంటున్నాను....
మెదడూ హృదయం మిళితమయే గుణం
అదే మహాకావ్యానికి ఏకైక లక్షణం"

ప్రసిద్ధమైన ఈ కవితాసంవాదంలో ప్రస్తుతం మనం గమనించే విషయాలు ప్రధానంగా రెండు. అవి - 'సంప్రదాయం' 'మహాకావ్యం' అదే పారిభాషిక పదాలు ప్రయోగించిన విధానం.

ఆరుద్రగారు పల్లెపదాన్ని గురించి చెపుతూ అది దేశీయునీ, గుండె ఝల్లు మనేటట్లు చేస్తుందనీ, అలా శ్రోత అనుభవించాలంటే అతనికి ఆ పల్లె పదానికి సంబంధించిన సంప్రదాయం తెలిసివుండాలని పేర్కొన్నారు. ప్రబంధ పఠితకు అర్థం చేసికొని ఆనందింపగలిగే సంస్కారం ముఖ్యమని వివేచించారు. ఈ రెండింటినీ శ్రీశ్రీ అంగీకరిస్తూ పల్లెపదం గుండెను కదిలిస్తుందనీ, ప్రబంధం మెదడును కదిలిస్తుందనీ చెప్పారు. ఆరుద్ర కవితామయంగా ప్రశ్నిస్తే శ్రీశ్రీ దాని తాత్పర్యాన్ని కావ్యశాస్త్ర పరిభాషకు దగ్గరగా తెచ్చి లక్షణ సూక్తంగా చెప్పి, ఆపైన వ్యాఖ్యానించాడు.

పల్లెపదం మౌళిక సంప్రదాయానికి సంబంధించింది. ఆ సంప్రదాయం తెలిసిన దేశీయునికి మాత్రమే హృదయం ద్రవిస్తుందని ఆరుద్ర ప్రతిపాదనం. శ్రీశ్రీ ఆ సంప్రదాయం గురించి మాట్లాడడు. అయితే "అన్ని కళల్లాగే కవిత్వం కూడా, ఏకకాలంలో రెండు లెవెల్స్‌లో పనిచేస్తుంది" అని ప్రతిపాదించాడు. 'పల్లెపదం హృదయ స్థాయికి, ప్రబంధం మెదడు స్థాయికి' చెందినవని పేర్కొన్నాడు.

"అందరికీ ఉంటాయి మెదళ్ళూ గుండెలూ
అయితే మానవుడంతా ఒకే ఒక ఒళ్ళు
హృదయ స్థాయి ఒకలాంటిదైతే
మెదడు స్థాయి ఇంకొకలాంటిది
పల్లెపదాన్ని ఈసడించే సంగీత విద్వాంసులున్నారు
ప్రబంధాల్ని చదవలేని పామరజనం ఉంది
కాని, ఎక్కడో స్పందిస్తారిద్దరూ
సూటిగా గుండెల్ని తాకే పల్లెపదం
గాయకుడి మెదణ్ణి కదిలిస్తుంది
ఘాటుగా మెదణ్ణి సోకే ప్రబంధం
పామరుడి గుండెల్ని కరిగిస్తుంది"

అని తన అభిప్రాయాన్ని వివరించాడు. ఆరుద్ర ప్రశ్నలో పల్లెపదం శ్రోతలు ఒక వర్గం; ప్రబంధ పఠితలు మరొక వర్గం. శ్రీశ్రీ అభిప్రాయం ప్రకారం ఆ రెండు వర్గాలూ కలిసి ఒకే వ్యక్తిత్వంలో నివసిస్తాయి. హృదయం,

మెదడూ-రెండింటినీ కదిలించగలిగేది కవిత్వం. ఆ రెండు స్థాయిలలో స్పందించగలిగే వ్యక్తిత్వం ఉన్నవాడు సహృదయుడు. అలా మెదడునూ, హృదయాన్నీ ఏక కాలంలో కదలించగలిగే కవిత్వం గలది మహాకావ్యం అని శ్రీశ్రీ నిష్కర్ష.

పల్లెపదానికుండే సంప్రదాయ మేమిటి? మౌఖికంగా ఒక జాతి పాడుకొనే పాటల బాణీకి సంబంధించిన పరంపరా పరిజ్ఞానం. ఆ పరంపరలో పాట బాణీ కెంత స్థానముంటుందో ఆ పాట పాడే జాతియొక్క సంస్కృతి విశేషాలకు కూడా అంతటి స్థానం ఉంటుంది. అవన్నీ తెలిసిన శ్రోతకాని పల్లెపదాన్ని హృదయం స్పందివచేటట్లు విని అనుభవించలేడన్నమాట!

మరి, ప్రబంధానికి లిఖితసంప్రదాయం లేదా? సాహిత్యసంప్రదాయం లేదా? లేదని చెప్పటం సాహసం అయితే, అవన్నీ పాండిత్యప్రకర్షతో కూడుకొని ఉంటాయనే భావం ఆరుద్ర ప్రశ్నలో అంతర్గర్భితంగా ఉంది. దాన్ని గ్రహించిన శ్రీశ్రీ ప్రబంధానుభవం మెదడుకు ఎక్కువగా సంబంధించి ఉంటుందన్నారు. అయినా, గాయకుణ్ణి, పామరుణ్ణి పేర్కొన్న శ్రీశ్రీ వారు భిన్న సంప్రదాయాలకి సంబంధించినవారైనా కవిత్వానుభవంలో స్పందించటం సంభవమనీ, సహజమనీ, సాధారణమనీ చెప్పక చెప్పారు. ఆరుద్రకంటె శ్రీశ్రీ సమన్వయదృష్టి కలవాడుగా ఈ మాటలవలన స్పష్టమౌతున్నది. అలా కనపడటానికి కారణం వారిరువురూ 'మహాకావ్య' శబ్దం వాడటంలో ప్రకటించిన అర్థవైవిధ్యమే.

పల్లెపదం, ప్రబంధం అనే రెండు ప్రక్రియలలో ఏది మహాకావ్యం? ఏది పూజనీయం? అని ఆరుద్ర ప్రశ్న. ప్రశ్నలు రెండుగా కనపడ్డా తాత్పర్యం ఒకటే: ఏది పూజనీయమైన మహాకావ్యం? అని. అంటే ఏది ఉత్తమమైన కవితా ప్రక్రియ? లేదా - గౌరవనీయమైన కావ్య ప్రక్రియ? అని భావం. రెండు ప్రక్రియలలో తారతమ్యదృష్టితో వివేచిస్తే ఏది ఉత్తమం? అనే అభిప్రాయం ప్రశ్నలో సందర్భవశంగా గోచరిస్తుంది. అయితే, 'మహాకావ్యం' అంటే మరొక అర్థం కూడా స్ఫురిస్తుంది. అది ఇంగ్లీషులో 'Classic' అంటే ఎటువంటి అర్థం

మనకు స్ఫురిస్తుందో అటువంటిది. విశేషమేమంటే ఆరుద్ర మొదటి అర్థంలో అడుగుతుంటే - శ్రీశ్రీ రెండవ అర్థంలో గ్రహించి సమాధానంలో సమన్వయించాడు.

శ్రీశ్రీ సమాధానంలో పల్లెపదం, ప్రబంధం, మహాకావ్యం అనేవి మూడూ మూడు విభిన్న పారిభాషిక పదాలు. అయినా, పల్లెపదాల్లో మహాకావ్యం ఉండవచ్చుననీ, ప్రబంధాలలో కూడా మహాకావ్యం ఉండవచ్చుననీ, ఆ రెండు ప్రక్రియల స్వభావాలు సమన్వయించుకొన్న కళాఖండంగా మహాకావ్యం ఉండవచ్చుననీ శ్రీశ్రీ ఆ పదాలు వాడిన పద్ధతి మనకు వ్యక్తం చేస్తున్నది. సంప్రదాయం, సంస్కారం - రెండూ కలిసిన ప్రమాణ గుణం మహాకావ్య పఠితకు అనుభవ స్థాయిగా ఉంటుంది. మహాకావ్యానికి మారుపేరు క్లాసిక్ రూపం.

"నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వా"లని అంటున్నప్పుడు శ్రీశ్రీ హృదయంలో ఆంధ్ర మహాభారతం ఉన్నదని స్పష్టం. "నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే' - అన్నప్పుడు ప్రక్రియా పరిమాణ తారతమ్యార్థమే గ్రహింపతగింది. ఆ పోలికతో పూర్వం ఆదర్శప్రాయమైన ఒక క్లాసిక్‌గా రూపొందే గౌరవం పెద్దవైన ప్రక్రియలకే ఉండేదనీ, ఇప్పుడు చిన్నవైన ప్రక్రియలలో కూడా క్లాసిక్ రూపాన్ని దర్శించవచ్చుననీ శ్రీశ్రీ అభిప్రాయపడుతున్నట్లు అవగత మౌతున్నది. ఆ గౌరవం ఆ ప్రక్రియ యొక్క గుణాన్ని పట్టి వస్తుంది కాని సైజునుబట్టి, బరువునుబట్టి కాదని కూడా శ్రీశ్రీ నొక్కి చెప్పాడు.

ఈ యిరువురి పదప్రయోగాలనుబట్టి సాహిత్యంలో సంప్రదాయమంటే పరంపరానుగతంగా ఒక ప్రక్రియను గురించి వస్తున్న పరిజ్ఞానధారను, అస్వాదిస్తున్న అప్పటి రచనను అనుభవించటానికి అనువుగా అనుసంధించుకోవటం అనీ, ఏ ప్రక్రియలోనైనా ఒక ఆదర్శప్రాయమైన క్లాసిక్ రూపం ఇచ్చే సమగ్ర కళానుభవాన్ని సాధించే లక్ష్యంతో కళారూపాన్ని రూపొందించే ప్రయత్నం చేయటమనీ గ్రహించటానికి వీలౌతున్నది.

ఆరుద్ర ప్రశ్నలో 'మహాకావ్యం' అంటే ఉత్తమ ప్రక్రియ. శ్రీశ్రీ ప్రవచనంలో 'మహాకావ్యం' అంటే ఒక ప్రక్రియయొక్క ఆదర్శరూపం. దీనినే 'క్లాసిక్ ప్రమాణాలుగల ప్రక్రియ' అని కూడా అనవచ్చు. కాగా, మహాకావ్య

సంప్రదాయం అన్నప్పుడు ఒక ఉత్తమ ప్రక్రియకు సంబంధించి పరంపరాను గతంగా వస్తున్న పరిజ్ఞానానికి సంబంధించిన సంస్కారం అని ఒకరకమైన అర్థం చెప్పవచ్చు. ఒక ప్రక్రియయొక్క ఆదర్శరూప నిర్మాణానికి సంబంధించిన పరిజ్ఞానమనీ చెప్పవచ్చు. 'సాహిత్యోపనిషత్తు' లో అడిగిం దొకటి, చెప్పిం దొకటిగా కనవడ్డా, మనకు 'మహాకావ్య'మంటే రెండర్థాలున్నాయని ప్రశ్నోత్త రాలు ప్రకటిస్తున్నాయి దానివలన మనం తెలుసుకోవలసింది కూడా మరొకటి ఉన్నది.

సంప్రదాయానికి మూడు అవస్థలుంటాయి ఒకటి-పరంపరాగత ప్రవాహ రూపం; రెండు-నవ్యప్రయోగంలో అవిచ్ఛిన్నంగా భాసించే ప్రాచీనాంశం లేదా వర్తమానంలో ప్రస్తుతంగా ప్రకాశించే ప్రాచీనాంశం. మూడు-ఆదర్శరూపంగా ఆవిర్భవించే ప్రక్రియావికాస చైతన్యం. మూడవ అవస్థ మరలా ఒక సంప్రదా యాన్ని, ప్రమాణాన్ని సాహిత్య జగత్తులో నిలుపుతుంది. అది తరువాతికాలంలో పరంపరాగత ప్రవాహరూపమైన సంప్రదాయావస్థగా ముందుకు సాగుతుంది. సంస్కారం, ప్రయోగం, ప్రమాణం అనే మూడవస్థలు సంప్రదాయానికి మూడడు గులు. సాహిత్యంలో సంప్రదాయం అనే పదాన్ని ఈ మూడర్థాలలోనూ ప్రయో గిస్తూ ఉంటారు. వామపక్షీయులు సంప్రదాయాన్ని మొదటి అర్థంలో విశేషంగా వాడతారు. గతంలో రూఢికెక్కిన అర్థాన్నే వర్తమానంలో గ్రహించటం వీరి పద్ధతి. అందువలన ప్రాచీనార్థాలు వర్తమానంలో కాలం చెల్లినవిగా, పాతపడి నవిగా, పనికిరానివిగా వీరికి గోచరిస్తాయి. సంప్రదాయజ్ఞులు సంప్రదాయాన్ని సమకాలీన ప్రయోగాల్లో వర్తమాన వికాసానికి తోడుపడే నవీన చైతన్యంగా, నవ్యాలోకంగా సంభావిస్తారు. మారినకాలానికీ, భావానికీ, సిద్ధాంతానికీ, దర్శనానికీ అనువైన చైతన్యంలా అభినవంగా ప్రయోగంలో ప్రతిఫలించే పరంపరాధార సంప్రదాయం వీరి దృష్టిలో. వీరిద్దరూ సంప్రదాయాన్ని Tradition అనే అర్థంలోనే వాడతారు. అయితే మొదటివారు Pastness of the past లేదా old అనే అర్థంలోనూ, రెండవవారు Presentness of the past అనే అర్థం లోనూ వాడతారు. ఒక అర్థంలో గతించినగతం సంప్రదాయం; మరొక అర్థం వర్తమానంలో జీవిస్తున్న గతం సంప్రదాయం.

మూడవ అవస్థలో సంప్రదాయ గతిని, ప్రగతిని చెప్పే అర్థం కాకుండా సంప్రదాయ ధ్యేయాన్ని, గమ్యాన్ని తెలిపే అర్థం ప్రధానం. అంటే - సంప్రదాయం ఒక క్రొత్త సంప్రదాయాన్ని సృష్టించి తన అస్తిత్వాన్ని సార్థకం చేసుకొంటుంది క్రొత్త సంప్రదాయం పరంపరాగత ప్రవాహరూపమైన ప్రాచీన పద్ధతులను మూల ధాతువులుగా గ్రహించినా, దేశకాల పాత్రోచితంగా తాను సమాజంలో నిర్వహింపవలసిన క్రొత్త బాధ్యతలకు అనుగుణంగా అభినవ ప్రమాణాలను సాధించుకొంటుంది. గతాన్ని స్వీయయుగదృష్టితో పునఃపరిశీలిస్తుంది; ఆధునిక జాతీయ జీవన ప్రవృత్తితో గతాన్ని అభినవంగా వ్యాఖ్యానిస్తుంది; తననాటి ప్రపంచానికి తనదైన ఒక సందేశాన్ని, సాహిత్య ప్రక్రియా తేజాన్ని సమున్నతంగా, ఆదర్శప్రాయంగా అందిస్తుంది. దీనికొక దృష్టాంతం చెప్పుకోవచ్చు.

ఒక వంశం ఉంది. ఆ వంశానికి ఒక జీవన విధానం ఉంది; ఒక ఆదర్శ సూత్రం ఉంది. దానిని అనుసరించి ఆ వంశజులు జీవితం సాగిస్తూ ఉంటారు. దానికి వంశ మూలపురుషు డున్నాడు. అతని జీవనపద్ధతియే ఆ వంశజులకు మార్గదర్శకంగా ఉంటుంది. తాత తండ్రులవలె కొడుకులు ధార్మిక జీవితాన్ని పరంపరగా సాగిస్తూ ఉంటారు ఇది సంప్రదాయధార. ఆ వంశంలో కొందరు సంప్రదాయధారను మన్నిస్తూనే జీవన ప్రవృత్తులలో మరికొన్ని ప్రయోగాలు చేసి తమదైన ఒక ప్రత్యేకతను సాధించుకొంటారు. వారి జీవితాలు ప్రయోగాల వంటివి. ప్రయోగాలు ప్రత్యేక ప్రయోజనాలను సాధించవచ్చునే కాని అన్ని వేళలా ఆదర్శప్రాయాలుగా ఉంటాయని చెప్పలేము, అలాగే అటువంటి ప్రయోక్తలు కొంత ప్రఖ్యాతి పొందుతారేమో కాని, ఆదర్శపురుషు లనిపించుకోలేరు. ఆ వంశంలోనే అప్పుడప్పుడు వంశకర్త లనబడే మహాత్ములు జన్మించి తమ జీవితాలను మూలపురుషునిలాగా నవీన పంథాలను దర్శింపచేసే పద్ధతులలో గడిపి నవ్యసంప్రదాయాలను స్థాపించవచ్చు. ఇవి మహారాజుల వంశాలలోనే జరుగవలసిన అవసరం లేదు; మధ్యతరగతి కుటుంబాల్లోనూ, సామాన్య జనుల వంశాల్లోనూ తరచు ఏర్పడుతుంటాయి ఈ సూత్రం దేశ ప్రభుత్వాధినేతలపట్ల కూడా వర్తిస్తుంది. ప్రసిద్ధ ప్రపంచ దేశాల చరిత్రలు చూస్తే తమ విధానాలతో ఆ దేశ భవిష్యత్తుపై వినూత్న ప్రభావాలను వేసిన మహాత్ములెందరో కనపడతారు. అయితే, ఆ క్రొత్తదనం దేశీయమైన మూలాలపైె, మూల్యాలపై నిలిచి

ఉంటుంది. అంటే, వారు క్రొత్త సంప్రదాయాలు సృష్టించారన్నమాట! సంప్రదాయం అంటే కొంగ్రొత్తదైన ఆశయం అన్నమాట! లక్ష్యం అన్నమాట! ఆదర్శం అన్నమాట!

సాహిత్యంలో ఆదర్శప్రక్రియా సాధన దృక్పథాన్ని కూడా సంప్రదాయమంటారు. ఇదీ ఈ శతాబ్దంలో ప్రాచుర్యం చెందిన శబ్దమే. ఇంగ్లీషులో Classicism అనే పదానికి సమాంతరం; ఇది ప్రాచీన సాహిత్యంలో కూడా ఉంది. ప్రాచీనాంధ్ర మహాకవులు సృజించిన కావ్యేతిహాస, పురాణ, మార్గరస కావ్య, కథాకావ్య, ప్రబంధాది ప్రయోగాలలో ఆదర్శరూపాలు సాధించిన ప్రక్రియలెన్నో ఉన్నాయి. విశ్వనాథ సత్యనారాయణగారు రామాయణ కల్పవృక్షంలో పూర్వకవి స్తుతిరూపంగా నిర్మించిన ఈ పద్యంలో ప్రాచీన సాహిత్యంలో క్లాసిక్ రూపాలను నిర్మించి తమవైన విశిష్ట సంప్రదాయాలను సృష్టించుకొన్న మహాకవులను పేర్కొన్నారు.

"ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోఁట
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు
పోతన్న తెలుఁగుల పుణ్యపేటి
శ్రీనాథుఁడు రసప్రసిద్ధ ధారాధుని
కృష్ణరాయఁ డనన్యకృతి ప్రబంధ
పెద్దన్న వడపోత పెట్టి నిఘురసంబు
రామకృష్ణుడు సురారామ గజము
ఒకఁడు నాచనసోమన్న యుక్కివుండు
చెఱిపి పదిసార్లు తిరుగవ్రాసినను మొక్క
వోని యీ యాంధ్ర కవిలోకమూర్ధమణుల
మద్గురుస్థానములుగ నమస్కరించి." (అవతారిక పు. 8, 9.)

వీరు పెట్టిన సంప్రదాయ మేమిటంటే - ఒకరికంటె ఒకరు ప్రతిభామయంగా ప్రయోగాలు చేస్తూ గతంలోకంటె విశిష్టమైన కావ్య సంప్రదాయాలను స్థాపించటం. ఇది ప్రాచీన సాహిత్యంలో క్లాసిసిజం.

20 వ శతాబ్దంలో, అందులోనూ 1934 ప్రాంతంలో, తెనాలి రామకృష్ణుని కాలంలోలాగా క్రొత్త సంప్రదాయం ప్రవర్తిల్లచేసిన మహాకావ్య ప్రక్రియను మరలా ఆధునిక ప్రవృత్తితో నిర్మించే విశిష్టయత్నాన్ని ఆంధ్రకవులు ఆరంభించారు. రాణా ప్రతాపసింహ చరిత్రం, శివభారతం, రామాయణ కల్పవృక్షం లాంటి మహాకావ్యాలు వెలువడ్డాయి ఇవి గతానుగతికంగా రచించిన కావ్యాలు కావు. వావిలకొలను సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, జనమంచి శేషాద్రిశర్మ, వడ్డాది సుబ్బారాయకవి ప్రభృతులు గతానుగతికమైన సంప్రదాయాన్ని కొన సాగించారు. కాని, విశ్వనాథాదులు క్లాసిక్స్‌ను ఆధునికయుగంలో నిర్మించే స్పృహతో ఉద్యమించారు. కాల్పనిక కవితోద్యమ ప్రయోగాలనుండి విడివడి, క్రమంగా క్లాసిక్ కావ్య ప్రయోగాలవైపు సాగిన చైతన్యమూర్తులైన మహాకవులు సాగించిన సాహిత్య ఉద్యమం నవ్య సంప్రదాయోద్యమం.

'నవ్య సంప్రదాయం' అనే పదం మన సాహిత్య చరిత్రలో ప్రవర్తిల్లిన సాహిత్యోద్యమానికి ఆధునికులు పెట్టుకొన్న పేరు. ఇది Neo-classicism అనే పదానికి అనువాదంగా కనపడుతున్నా నిజానికికాదు. మన అనుభవాన్ని వ్యక్తీక రించేదిగా పెట్టిన పేరు. ఇంగ్లీషులో దాని చరిత్ర వేరు; తెలుగులో దీని చరిత్ర వేరు. దాని లక్షణం వేరు; దీని లక్షణం వేరు. ఇది దానికి అనువాదం కాదు. అనువుగా కుదిరిన ఆధునిక పారిభాషిక పదం. పేరుతో పోలికలున్నా తీరులో సొరులు మనవే! *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు:
ఆదివారం ఆంధ్రప్రభ : 24-12-1989)

# నవ్యసంప్రదాయం మరొక సాహిత్యాదర్శనం

'నవ్యసంప్రదాయ కావ్యయుగం' - అనగానే నాలుగురకాల ప్రశ్నలు తలయెత్తే అవకాశం ఉంది. 1. నవ్యసంప్రదాయయుగం అని సాహిత్య చరిత్ర కర్తలు వ్యవహరించిన పరిపాటి ఉందా? 2. సంప్రదాయం అని అంటే సరిపోదా? నవ్యసంప్రదాయం అని ఎందుకు పిలవాలి? 3. అభ్యుదయ కవిత్వం కంటె నవ్య సంప్రదాయ కవిత్వం ప్రత్యేకత ఏమిటి? 4. నవ్యసంప్రదాయాన్ని ఉద్యమంగా నిరూపించవచ్చునా? ఈ నాలుగు ప్రశ్నలకూ లభించే సమాధానాలను బట్టి ఈ యుగవిభాగం చేయటంలో ఉండే అవసరాన్ని, ఔచిత్యాన్ని నిర్ణయించ టానికి వీలౌతుంది.

ఇంతవరకూ తెలుగులో వెలువడిన ప్రామాణిక సాహిత్య చరిత్రలలో గానీ, కవితావికాస / విప్లవ చరిత్రలలోగానీ 'నవ్యసంప్రదాయ యుగం' అనే పేరు మీద ఏ అధ్యాయమూ, ఏ విభాగమూ కనపడదు. కాగా, దాదాపు 1934 నుండి అభ్యుదయ కవిత్వయుగమనీ, ఆ తరువాత విప్లవ కవిత్వయుగమనీ పిలిచే పరిపాటి ఉంది. అందువలన స్థూలదృష్టికి 'నవ్యసంప్రదాయ కావ్యయుగం' అనే విభాగం అవసరమని అనిపించవచ్చు.

అయితే, విశ్వవిద్యాలయాలలో దాదాపు 1970 ప్రాంతం నుండీ ఆధునిక సాహిత్య యుగంలో వెలువడిన ప్రయోగాలను పరిశీలించేటప్పుడు నవ్యసంప్ర దాయ మార్గాన్ని వివేచించి, విశ్వనాథ, రాళ్ళపల్లి మొదలైనవారు ఆ ఆలోచన ధారను పోషించారనీ, దానికనుగుణమైన కావ్యప్రయోగాలూ, విమర్శనవిధానాలూ ప్రాచుర్యం పొందాయనీ విద్యార్థులకు బోధించటం ప్రసిద్ధంగా ఉంది. పఠన పాఠనాల్లో ఈ పద్ధతి చోటు చేసుకొనడానికి కారణం ముఖ్యంగా తెలుగు సాహిత్యం మీద పాశ్చాత్య ప్రభావాన్ని పరిశీలించే ప్రయత్నంలో వివిధ వాదాల, ధోరణుల, సిద్ధాంతాల, ఉద్యమాల ప్రభావాన్ని వివేచించబూనటం, పాశ్చాత్య

సాహిత్యాల్లో కూడా తెలుగు కవులపై ప్రభావం వేయటంలో ఇంగ్లీషు భాషా సాహిత్యాలే ప్రధాన పాత్ర నిర్వహించటం చేత ఆ సాహిత్య పరిణామంలో వచ్చిన దశలన్నీ ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలోకూడా ఎలా ప్రతిఫలించాయో అనుశీలించటం సాహిత్య విమర్శకులకు, చరిత్రకారులకు ఒక పరిపాటి అయింది. దీనివలన కొంత మంచి జరిగింది. అంతకుమించి నష్టం కూడా జరిగింది.

జరిగిన మంచిని ముందు చెప్పుకొందాం. తెలుగులో ఈ శతాబ్దంలో వెలువడిన సాహిత్య పరిణామాలకూ, ప్రయోగాలకూ ప్రేరణలను ఇంగ్లీషు ద్వారా పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలూ, ప్రయోగాలూ అందించటం చేత ఆధునిక ప్రయోగాలను అన్వయించుకోటానికి ఆంగ్ల సాహిత్య ప్రమాణాలూ, పారిభాషిక పదాలూ, విమర్శ సూత్రాలూ మనవారికి వెలుగుబాటలుగా ఉపకరించాయి. అయితే, మొదట్లో మన విమర్శకులు తెలుగులో వెలసినవన్నీ ఇంగ్లీషులో ఉన్నట్లుగానే ఉంటాయనే ధోరణిని ప్రదర్శించారు. ఇది పెద్ద పొరపాటు. ఈ పొరపాటు ప్రభావ పరిశీలనం ప్రారంభమైన ప్రాథమిక దశలో కలగటం సహజంకూడా. ఎలాగంటే- మన విమర్శకులు ఆంధ్ర మహాభారతం అనువాద గ్రంథంగా భావించి కవిత్రయ అనువాద విధానాన్ని అడుగడుగున నిరూపించే యత్నం కొన్ని దశాబ్దాలు సాగించారు. కాని, ఒక ఇరవై యేళ్ళ నుంచి - కవిత్రయం చేసింది అనువాదం కాదనీ, వారు తెలుగులో భారతాన్ని వినిర్మించారనీ, అది అనుసృజన మౌతుందనీ వివేచించటం మొదలుపెట్టారు దీనిని స్థాపించటంలో మరికొంత పరిశోధనం సాగి, క్రమంగా ప్రక్రియాపరమైన నిరూపణం రూపు తాల్చింది. వ్యాసభారత ప్రక్రియా స్వభావం వేరు; కవిత్రయ భారత ప్రక్రియా స్వభావం వేరని తెలుగువారు నిశ్చయించుకొన్నారు. నేడు ఆంధ్ర మహాభారతం అనువాదమన్నా, కవిత్రయకాలం అనువాదకవితా యుగమన్నా, లేదా - పురాణ కవితాయుగమన్నా కాలం చెల్లిన, పాతబడ్డ పద్ధతిగా మనం పరిగణిస్తున్నాం. ఇటువంటి పొరపాట్లు, గ్రహపాట్లు ప్రబంధ ప్రయోగాల పరిశీలనంలో కూడా మొదట్లో చోటు చేసుకోవటం, తరువాత క్రమంగా అవి సవరింపబడుతూ రావటం విమర్శకులకు విదితమైన విషయమే.

ఇటువంటిదే నవ్య సంప్రదాయం పట్లకూడా జరిగింది. ఆధునిక సాహిత్యాన్ని అనుశీలించాలంటే ఆంగ్ల సాహిత్య సంప్రదాయాలనూ, పరిణామాలనూ

దశలనూ, ఉద్యమాలనూ అవగాహనం చేసుకొని ఉండటం అత్యవసరం కాబట్టి విమర్శకులు, విశ్వవిద్యాలయాచార్యులు ఇంగ్లీషు సాహిత్య చరిత్రను అధ్యయనం చేయనారంభించారు అందులో కాల్పనిక కవితాయుగం, నవ్య సంప్రదాయయుగం అనేవి ప్రసిద్ధంగా ఉన్నాయి. తెలుగులో కాల్పనిక కవితా ప్రభావంతో భావకవిత్వం వస్తే, విశ్వనాథాదులు సాగించిన ఉద్యమాన్ని నవ్య సంప్రదాయ కవితా చైతన్యంతో కూడి ఉన్నదని వివేచించారు. ఇంగ్లీషులో నియో క్లాసిసిజం అనే మాటకు తెలుగులో నవ్య సంప్రదాయం అనే పేరును కల్పించుకొని పఠన పాఠనాదులు విశ్వవిద్యాలయాల్లో సాగించారు.

ఇందులో కొన్ని చిక్కులు వచ్చాయి. వాటిల్లో మొదటిది సాహిత్య చరిత్ర గతికి సంబంధించింది. ఇంగ్లీషులో నవ్య సంప్రదాయయుగం, రెస్టోరేషన్ యుగం తరువాత 17 వ శతాబ్ది చివరినుండి 18 వ శతాబ్ది చివరిదాకా ప్రవర్తిల్లింది. దాని తరువాత కాల్పనికోద్యమం వచ్చి, 19 వ శతాబ్ది పూర్వపాదంలో తన ప్రత్యేకతను ప్రదర్శించింది. కాల్పనికోద్యమానికి ప్రతిగా విక్టోరియన్ సాహిత్యయుగ చైతన్యం 19 వ శతాబ్ది పూర్వార్ధంలోనే మొదలై, ఆ శతాబ్ది చివరిపాదందాకా సాగింది. కాగా, తెలుగులో నవ్యసంప్రదాయోద్యమం భావకవిత్వయుగం తరువాత వచ్చిందని చెప్పవలసివచ్చింది. విశ్వనాథాదుల కవితా చైతన్యం ఇంగ్లీషు నియో క్లాసికల్ ప్రభావంతో వచ్చింది కాదు. కొందరు పోప్ మొదలైన కవులతో విశ్వనాథాదులనుపోల్చిచెప్పి అన్వయించలేని అవస్థలకు గురి అయ్యారు. కొందరు అభ్యుదయవాదులు - 'విశ్వనాథ సాహిత్యాన్ని వెయ్యేళ్ళ వెనక్కు తీసుకొనిపోయా'దని వ్యాఖ్యానించారు. నిజానికి గమనింపదగిందేమిటంటే- విశ్వనాథాదులు కాల్పనికయుగంలో ప్రయోగాలు చేశారు అప్పటికే ఇంగ్లీషు సాహిత్యంలో కాల్పనిక కవితాయుగం అంతరించి ఒక శతాబ్దం అయింది. ఆ తరువాత మాథ్యూ ఆర్నాల్డ్, టి.ఎస్. ఎలియట్, ఐ.ఏ. రిచర్డ్స్, లీవీస్ మొదలైన ప్రయోక్తలు ఆధునిక యుగ చైతన్యాన్ని కల్పించారు. విశ్వనాథాదులు క్రమంగా ఈ నూరు, నూటయేభైయేళ్ళ సాహిత్యపరిణామ దశలనన్నింటినీ వడపోతపోసి ఆధునికయుగ చైతన్యాన్ని భారతీయసాహిత్య దర్శనానుగుణంగా ఉద్దీపింపచేశారు. దీన్ని మనం గమనిస్తే విశ్వనాథ ఆధునిక సాహిత్యాన్ని వెయ్యేళ్ళ వెనక్కుకాకుండా, నూరేళ్ళ ముందుకు నడిపినట్లు స్పష్టమౌతుంది. ఈ అవగాహన నేడు బలంగా యువతరంలో ఏర్పడింది. దానితో

వారి ఆలోచనలలో, సాహిత్య చరిత్రను అన్వయించుకొనే పద్ధతులలో మార్పులు వచ్చాయి.

విశ్వవిద్యాలయాలలో ఆంగ్ల సాహిత్యచరిత్ర ననుసరించి చెప్పే నియో క్లాసిసిజం అనే పారిభాషిక పదానికీ, ఆయుగ సాహిత్య చైతన్యానికీ తెలుగులో సమాంతరంగా గోచరించే కవితోద్యమం కానరాదు. కాని, విశ్వనాథాదులది నవ్య సంప్రదాయోద్యమం అని చెప్పే పరిపాటి ప్రారంభమైంది. అది అన్వయంకాని పద్ధతి అని రుజువుకూడా అయింది. దీనితోపాటు విశ్వనాథాదులది సంప్రదాయ వాదమని అభ్యుదయ కవితోద్యమ విమర్శకులు వ్యాఖ్యానించటం ముమ్మర మైంది. దీనితో సాహిత్యవిమర్శలో చిక్కు వచ్చిపడింది. ఒక వర్గంవారు క్లాసిసిజం అనే ఆంగ్లపదానికి ఛాయగా తెలుగులో 'సంప్రదాయ' మనీ, 'నియో క్లాసిసిజంను' 'నవ్యసంప్రదాయవాద'మనీ ప్రాచుర్యంలోనికి తెస్తే, మరొక వర్గం - అంటే అభ్యుదయవాదులు - సంప్రదాయ శబ్దాన్ని అనుకరణ ప్రధానమైన 'Tradition' అనే అర్థంలో వాడి రూఢి కెక్కించారు. పైపెచ్చు వామపక్షీయులైన అభ్యుదయవాదులు సంప్రదాయ శబ్దాన్ని నెగటివ్ అర్థంలో వాడటంతో సంప్రదాయపు విలువలు తెలిసిన సాహితీపరులు ఆ ప్రయోగ పద్ధతి పట్ల విముఖతను ప్రదర్శించారు. వామపక్షీయుల వక్రీకరణకు తగిన సమాధానం చెప్పటానికీ, సంప్రదాయ లక్ష్యం క్లాసిసిజమనే సత్యాన్ని నవ్యంగా వ్యాఖ్యానించటానికీ అనువుగా ఉండేటట్లు నవ్యసంప్రదాయవాదాన్ని విశ్వనాథాదులపట్ల నవ్యార్థంలో, నవ్యసందర్భంలో ఈ తరం వాడుతున్నది.

ఇందులో స్పష్టం చేసుకోవలసిన అంశాలేమంటే - నవ్యసంప్రదాయమంటే నియో ట్రాడిషనలిజం కాదనీ, ఇంగ్లీషు సాహిత్యంలో వచ్చిన నియో క్లాసికల్ యుగానికీ, తెలుగులో వచ్చిన నవ్యసంప్రదాయయుగానికీ పేరులో సామ్యం ఉన్నా తీరులో భేదం చాలా ఉన్నదనీ, అది ఏ కాలంలో, ఏ ప్రయోజనంకోసం, ఎలా పుట్టి, ఏ విధంగా ప్రవర్తిల్లిందో, దాని లక్షణాలేవో- అవన్నీ తెలుగులో వర్తించేటట్లు ఏర్పరచుకొన్న పారిభాషికపదం కాదనీ, దాని చరిత్ర దీని చరిత్ర వేరనీ, దాని అర్థం దీని అర్థం వేరనీ, ఈ రెండు పారిభాషికపదాలు పుట్టిన చారిత్రక వాతావరణం వేరనీ గమనించాలి. వామపక్షీయుల వక్రార్థకల్పనకు విరుగుడుగానూ, విశ్వనాథాదుల విశిష్ట కవితోద్యమానికి విలువలు కలిగించే

నవ్యపారిభాషిక పదంగానూ, విశ్వవిద్యాలయాచార్యుల ప్రథమయత్నంలోని వైరుధ్యాన్ని తొలగించేదిగానూ ఈ తరంవారు 1935 నుండి 1975 దాకా ఉన్న ఉద్యమానికి నవ్యసంప్రదాయోద్యమం అని వ్యవహరిస్తున్నారు. విశేషమేమంటే- ఇలా వ్యవహరించటం కూడా కొందరు విశ్వవిద్యాలయాచార్యులే ఆరంభించారు. ఇప్పుడిది బాగా రూఢికెక్కింది కూడా. విమర్శలో వాడబడుతున్నది కూడా. ఇప్పుడెవరైనా సాహిత్య చరిత్ర వ్రాస్తే ఈ ఆలోచనను, ఈ విభాగాన్ని గ్రహించకపోతే ఆ రచన సమగ్రమూ కాదు; ఆధునికమూ కాదు.

ఒక ఉద్యమంలో ఒక పారిభాషిక పదం ఒక అర్థంలో ఒక్కసారిగా రూఢికెక్కటం సామాన్యంగా జరగదు. ఇంగ్లీషులో **Progressive Movement** కు అభ్యుదయ కవిత్వోద్యమమని వ్యవహారం కుదిరి కుదుటపడటానికి దాదాపు రెండు దశాబ్దాలు పట్టింది. అలాగే నవ్యసంప్రదాయం అనే పారిభాషిక పదం చారిత్రకమైన అవసరంతో పుట్టింది. ఇప్పుడొక అర్థంలో స్థిరపడింది.

'నవ్యసంప్రదాయవాదం' అనే పారిభాషికపదంలో 'నవ్య' ఎందుకని కొందరు ప్రశ్నిస్తారు. సంప్రదాయవాదం అంటే సరిపోదా అని వాదిస్తారుకూడా. అలా వాదించేవారిలో సంప్రదాయాన్ని నెగటివ్ అర్థంలో వాడేవారు కూడా ఉన్నారు. నవ్య అనే విశేషణంవలన ఆ 'నెగటివ్ సెన్స్' పోతుందేమోనని వారి భయం కూడా. అది వారి ప్రయోజనానికీ, వ్యూహానికీ విరుద్ధం. అందువలననే వారికి తీవ్రమైన అభ్యంతరం.

'నవ్య' విశేషణం తప్పకుండా ఉండదగింది. ఎందుకంటే, నవ్యసంప్రదాయం ఒక ఉద్యమస్ఫూర్తిని పొంది ఒక నిర్దిష్టమార్గంలో ఒక నిశ్చితమైన లక్ష్యాన్ని సాధించిందనే భావాన్ని అది పరోక్షంగా ప్రతిపాదిస్తుంది. దీన్ని గురించి కొంత వివరించాలి. ప్రాచీన సాహిత్య పరిణామాన్ని తెలిపే వివిధ సాహిత్య యుగాల్లో ఎక్కడా కూడా క్లాసిక్ రూపాన్నీ, దాని తత్త్వాన్నీ కాదనే ఉద్యమంగానీ, ద్వేషించే ధోరణికానీ రాలేదు. కానీ, ఆధునిక యుగంలో భావ కవితా యుగంలోని కాల్పనిక కవిత్వోద్యమం క్లాసిక్ రూపాన్నీ, తత్త్వాన్నీ కాదన్నది. ఆ తరువాతి అభ్యుదయ కవిత్వోద్యమం క్లాసిక్‌నూ, క్లాసిసిజంనూ ద్వేషించింది. ఈ రెండు ఉద్యమాలూ క్లాసిసిజంకు వ్యతిరేకోద్యమాలే. అయితే, ఒకటి సాహిత్య సిద్ధాంతం ప్రాతిపదికగా గలిగింది; మరొకటి సామాజిక సిద్ధాంత ప్రాతిపదిక కలిగింది. ఖండకావ్యం ఈ రెండు ఉద్యమాలనూ పాలించింది. అవసరం వస్తే

తానే 'క్లాసిక్' నని దబాయించింది. మహాకావ్య రచనం పాతబడ్డ పద్ధతిగా, గతించిన గతానికి చిహ్నంగా, ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించిన సాహిత్య ప్రక్రియగా, సమాజానికి దూరంగానూ పండితులకు దగ్గరగానూ ఉండే శైలి గలదిగా, దానికి ప్రాణమైన రసం అనుభవ సత్యంగానిదిగానూ ప్రత్యేకించి అభ్యుదయవాదుల్లో వామపక్షీయులు వ్యాఖ్యానించారు. నవ్య సంప్రదాయవాదం ఇటువంటి ధోరణులకు వ్యతిరేకంగా ప్రభవించింది. ఆధునిక సాహిత్యంలో క్లాసిక్ భావం అంతరించిపోయే ప్రమాదంనుండి సాహిత్యాన్ని రక్షించాలనీ, అనువాదాలూ, అనుకరణలూ మాత్రమే సంప్రదాయమని భావించే ఛాందసుల ప్రయోగాల్లో బలవన్మరణం పొందుతున్న క్లాసిసిజంను నిజమైన రీతిలో పునరుజ్జీవింప జేయాలనీ, యుగోచితమైన ఒక క్రొత్త శైలిని క్లాసిక్‌కు కల్పించాలనీ. అది జాతీయభావానికీ, దేశీయతకూ, భారతీయ సాహిత్య దృక్పథానికి పోషకంగా ఉండాలనీ, పాశ్చాత్య సాహిత్యంలోని మేలిమిని గ్రహించినా దానికి దాసోహం అనకుండా ప్రాచ్యసాహిత్య వ్యక్తిత్వాన్ని ఆధునికంగా పునఃప్రతిష్ఠించాలనీ సాగించిన సప్రయత్న సాహిత్యోద్యమం నవ్యసంప్రదాయ మార్గం.

ప్రాచీనాంధ్ర సాహిత్య చరిత్రలో క్లాసిక్ భావం స్తబ్దతకు గురియైన సమయాలు, సందర్భాలు కొన్నియుగాల్లో కనపడవచ్చును గాని, క్లాసిక్ భావానికే గండం ఏర్పడిన విపరీతపరిస్థితులు మృగ్యం. ఆధునికయుగంలో క్లాసిసిజం మృత్యుగండాన్ని ఎదుర్కొన్నది కవితారంగంలో. కాని, నవ్య సంప్రదాయ వాదులు ఆ గండాన్ని తప్పించారు. వారి ప్రయోగాలద్వారా నవ్యమైన జాతీయ చైతన్యాన్ని ఊపిరిగా పోసుకొని క్లాసిసిజం నూతనోత్తేజాన్ని పొందింది. ఇది పునర్జన్మలాంటిది. సంప్రదాయానికి ఆధునిక జీవితం లాంటిది. అందుకనే నవ్యసంప్రదాయోద్యమమని పిలవటం సమంజసమని నేటి సాహితీ లోకం భావిస్తున్నది. ఈ అభిప్రాయం విశ్వవిద్యాలయాలకే పరిమితమైనదని కొందరు వామపక్షీయులు వక్రీకరించవచ్చు. అలాకాదని, సాహితీపరులందరిలో ఈ భావం బాగా వ్యాపించి ఉన్నదనటానికి రజతరంజని (రంజని రజతోత్సవ సంచిక 1987-88) సంపాదకీయం ఒక బలమైన సాక్ష్యం.

"సంప్రదాయోద్యమం అసలు ఉద్యమం కాదనేవారు లేకపోలేదు. ఎంచేతనంటే, యీ కోవకు చెందిన చిన్నయసూరి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, వావిలకొలను సుబ్బారావు, జనమంచి శేషాద్రిశర్మ, పిశుపాటి చిదంబరశాస్త్రి, ఖాక్కాండ వెంకటరత్నం, వేదం వేంకటరాయశాస్త్రి, గిడ్డాది సుబ్బారాయుడు,

మల్లాది సూర్యనారాయణశాస్త్రిలాంటివారు ప్రాచీన సంస్కృత సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించటమో, లేక భారత రామాయణాల్లాంటి పురాణేతిహాసాల్ని చర్విత చర్వణంగా తెనిగించటమో తప్ప స్వతంత్ర కావ్య సృష్టిచేసే ప్రయత్నం చేయలేదు అయితే, విశ్వనాథ సాహిత్యరంగ ప్రవేశం చేసింతర్వాత దీని రూపు కొంత మారింది. సమసిపోతోన్న ప్రాచీన భారత సంప్రదాయాన్ని పునరుద్ధరించటమే ఉద్యమంగా స్వీకరించి ఆయన రచనలు చేశాడు. కాని, దీన్ని సంప్రదాయోద్యమం అనేకంటె నవ్యసంప్రదాయం అనటం సముచితంగా వుంటుందేమో!" - శ్రీ కె కె. మీనన్ (ఇది ఉద్యమాల యుగం - సంపాదకీయం- రంజని రజతోత్సవ ప్రచురణ, ఎ జి. ఆఫీసు, హైదరాబాదు).

ఒక విశిష్ట అనుభవాన్ని కలిగిస్తున్న స్ఫూర్తిని ఒక పారిభాషిక పదాన్ని కల్పిస్తున్నప్పుడు సహృదయ లోకం వ్యక్తం చేస్తూ ఉంటుంది. తెలుగులో కావ్యం - ప్రబంధం అనే పారిభాషిక పదాలు రెండు ప్రక్రియలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. సంస్కృత లాక్షణిక సంప్రదాయం ప్రకారం గ్రహిస్తే ఆ రెండు వాదాలూ సమానార్థకాలే. కాని, తెలుగులో సాహితీవేత్త తనదైన అనుభవ దర్శనంనుండి ఆ రెండింటిని సృజించుకొన్నాడు. మౌలికమైన ఈ సత్యాన్ని పరిగణించకపోతే అవగాహనలో ఆయోమయం తప్పదు. అభ్యుదయవాదులలోని వామపక్షీయులు ఈ భేదాన్ని అంతగా లెక్కించరు; పాటించరు. వారు గుర్తించే పెద్ద ప్రక్రియలు పురాణాలూ, ప్రబంధాలూ. ఆ రెండూ ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించినవి కాబట్టి అనాదరణీయాలు. ఈ దృక్కోణంవలన ప్రక్రియా పరమైన సూక్ష్మ వివేచన తెలుగు విమర్శలో మందగించింది.

ఇలాంటిదే సంప్రదాయం; నవ్యసంప్రదాయం అనే వివేచన. సంప్రదాయ కావ్యాలనబడే రామాయణ భారతానువాదాలవంటి కావ్యాలిచ్చే అనుభవానికీ, విశ్వనాథాదులు విరచించిన కావ్యాలవలన కలిగే అనుభవానికీ మౌలికంగా ఉండే భేదాన్ని సూక్ష్మభావంతో గుర్తించే కావ్యతత్త్వజ్ఞత కలిగి ఉంటే నవ్యసంప్రదాయం ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియా జగత్తును సృష్టించిన సాహిత్యోద్యమమని వివేచించటానికి వీలౌతుంది. అనుభవం రూపాశ్రితమేకాదు- తత్త్వాశ్రితం. నవ్య సంప్రదాయం చారిత్రక పరిణామంలో రూపొందిన మరో సాహిత్య దర్శనం! *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు:
ఆదివారం ఆంధ్ర ప్రభ : 31-12-1989)

# అభ్యుదయవాదులు తెచ్చిన మార్పులు

అభ్యుదయ కవిత్వం, నవ్యసంప్రదాయ కవిత్వం - ఈ రెండూ ఉద్యమాలుగా దాదాపు ఒకేసారి 1933-35 ప్రాంతంలో తెలుగు కవితారంగం మీద కాలు మోపాయి. ఈ రెండింటి స్వరూపస్వభావాలలో కొట్టవచ్చినట్లు భేదం కనపడుతుంది. కాని, చారిత్రకంగా రెండూ ఒకే కాలంలో భావకవితోద్యమం మీద తిరుగుబాటుగా పుట్టటంచేత, కాల్పనిక కవితాప్రవృత్తికంటె విలక్షణమైన ఒక నూత్నచైతన్యాన్ని సాహిత్యంలో తీసుకొని రావాలన్న ధ్యేయంతో మాత్రం సమాంతరంగా సాగినట్లు స్పష్టమౌతుంది. ప్రతిఘటించటంలో ఏకత్వం గోచరించినా ఈ రెండు ఉద్యమాల ప్రస్థానాలు మాత్రం వేరువేరుగా సాగాయి.

కాల్పనిక కవితోద్యమం సామాజికతను విస్మరించి కవియొక్క ఆత్మాశ్రయ మానసికావస్థలకు, భావోద్వేగావస్థలకు, స్వభావావస్థలకు మాత్రమే ప్రాముఖ్యమిస్తుందనీ, కళకళ కోసమే అని భావించి- సామాజిక ప్రయోజనాన్ని సాహిత్యం ద్వారా సాధించే ప్రవృత్తిని ప్రదర్శించదనీ అభ్యుదయవాదులు విమర్శించారు. కవిత్వం సామాజిక వాస్తవికతను చిత్రిస్తూ సామాజిక ప్రయోజనాన్ని సాధించే దృక్పథంతో వ్రాయాలనీ, ఈ దృక్పథమే అభ్యుదయ దృక్పథమనీ వ్యాఖ్యానించారు. అయితే, సామాజిక వాస్తవికత అన్నా, సామాజిక ప్రయోజనమన్నా మార్క్సిస్టు ఉద్యమంలో ఆయా కాలాల్లో చెప్పబడిన సైద్ధాంతికమైన అర్థాలే చెప్పుకోవాలి. అందువలన సాహిత్య పారిభాషిక పదజాలాన్ని మార్క్సిస్ట్ సామాజిక సిద్ధాంత దర్శనంలోనుండి గ్రహించే సంప్రదాయాన్ని పాటిస్తారు అభ్యుదయవాదులు. అందులోనూ వామపక్షీయులు.

అభ్యుదయవాదం తెలుగు కవితారంగంలో అవతరించినప్పటినుండీ దాని ఆవిర్భావ వికాస పరిణామ పతనావస్థల వెనుక రాజకీయ వ్యూహ సూత్రాలూ, మార్క్సిస్టు సామాజికదర్శన పద్ధతులూ సూత్రధారిత్వాన్ని నిర్వహించాయనే చారిత్రక సత్యాన్ని మనం మరువలేము.

అభ్యుదయ కవితోద్యమం వెనుక సూత్రధారిత్వాన్ని నిర్వహించిన రాజకీయ వ్యూహాన్ని శ్రీ కంబెనపల్లి చిన వెంకట రామారావుగారి ఈ క్రింది మాటల్లో మనం తేలిగా పసికట్టవచ్చు - "సాహిత్య పాఠశాలల ద్వారా రచయితలకు తర్ఫీదూ, సభలలో కవితాపఠనాలు జరిగేవి. ముఖ్యంగా నాటకాలూ, బుర్రకథలు, గొల్లసుద్దులు, విచిత్రవేషాలకు సంబంధించిన పాత జానపదరూపాల్లో కొత్త వస్తువు-అనగా రైతుకూలీల కష్టాలూ, సామ్రాజ్యవాదుల, జమీందారుల ఆగడాలూ, వాటికి వ్యతిరేకంగా జరిగే ప్రతిఘటనలూ కథాంగాలైనాయి కష్టజీవి కథానాయకుడైనాడు. సిద్ధాంతపరంగా అభ్యుదయవాదం తన పోరాటం సాగిస్తూనే, శ్రీశ్రీ ఇత్యాదుల వాదనలను ముందుకు తీసుకుపోతూనే, పాతపంథాలో ఉన్న కవులనూ, రచయితలనూ కూడా ఉద్యమంలోకి ఆకర్షించే ప్రయత్నాలు సాగించింది. ఐక్యసంఘటనావ్యూహం, ఎత్తుగడలూ ఉద్యమపురోగతిని సాధించాయి. ఆంధ్రదేశమంతటా దాని ప్రభావం వెల్లివిరిసింది. కొమ్ములు తిరిగిన, లబ్ధప్రతిష్ఠులైనవారు చాలామంది ఆకర్షితులైనారు. దేవులపల్లి కృష్ణశాస్త్రి గారూ, విశ్వనాథవారూ మాత్రమే కాక నిజమైన ప్రగతివాదులూ, బూర్జువా ఉదారవాదులూ, మానవతావాదులూ, జాతీయవాదులూ, సామ్రాజ్యవాద వ్యతిరేకులూ, సనాతన ఛాందసులూ, అభ్యుదయ నిరోధకులూ, వివిధ ఛాయా భేదాలవారూ ప్రథమదశలో అభ్యుదయ వాదులుగా చెప్పుకోడానికి వెనుకాడలేదు. నానా గోత్రీకులు అభ్యుదయవాద వేదికపైకి వచ్చారు. ఆమోదాన్ని పొందారు. పారే గోదావరి నదీజలాల్లో (చేతలెలావున్నా) చేతులూ కాళ్లూ కడుక్కో-సాగారు. అంతా అభ్యుదయ కవులమేనని చెప్పుకోవడం ఒక ఫేషన్ అయిపోయింది. నిజంగా ఇంతమందిని సమీకరించుకోవడం ఉద్యమ విజయమేనని చెప్పక తప్పదు. కానీ, దానితోనే ఉద్యమం గుంటపూలు పూసే పునాదులు కూడా పడ్డాయి." (ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు (1982) పు. 83 - 84).

అభ్యుదయ కవితోద్యమం ముందుకు సాగటానికి వెనుక సోషలిస్టు సిద్ధాంతవేత్తలైన రాజకీయవాదుల నేతృత్వం బలంగా పనిచేసింది. రచయితలకు వారేర్పాటు చేసిన సాహిత్య పాఠశాలలు పరోక్ష రాజకీయ పాఠశాలలు. ఆ పాఠశాలల్లోని తర్ఫీదు వలన రచయితలు మార్క్సిస్టు దర్శనాన్ని అర్థం చేసుకొని-ఆ భావజాలంతో, ఆ దర్శనం లక్షించే సమసమాజ వ్యవస్థకోసం సాహిత్యాన్ని సృష్టించే శక్తిని సాధించేవారు.

మార్క్సిస్టు దర్శనం సాహిత్యదర్శనం కాదు ప్రధానంగా సామాజిక తత్త్వదర్శనం. అభ్యుదయ రచయితకు ముందు తెలియవలసింది సాహిత్య తత్త్వం కాదు, మార్క్సిస్టు సామాజికతత్త్వం ఆ ఆలోచనధారను ఆచరణంలో పెట్టి సమాజాభ్యుదయానికి తోడ్పడటం ముఖ్యం. ఆచరణకు అనువైన ఆవేశాన్ని, అభినివేశాన్ని, అవగాహనను, అంకిత భావాన్ని అందించగలిగే లయాత్మక సాధనం సాహిత్యం. అభ్యుదయవాదికి రచన అలంకారం కాదు; శిల్పం కాదు; ఆచరణకు, అవగాహనకు తోడ్పడే వాఙ్మయోపకరణం; లేదా ప్రచార సాధనం. ఉపకరణం అందంగా ఉంటే దోషంలేదు కాని, అందం కోసమే ఉపకరణమనే ఊహకు దారి తీయకూడదు; ఉపయోగమే ఉపకరణానికి జీవితం. ఇది సాహిత్యతత్త్వ దర్శన మూలమైన కవిత్వంకంటె విలక్షణంగా ఉంటుంది. అభ్యుదయవాదం కవిత్వాన్ని, సాహిత్యాన్ని సామాజిక దర్శన మూలాలుగా ప్రతిపాదించింది. ఇది అభ్యుదయవాద లక్షణంలో మొట్టమొదట పేర్కొనతగింది.

చారిత్రక పరిణామం కూడా అభ్యుదయవాదానికి తోడ్పడింది. ఎలాగంటే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు కవిత్వేతర ప్రక్రియలకన్నింటినీ సంస్కరణోద్యమ చైతన్యానికి సాధనాలుగా వాడుకొనే నైపుణ్యాన్ని ప్రదర్శించి చూపించారు. ఒకవిధంగా ఆ కాలం రచయితలు - నవలకూ, ప్రహసనానికీ, సాంఘిక నాటకానికీ, వ్యాసానికీ, కథకూ సాంఘిక వాస్తవికతను జీవితంగానూ, సంస్కరణ ప్రబోధాన్ని ప్రయోజనంగానూ నిబంధించారు. దానిని కవిత్వానికి కూడా పట్టించి చూపించినవారు గురజాడవారు. గురజాడవారిలో ఆధునిక దృక్పథం ఉంది కాని, అభ్యుదయ దృక్పథం లేదు. అభ్యుదయం అనే మాట మార్క్సిస్టులు రూఢికెక్కించిన సాహిత్య పారిభాషిక పదం. అభ్యుదయవాదులు అంటే మొదట రాజకీయవాదులు. వారు రచయితలకు శిక్షణ నిస్తారు. వారికి మార్క్సిస్టు దర్శన విశేషాలను బోధిస్తారు సాహిత్యంలో ఆ విశేషాలను వ్యక్తీకరించే ప్రక్రియలను ప్రదర్శించి చూపిస్తారు. ప్రచ్ఛన్నంగా తమ సిద్ధాంతాలను సాహిత్య స్రష్టల ఆలోచనాధారల్లో ప్రవహించేటట్లు ప్రయత్నిస్తారు.

ఈ వ్యూహంలోకి అందరినీ ఆకర్షించాలని అభ్యుదయవారులు ప్రయత్నించారన్నది నగ్నసత్యం. కొమ్ములు తిరిగిన రచయితలుకూడా ఈ వ్యూహం

లోకి వచ్చారు. అయితే, వారు సాహిత్యాన్ని సాహిత్యతత్త్వ దర్శనమూలంగా చదువుకొన్నవారు. దానికి సామాజిక ప్రయోజనముంటుందని తెలిసినా, అది మార్క్సిస్టు సిద్ధాంతానికి నిబద్ధమై ఉండాలనే నిబంధనలను వారు తెలుసుకొని, అభ్యుదయవాదుల అసలు రంగు తమకు నచ్చక, వెనుదిరిగిపోయారు కొమ్ము లకు ఉచ్చులు వేస్తే కుమ్మటం చేతకాదనుకొన్నారు వ్యూహరచయితలు. కుమ్మ కుంటూపోయిన కొమ్ములున్న రచయితలను చూచి, రాజకీయవ్యూహాల వలన సాహిత్యలోకంలో కలిగే భంగపాట్లను మొదటిసారి అభ్యుదయవాదులు చవి చూచారు. ఉద్యమానికి కావలసింది వాదాన్ని వేదంగా వల్లించటంకాదు; నాద స్వరంగా పలికించటం కాదు; చిత్తశుద్ధితో ఆచరించటం అని తెలిసిన తరువాత విప్లవకవిత్వధోరణులు మొదలుపెట్టారు.

సాహితీ రంగంలో రాజకీయ వ్యూహం రాణించదని తేల్చి చెప్పిన మొదటి ఉద్యమం అభ్యుదయ కవితోద్యమం. అయితే, దానివలన కలిగిన ప్రయోజనమేమంటే- మన చుట్టూ ఉన్న సమాజాన్ని గతి తార్కిక భౌతికవాద దృక్పథంతో అవగాహన చేసికొని, వర్గ సంఘర్షణలో ఉత్పన్నమయ్యే సమస్య లను వాస్తవ దృక్పథంతో సమీక్షించి సాహిత్యంలో వస్తువులుగా దిద్ది తీర్చే ఒక క్రొత్త చైతన్యం తెలుగు సాహిత్యాని కబ్బింది శ్రీశ్రీ వంటి వ్యక్తిత్వం ఉన్న కవులు రాజకీయవాదుల రాపిడులను నిరాకరిస్తూనే మార్క్సిస్టు సామాజిక తత్త్వావగాహనను అంతర్జాతీయ దృక్పథంతో పెంచుకొని, తదనుగుణంగా స్పందించి రచనలు సాగించారు. మరికొందరు మన చుట్టూ జరిగిన ఉద్యమాలలో మార్క్సిస్టు ధోరణులను దర్శించి కావ్యాలను గానం చేశారు. దాశరథి వంటివారు మార్క్సిస్టు పంథా కంటె గాంధేయ మార్గం పరిణతమార్గమనీ, భారతీయులా తత్త్వాలను అంచెలంచెలుగా అధిరోహించాలనీ భావించి రచించారు. మొత్తానికి అభ్యుదయ వాదం రచయితలకు అవగాహన కలిగించి ఉద్యమాన్ని ఆరంభిం చింది. అయితే, రాజకీయ నేతల అజమాయిషీలో రచయితల నందరినీ ఉంచ లేకపోయింది. ఆ లక్ష్యం సాధించటానికి మరొక పేరుతో ఉద్యమించవలసి వచ్చింది. అభ్యుదయ కవితోద్యమం రాజకీయంగా విఫలమైంది కాని, రచ యితల అవగాహనను పెంపొందించటంలో, సమాజంలో సోషలిస్టు అవగాహ

నను వ్యాప్తి చేయటంలో విజయాన్ని సాధించిందని కొందరు అభ్యుదయ వామ పక్షీయులంటారు. ఆ మాట సత్యమని అంగీకరింపదగిందే.

అభ్యుదయవాదం కవిత్వ దృక్పథంలో తెచ్చిన మార్పులను ఈ క్రింది విధంగా క్రోడీకరించవచ్చు:

1. కవిత్వం వ్రాసేవారికి సాహిత్యపరమైన సిద్ధాంతాలకంటె గాఢంగా మార్క్సిస్టు పరమైన సిద్ధాంతాలు తెలిసి ఉండాలి అవే ప్రమాణాలని వారు విశ్వసించాలి.

2. కవిత్వం ఆ సిద్ధాంతాల అవగాహనను, అర్థన్వయాన్నీ ఆవిష్కరించాలి; సమాజంలో సోషలిస్టు సమసమాజ వ్యవస్థ ఏర్పడటానికి సాహిత్యం సాధనంగా ఉపయోగపడాలి. ఈ ప్రయోజనం కంటె కవితకు మరొకటి లేదు; ఉండరాదు.

3. మార్క్సిస్టు అవగాహనకు అడ్డువచ్చేవీ, ఆ సిద్ధాంతాలనూ భావ జాలాన్నీ సామాన్య ప్రజల్లోకి చొచ్చుకొని పోయేటట్లు చేయలేనివీ అయిన సాహిత్య ప్రక్రియలనూ, పద్ధతులనూ సమాదరించ నవసరం లేదు. వాటిని అభ్యుదయ నిరోధకాలని త్రోసివేయాలి.

4. మార్క్సిస్టు సిద్ధాంతం నియతం కాదు; ఒక పరిణామాన్ని చెందే ఆలోచనధార అని నమ్ముతూ, ఆయాకాలాల్లో అయానాయకులు చెప్పే నిర్వచ నాలకూ, అన్వయాలకూ, ఆశయాలకూ అనుగుణంగా రచనాలక్ష్యాలను మార్చు కుంటూ ఉండటం కూడా అభ్యుదయవాద లక్షణంలో అంతర్భాగమే.

5. అభ్యుదయ మార్గానికి దగ్గరగా ఉన్న భావాలను ప్రకటించిన పూర్వ కవులను, రచయితలనూ గుర్తించి వారిని గురించి, ఒక ప్రత్యేక దృక్పథంతో అధ్యయనం చేయటం, వారి రచనలను అన్వయం చేసి చెప్పటం ద్వారా ఈ వాదాన్ని సమకాలీన సాహిత్యంలో బలపడేటట్లు చేయటం అవసరం.

6. అభ్యుదయవాదం సమాజంలో శాశ్వతమైన విలువలుంటాయని గుర్తించదు. అందువలన అటువంటివి సాహిత్యంలో కూడా ఉండటానికి వీలు

లేదంటుంది. ఈ దృక్పథంతో చూస్తే సాహిత్యం కొన్ని విలువలను ప్రచారం చేయటానికిగాని, ప్రసారం చేయటానికిగానీ ఉపయోగపడుతుంది కాని, ప్రబోధం చేయటానికిగానీ తరతరాల ప్రభావాన్ని కల్పించటానికిగానీ వినియోగపడదు. అందువలన కవిత్వంలో పెద్ద పెద్ద ప్రక్రియలు పనికిరావు. ఖండకావ్యాలయితే మరీ నయం.

7. కవిత్వంలో ప్రక్రియకంటె రూపం ముఖ్యం. కథకంటె వర్ణనం, మనో భావాలకంటె 'మార్క్సిస్టు భావజాలం' ప్రధానం. చెప్పే పద్ధతికంటె చెప్పే విషయం గణనీయం. Mode ను పాటించినదానికంటె Mood ను పోషించటం ముఖ్యం.

8. పీడిత వర్గం, కార్మిక కర్షక వర్గాల అభ్యుదయం కోసం రచయిత కృషిచేసే యత్నంలోనే తన కవితను వాహికగా వాడుకోవాలి. పీడితవర్గ ప్రతి నిధిగా తన గొంతు వినిపించాలి. ఎవరిని గురించి వ్రాస్తున్నాడో, ఎవరి కోసం వ్రాస్తున్నాడో, ఏ ప్రయోజనం కోసం వ్రాస్తున్నాడో వాటిని తెలిసికొని, వాటికి తగిన బాణీనీ, భాషనూ, పలుకుబడినీ, అభివ్యక్తినీ కవితలో ప్రదర్శించాలి.

9. అభ్యుదయ కవుల ఆదర్శాలు- ''అంతర్జాతీయ దృక్పథంతో మానవా భ్యుదయాన్ని కాంక్షించడం; ఆర్థిక అసమానత అంతరించి సామ్యవాద సమాజం నెలకొనడం; పెట్టుబడిదారీ వ్యవస్థను కూలద్రోయడం; ఫాసిస్టు వ్యతిరేక పోరాటం జరపడం; కార్మిక కర్షక జనానికి ఉత్తమ జీవనం కొరకై దేశదేశా లలో సామ్యవాద సమాజ స్థాపన; ఒక్కొక్క సందర్భంలో కమ్యూనిస్టు అయి ఉండనక్కర లేకుండానే పీడిత మానవుల శ్రేయస్సును కాంక్షించి వ్రాయడం; యుద్ధాలు లేని విశ్వశాంతి, దేశ పారిశ్రామికీకరణ, ఉత్పత్తి సాధనాలను సమాజ పరం చేయటం; వర్ణ వర్గ రహితమైన వ్యవస్థను గాఢంగా కాంక్షించడం; కుల మత జాతి వ్యవస్థను నిర్మూలించి, అందమైన భవిష్యత్తును రూపొందించుకోవడం కోసం వికృతమైన ప్రకృతాన్ని తొలగించడం; ఏ దేశాలలో సామ్యవాద వ్యవస్థ ఏర్పడి ఉందో వాటి శ్రేయస్సును కోరుతూ విపత్తు వచ్చినప్పుడు వాటి తరఫున నిలబడడం, ఈ ఆశయాల సాధనకై ప్రగతిశీల సాహిత్యాన్ని సృష్టించడం; ప్రాచీన సాహిత్యాన్ని అది రచింపబడ్డ కాలం దృష్ట్యా అవగాహన చేసుకోవడం;

అందులోని ప్రగతిశీల భావాలను ఆకళింపు చేసుకొని వర్తమానానికి అన్వయించుకోవడం; ప్రాచీన జానపద రీతుల్ని, కళారూపాలను అభ్యుదయ భావాల ప్రకటనకు వినియోగించడం; వచన కవిత్వాన్ని ఉద్యమంగా వ్యాపింపచేయడం, మొత్తంపై వ్యక్తి చైతన్యాన్ని సంఘ చైతన్యంగా పరివర్తింపజేయడం." (డి. రామలింగం: అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు- (పుట 57.)

10. "అంతవరకూ తెలుగుకవిత్వానికి ఆనందం పర్యవసానం. భావ కవిత్వం పర్యవసానం రసానందం కాకపోయినా, హృదయానుభూతికీ, రసానందానికీ మధ్య వున్న భేదం విస్మరించి ఆనందాన్నే పర్యవసానంగా అంగీకరిస్తూ వచ్చారు కవులూ, విమర్శకులూ. ఎంత పొరపాటుగా వర్తింపజేద్దామన్నా అభ్యుదయ కవిత్వానికి రస సిద్ధాంతం వర్తించదు. దానికి కారణం, అభ్యుదయ కవిత్వ పర్యవసానం రసానందం కాదు; చైతన్యం" (డాక్టర్ వెల్చేరు నారాయణరావు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం (1978) (పు. 176.)

అభ్యుదయవాదులు కాల్పనిక కవితోద్యమంమీద తిరుగబడ్డా ఆ కాలంలో ప్రసిద్ధిచెందిన ఖండకావ్య ప్రక్రియను తిరస్కరించకుండా గ్రహించారు. దానికి కారణం ఖండకావ్యంకంటె పెద్దవైన ప్రక్రియలు ఉద్యమవేగానికి పనికిరావని భావించటం, అవి ఫ్యూడల్‌వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తాయని తలంచటం, కాల్పనిక కవులు ఖండకావ్య ప్రక్రియారూపాన్ని పద్యంతోనూ, గేయంతోనూ కల్పించారు. అభ్యుదయవాదులు పద్యాన్ని 'ఛందోబందోబస్తుల' క్రింద, 'సర్ప పరిష్వగం' క్రింద జమకట్టి, దాన్ని వచనపద్యం దుడ్డు కర్రలతో నడుము విరిగేటట్లు కొట్టాలని యత్నించారు. ఛందస్సులంటే పద్యాలనే అర్థం అభ్యుదయవాదులు చేసిన వక్రీకరణమే. పద్యంవ్రాస్తే సంప్రదాయవాది; అంటే అభ్యుదయ నిరోధకుడనే నిందార్థం. గేయం వ్రాసినా, వచనకవిత్వం వ్రాసినా అభ్యుదయ వాది. అయితే, గేయ పద్యమనీ, వచన పద్యమనీ వ్యవహారం ఉంది; ఒకదానికంటె మరొకటి పరిణత రూపమనే అభిప్రాయమూ ఉంది. గేయపద్యం, వచన పద్యం అనేవి ఖండకావ్యానికి రెండు రూపాలని చెప్పేవారు చాలామంది; అవి రెండూ రెండు ప్రక్రియలని భావించేవారు కొద్దిమంది.

'గేయపద్య, వచన పద్య' ప్రక్రియలు కాల్పనికయుగంలో వెలువడిన పద్యగేయ ప్రక్రియలకంటె విశిష్టమైనవిగా భావించటంలో గల తాత్పర్యం ఏమి

టంటే - అవి అందించే అనుభవం మౌలికంగా విభేదిస్తుందని వివేచించటమే. వెల్చేరు వారు చెప్పినట్లు కాల్పనిక కవిత్వంలోని పద్యగేయ ప్రక్రియలు ఆనందాన్ని కలిగించటానికి నిర్మించినవి. అభ్యుదయ కవిత్వోద్యమంలోని గేయ వచనపద్యాలు చైతన్యం కలిగించే ప్రయోజనంతో వినిర్మించబడ్డాయి. నేను 'అనుభూతివాదం' వ్యాసంలో (అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు: పు. 296-300) పేర్కొన్నట్లు కాల్పనిక కవుల సాహిత్య ప్రక్రియల వలన కలిగే అనుభవం 'స్వాత్మీయీకరణాన్ని' ఆశ్రయించింది; అభ్యుదయవాదుల కవితా ప్రక్రియల అనుభవం సామాజికీకరణాన్ని' ఆశ్రయించి ఉంటుంది. మౌలికమైన ఈ భేదాన్ని గణించి అభ్యుదయవాదులు గేయపద్యాలు, వచనపద్యాలని పిలిచేవి కాల్పనికయుగ ప్రక్రియలకంటె భిన్నమైనవిగా పరిగణించటం న్యాయమని నా అభిప్రాయం కూడా. 'గేయపద్యం', 'వచనపద్యం' ఖండకావ్య ప్రయోగాలుగానేకాక ప్రత్యేక ప్రక్రియలుగా లెక్కించే పరిపాటి ప్రచారంలో లేకపోవటం చేత వాటి విశ్లేషణ విశేషంగా సాగలేదు. *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 7-1-1990)

# అభ్యుదయవాదం : నవ్యసంప్రదాయవాదం

అభ్యుదయ కవిత్వోద్యమం కంటె నవ్య సంప్రదాయకవిత్వోద్యమం ఎన్నోవిధాల విలక్షణమైనది; విశిష్టమైనది కూడా. అలా కావడానికి ముందుగా చెప్పుకోదగిన కారణం ఒకటి ఉంది నవ్య సంప్రదాయోద్యమాన్ని సాగించిన ప్రముఖులైన కవులలో కొందరు - అంటే విశ్వనాథ సత్యనారాయణ, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు, నోరి నరసింహశాస్త్రి, నాయని సుబ్బారావు ప్రభృతులు - అటు కాల్పనిక కవిత్వోద్యమంలో తలమున్కలుగా మునిగి బైటపడ్డవారు కావటం చేతనూ, ఇటు - అభ్యుదవాదులలోని వామపక్షీయుల వ్యూహంలో మొదట చిక్కినా, రాజకీయపక్షాల ఆజమాయిషీనీ, మార్క్సిస్టు సిద్ధాంతానికి ఎల్లప్పుడూ కట్టుబడి ఉండే నిబద్ధతనూ వ్యతిరేకించి, దానిని తెగత్రెంచుకొని విముక్తులైనవారు కావటంచేతనూ వారు కూలంకషంగా యోచించి, సాహిత్య శ్రేయస్సును లక్షించి, పై రెండు ఉద్యమాలకంటె విలక్షణంగానూ, విశిష్టంగానూ ఉండే నవ్య సంప్రదాయమార్గాన్ని ఎన్నుకొని, దానిలో ఉద్యమ స్ఫూర్తితో ప్రయోగాలు స్వప్రయత్నంగా, సాధికారికంగా నిర్వహించారు. భావకవిత్వం మీద సాగించిన తిరుగుబాటుగా మొదట తలయెత్తినా, అభ్యుదయ కవిత్వోద్యమానికి ప్రత్యర్థిగా క్రమంగా రూపొందిన సాహిత్యోద్యమం నవ్య సంప్రదాయోద్యమం.

అభ్యుదయ కవిత్వోద్యమం సామాజిక తత్త్వదర్శనం (మార్క్సిజం) ప్రాతిపదికగా పుట్టింది. అదే జీవితంగా లక్ష్యంగా జీవించింది. చివరకు సాహిత్యమంటే అభ్యుదయ సాహిత్యమే- లేదా- మార్క్సిస్టుల సాహిత్యమే అని సాహిత్యరంగంలో స్థాపించటానికి ఉద్యమించింది. అదే ఉద్యమంలోని తారాస్థాయి. అదే నవ్య సంప్రదాయవాదులు వ్యతిరేకించిన పతాకస్థాయి. నవ్య సంప్రదాయవాదులు మార్క్సిజం గురించి క్షుణ్ణంగా చదివినవారే. అంతేకాదు,

ఆ వాదానికి సంబంధించిన సాహిత్యాన్ని గురించి ప్రపంచంలోని మేధావులు, సాహితీవేత్తలు ఎలా స్పందించారో, ప్రతిస్పందించారో కూడా అధ్యయనం చేసిన వారే. మార్క్స్, ఏంగిల్స్ తమ సిద్ధాంతంలో సాహిత్యం ఆర్థిక సాంఘిక వ్యవస్థలచేత నియంత్రితమౌతుందనీ, ఆర్థిక సాంఘిక ప్రమాణాలతోనే సాహిత్యపు విలువలు నిర్ణయింపబడతాయనీ నిర్ద్వంద్వంగా ఎక్కడా పేర్కొనలేదు.

వారు అప్పుడప్పుడూ సాహిత్యంమీదా, రచనలమీదా, వ్యక్తం చేసిన అభిప్రాయాలను గమనిస్తే సాహిత్య సృష్టి సర్వస్వతంత్రమైనదిగా గుర్తించినట్లే స్పష్టమౌతుంది. కొన్ని కొన్ని యుగాల్లో వెలసిన మహాకావ్యాలకూ, ఆయా కాలాల్లో ఉన్న ఆర్థిక సాంఘిక పరిస్థితులకూ సంబంధం కనపడటం లేదనికూడా వారు చెప్పారు. కానీ, క్రమంగా మార్క్సిస్టు ఆలోచనాధోరణులలో వచ్చిన మార్పులను బట్టి కావ్యాల, కళాఖండాల విలువలను నిర్ణయించటానికి మార్క్సిజమే ప్రమాణమనే సిద్ధాంతం వచ్చింది. స్టాలిన్ కాలంలో సాహిత్యస్వాతంత్ర్యం పూర్తిగా అంతరించింది; పార్టీ విధానాల ననుసరించి వ్రాసే వ్రాతలుగా, ప్రచార సాధనాలుగా సాహితీ ప్రక్రియల్ని పరిగణించటం జరిగింది. రెనె వెలెక్, ఆస్టిన్ వారెన్ మాటలు గమనింపదగినవి: "Marxism never answers the question of the degree of dependence of literature on society .... There is great literature which has little or no social relevence; Social literature is only one kind of literature and is not central in the theory of literature, unless one holds the view that literature is primarily an 'imitation' of life as it is and of social life in perticular. But, literature is no substitute for sociology or politics. It has its own justification and end." (Theory of Literature: పు. 109.)

ఆధునిక తెలుగు సాహిత్యరంగంలో నవ్యసంప్రదాయవాదులు అభ్యుదయ సాహిత్యమని పిలువబడే మార్క్సిస్టు సాహిత్యంమీద, దానివెనుక నున్న సామాజిక తత్త్వదర్శనంమీదా పైవిమర్శకుల భావాలవంటి భావాలే కలిగి ఉండేవారు. వారి దృక్పథంలో సామాజిక తత్త్వ దర్శనంగల ప్రక్రియలు వేరు; సాహిత్య తత్త్వ దర్శనంగల ప్రక్రియలు వేరు నవల, కథానిక మొదలైన ప్రక్రియల

ప్రాతిపదిక సామాజిక తత్త్వదర్శనం. అయినా, అది నియతంగా మార్క్సిస్టు దృక్పథమే కావాలని నవ్యసంప్రదాయవాదులు చెప్పరు. పైపెచ్చు అది పాక్షిక మనీ, మార్క్సిజం మానవ వికాసంలో మొదటిమెట్టు మాత్రమేననీ నమ్ముతారు. సమగ్ర మానవ వికాసం జీవిత ధ్యేయమనీ, సాహిత్య లక్ష్యమనీ నవ్యసంప్రదాయ వాదులు సంభావించారు.

అంతేకాదు, నేడు సోవియట్ అధ్యక్షుడు శ్రీ గోర్బచేవ్ తెస్తున్న మార్పు లకు మూలకారణమైన మానవ అంతర్వికాస సూత్రం నవ్యసంప్రదాయవాదులు 1933 లోనే దర్శించారు. 'పెరిస్త్రోయికా'లోని ఈ మాటలు గమనించండి: "ఈనాడు మా ప్రధానకర్తవ్యం వ్యక్తిని ఆత్మికంగా ఉన్నతుని చేయడం; అతని ఆంతరిక ప్రపంచాన్ని గౌరవిస్తూ, అతనికి నైతికశక్తిని అందిస్తూ మేమాకర్తవ్యం నిర్వహించాలి. సామాజికంగా చురుకైన వ్యక్తిని ఆత్మికంగా సంపద్వంతుని, న్యాయమైన వ్యక్తిని శుద్ధమైన అంతరాత్మగల వ్యక్తిని తీర్చిదిద్దేందుకు సమాజం లోని సమస్త బౌద్ధిక శక్తులు, సంస్కృతీ శక్తులూ కృషి చేసేలా చేసేందుకు మేము ప్రయత్నిస్తున్నాం. తన కృషితో సమాజానికి అవసరం ఉన్నదనీ, ఆత్మ గౌరవానికి భంగం కలగటంలేదనీ, తనను విశ్వసిస్తున్నారనీ, గౌరవిస్తున్నారనీ ప్రతి వ్యక్తీ తెలుసుకోవాలి; హృదయంతో అనుభూతి చెందాలి. వ్యక్తి ఇదంతా చూడగలిగినప్పుడు మరింత సాధించే శక్తి అతనికి ఉంటుంది." (పెరిస్త్రోయికా (తెలుగు అనువాదం) (1988) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; పు. 24) గుర్తింపబడిన ప్రజాప్రతినిధిగా శ్రీ గోర్బచేవ్ గుర్తించిన మానవవికాససూత్రాన్ని భారతీయ దర్శనంతో దాదాపు ఆరు దశాబ్దాల క్రితమే తెలుగులో నవ్యసంప్రదా యోద్యమ ప్రవక్తలు తమ ప్రయోగాలద్వారా ప్రపంచించి చూపించారు. ఈనాడు యూరోప్ దేశాల్లో జరుగుతున్న పరిణామాలను వారు ఆనాడు సమాజంలో సహజంగా ఏర్పడాలని సంభావించారు. 1990 నూతన సంవత్సరోత్సవాలలో దానికి ముందు జరిగిన క్రిస్మస్ వేడుకలలో సోవియట్‌లో వినబడిన చర్చి గంటల సవ్వడిని నవ్య సంప్రదాయ కవులు ఒక అర్ధ శతాబ్ది ముందే వినాలని ఆశించారు. వారి ఆశలు, ఆశయాలు విశ్వనాథవారి ఈ మాటల్లో దేవాలయ ఘంటా నినాదాలుగా నినదిస్తున్నాయి— "If you go through my writings carefully and dispassionately you are sure to attribute to me unqualified admiration for the sort of government that

the Russians have in their country. My ideal briefly stated is Socialism Plus God Plus Religion.

"If I can read between the lines of my writings, I want the type of Government which now people are having in Russia but I want at the same time not to do away with metaphysics, the mysticism and the spiritual." (విమర్శిని: విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక (1977), కాకతీయ విశ్వవిద్యాలయ పరిశోధన పత్రిక - పుట. 77.)

విశ్వనాథవారు సామాజిక జీవితం, ప్రభుత్వ వ్యవస్థ ఎలా ఉండాలని అరవైయేళ్ళ క్రితం ఆశించారో అటువంటిది నేడు అవసరమని తూర్పు యూరోప్ భావించి, దాన్ని సాధించుకొంటోంది. అంటే, విశ్వనాథ మొదలైనవారు నాడు నవ్యసంప్రదాయోద్యమ లక్ష్యాలుగా చెప్పుకొన్న అంశాలు నేడు విశ్వజనీనంగా ఆమోదయోగ్యాలౌతున్న వన్నమాట. మరొక విశేషమేమంటే - నాడు విశ్వనాథ వారు చెప్పింది భారతీయ తాత్త్విక దర్శనంలో నుండి పుట్టిందే; వివేకానందాదులు ప్రపంచించిన ఆధ్యాత్మిక సోషలిజానికి చెందిన మానవతావాదమే. అయితే, దానిని జీవితానికి అన్వయించి వివేకానందులు ప్రబోధిస్తే, నవ్యసంప్రదాయ వాదులు దాని నాధారంగా చేసికొని తమదైన ఒక నవ్యసంప్రదాయ సాహిత్య దర్శనాన్ని రూపొందించుకొన్నారు. దాని కనుగుణంగా వివిధ ప్రయోగాలు నిర్వహించారు. వివేకానందలోని ఆధ్యాత్మిక సోషలిజం విశ్వనాథలో నవ్య సంప్రదాయ దర్శనంగా పరిణమించింది. నవ్యసంప్రదాయ వాదం మార్క్సిజం కంటె ముందు చూపు కలిగింది; వివేకానంద, అరవింద మహర్షి, మహాత్మా గాంధీ ప్రభృతులు ప్రతిపాదించిన సామాజికాధ్యాత్మిక వాదాలను తనలో సంవదించుకొన్నది. అంతేకాదు, భారతీయ సాహిత్య దర్శనం ప్రాతిపదికగా పాశ్చాత్య సాహిత్యరంగంలో కాల్పనికోద్యమ కాలంనుండి వెలువడిన సజాతీయ సాహిత్య సిద్ధాంతాలను సమయోచితంగా, సార్థకంగా తనలో సమన్వయించు కొన్నది. నవ్యసంప్రదాయ సాహిత్య దర్శన మూలాలు ప్రాచీన సాహిత్య దర్శనాలలో ఉన్నట్లు మనకు తెలుస్తున్నా, అవి ఆధునిక మూల్యాలతో సంవదింపబడి, అభినవంగా ఒక సాహిత్య దర్శనంగా ఆవిష్కరింపబడినట్లు మనం అర్థం చేసుకోగలం.

సామాజిక తత్త్వ దర్శన మూలమైన అభ్యుదయ వాదానికీ, సాహిత్య తత్త్వదర్శన మూలమైన నవ్యసంప్రదాయ వాదానికీ వస్తుతః, తత్త్వతః భేదం కొట్టవచ్చినట్లు కనపడుతుంది అభ్యుదయ సాహిత్యం వర్గసంఘర్షణను చిత్రిస్తే, నవ్యసంప్రదాయం వర్గసామరస్యాన్ని పోషిస్తుంది. భారతీయ సమాజ పరిణామ వికాసం గతితార్కిక భౌతిక వాదమే ప్రాతిపదికగా, అంతర్జాతీయ సమాజ వికాసంలో భాగంగా చారిత్రకంగా సాగి ఉంటుందనీ, ఆ పరిణామంలోని భాగం గానే సాహిత్యాన్ని వివేచించి విలువ కట్టాలనీ అభ్యుదయవాదం చెపుతుంది. నవ్యసంప్రదాయవాదం కూడా పరిణామాన్ని అంగీకరిస్తుంది. అయితే, మానవ జాతి తన మానవత్వం యొక్క అస్తిత్వాన్ని పరిరక్షించుకొనే సామాజిక విలువలను పదిలపరచుకొంటూనే, లౌకికాభ్యుదయాన్ని సాధించే సాపేక్షిక విలువలను ఆయాకాలాల్లో మన్నిస్తుందని విశ్వసిస్తుంది. మౌలికమైన మానవత్వ మూర్తిమత్వాన్ని ధార్మికంగా, ఆర్థికంగా, భావపరంగా, జ్ఞానపరంగా యుగోచిత వికాసంవైపు పురోగమింప చేస్తూ, ఆ వికాసంలో వ్యక్తిగా మొదలై సాంఘిక శక్తిగా మానవుడు ఎలా తన పాత్రను నిర్వహిస్తాడో వ్యాఖ్యానించే సాత్త్విక సాధనం సాహిత్యంగా నవ్యసంప్రదాయం సంభావిస్తుంది. అభ్యుదయవాదం సాహిత్యంలో గతానుకరణరూపంగా కనిపించే సంప్రదాయాన్ని గర్హిస్తుంది; సామాజిక స్పృహ కవితకు జీవితమని నిర్దేశిస్తుంది; మార్క్సిజం పట్ల నిబద్ధత నిత్యమని నియమిస్తుంది. ఈ త్రివేణీ సంగమమే అభ్యుదయమనీ, విప్లవమనీ పేర్కొంటుంది.

నవ్యసంప్రదాయుల దృష్టిలో సంప్రదాయం అవిచ్ఛిన వికాస శీలం కలిగింది; ఆయా కాలాల్లో అభినవ దర్శనాన్ని సమాజానికీ, సాహిత్యానికీ అందించే సమాహార జీవన చైతన్యం సంప్రదాయం. సమాజం ఒక పూర్ణ చైతన్యమనీ, అందులో భాగంగానూ, దానికి పోషకంగానూ, దాని వికాసశక్తిగానూ ఉండే మానవుడు కూడా వ్యక్తిగా, శక్తిగా పూర్ణ చైతన్యరూపుడనీ, ఒక పూర్ణ శక్తినుండి, మరొక పూర్ణశక్తి పుట్టి, మరలా అందులో లయిస్తూ ద్వైతంగా కనపడుతున్నా అద్వైతంగా అభివ్యక్తమయ్యే విశ్వ చైతన్యాన్ని సంతత పూర్ణ వికాస ప్రస్థానంవైపు మానవుడు పురోగమింపచేస్తుంటాడనీ నవ్యసంప్రదాయవాదం దర్శిస్తుంది. ఈ సంతత పూర్ణ వికాస ప్రస్థానాన్ని ఆయా యుగాల్లో దర్శించిన మహాకవులు రచించే కావ్యాలు కళాత్మకంగా, ప్రతీకాత్మకంగా, రసాత్మకంగా

విశిష్ట ప్రక్రియలలో చేసే జీవిత విమర్శలే. సమాజ దర్శనాన్ని సాహిత్య దర్శనంగా పరివర్తింపజేసుకొనే ప్రతిభావంతుడే మహాకవి. భావజాలాన్ని మాత్రమే ప్రతిపాదించాలని అనుకొనేవాడు ప్రబోధకుడు కావచ్చు లేదా ప్రచారకుడు కావచ్చు కాని మహాకవి కాడు. మహాకవికి జీవిత తత్త్వాన్ని గురించి ఎంత అవగాహన ఉండాలో, సాహిత్య కళా తత్త్వాన్ని గురించిన అంత దార్శనికశక్తి ఉండాలి. తాను నివసిస్తున్న కాలంలో జాతి జీవనంలో ప్రతిఫలిస్తున్న వివిధ దృక్పథాల తులనాత్మక వివేచనంతోపాటు, అవి మానవ మౌలిక మూర్తిమత్వ వికాసానికి దోహదంచేసే సమన్వయాన్ని కూడా మహాకవి సాధించాలి. దాన్ని కళాత్మకంగా ఉన్నత ప్రమాణాలతో ఆవిష్కరించాలి. ఆ రచన సాహిత్య వికాసంలో మరొక వినూత్న సంప్రదాయాన్ని సాధించాలి. అది గతంలోనుండి వికసించిన శ్రేయస్సు. ఒక పూర్ణత్వంలోనుండి పుట్టిన మరొక పూర్ణత్వం. ఇది వైరుధ్యం లేని పరిణామం. ఎప్పటికప్పుడు పరిపూర్ణంగా వ్యాఖ్యానింపబడుతున్నా, పరిపూర్ణత కాలంతోపాటు ముందుకు సాగుతుందని విశ్వసించి మానవ మూర్తిమత్వంమీద, సమాజ శ్రేయస్సుమీద సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటించే ప్రస్థానం నవ్యసంప్రదాయవాదం.

పరిణామాన్ని అంగీకరించే నవ్యసంప్రదాయం మౌలికమైన శాశ్వతమైన కొన్ని విలువలను మానవ వికాసం ప్రమాణంగా అంగీకరిస్తుంది. యుగయుగాల మానవ చరిత్రలో మానవ జాతి పురోగతిని నవ్యసంప్రదాయం దర్శిస్తుంది. మానవజాతి తాను పురోగమిస్తూ తన చుట్టూ ఉన్న జీవరాసులు కూడా తనతో పాటు పురోగమించటానికి సహకరిస్తుంది. ఆ పురోగతిని అడ్డుకొనే వ్యక్తులను గాని, మానవేతర శక్తులనుగాని మానవజాతి ఎదుర్కొంటుంది. మానవ సమాజంలోనే మానవత్వపు విలువలను ధ్వంసంచేసే దమన శక్తులను, వాటిని పోషించే వ్యక్తులను గుర్తించి, వారిని శిక్షించి, మానవ వికాస ప్రస్థానాన్ని నిష్కంటకంగా ముందుకు సాగించటానికి ముఖ్యంగా తోడ్పడేది మానవ భౌతికశక్తి కాదు; అంతశ్శక్తి. దానినే నవ్యసంప్రదాయవాదులు ఆత్మశక్తి అనీ, అధ్యాత్మికశక్తి అనీ, ధార్మికశక్తి అనీ, దైవీశక్తి అనీ ఎన్నో పేర్లతో పిలుస్తారు. మానవ వికాసం ఒక్కొక్క కాలంలో తన అస్తిత్వాన్ని యుగోచిత శ్రేయస్సును సాధించుకొనే నిమిత్తం ఒక్కొక్క పరిపూర్ణ దశావస్థను పొందుతూ ఉంటుంది. అది ఒక పూర్ణంలోని పూర్ణం. అలా దర్శించటమే సంప్రదాయం. ఒక పూర్ణంనుండి ఒక

నవ్యదర్శనాన్ని పూర్ణంగా సాధించటం నవ్య సంప్రదాయం. అది పూర్ణంలో భాగంగా లీనమైపోయే సమన్వయాన్ని కళాత్మకంగా వ్యాఖ్యానించే ఒక వినూత్న మహాకావ్యమే నవ్యసంప్రదాయ సాహిత్య ప్రక్రియా ప్రయోగం. నవ్యసంప్రదాయ వాదులకు వారిదైన సామాజిక స్పృహ ఉంది; దాన్ని వ్యక్తీకరించే సాహిత్య స్పృహ ఉంది. పరిణామాన్ని అంగీకరిస్తూనే పరిపూర్ణత్వంపట్ల ప్రగాఢమైన నిబద్ధత ఉంది.

నవ్య సంప్రదాయవాదులు మానవ వికాసవాదులు. ఆ వికాసం అభ్యుదయ వాదులు చెప్పే భౌతిక దృక్పథం కంటె ఇంకా ముందుకు సాగే ఆధ్యాత్మిక దృక్పథం ప్రమాణంగా కలది. మానవుడు ధర్మార్థ కామమోక్షాలను సాధించే సాధకుడుగా ఆయా యుగాల్లో పొందే పరిపూర్ణత్వాన్ని విలువకట్టే విమర్శనమే సాహిత్య ధ్యేయం నవ్య సంప్రదాయవాదులకు. అందువలన అభ్యుదయవాదులు చెప్పే జీవితపు విలువలను నవ్య సంప్రదాయవాదులు ద్వేషించరు. అయితే, అవియే నిత్యాలనీ సత్యాలనీ, పరమార్థాలనీ విశ్వసించరు. మార్క్సిజం కానీ, హ్యూమనిజం కానీ, హేతువాదం కానీ, మరేవాదం కానీ, అది సామాజికం కానీ, సాహిత్యపరమైనది కానీ - అవన్నీ మానవ మూర్తిమత్వ వికాసానికి తోడ్పడే ముందడుగులుగా నవ్య సంప్రదాయవాదులు గౌరవిస్తారు. కాని, అవి మానవ పురుషార్థ సాధనామయమైన జీవితగమనానికీ, పరిణామానికీ, ప్రగతికీ, శ్రేయస్సుకూ ఒక పరిపూర్ణ వ్యాఖ్యానాన్ని ఇవ్వగలిగినవా - లేవా? అని నిశితంగా విమర్శిస్తారు.

ఆ జీవిత విమర్శలో నవ్యసంప్రదాయులు భారతీయ తత్త్వ దర్శనాలను, సాహిత్య దర్శనాలను పరమ ప్రమాణాలుగా నమ్ముతారు. భారతీయ దర్శనం మంచి ఎక్కడున్నా గ్రహిస్తుంది. దానిని తన పరిణామ క్రమంలో యుగోచిత పరిపూర్ణత్వ సాధనకు పోషకద్రవ్యంగా మలుచుకుంటుంది. తన మౌలికవ్యక్తిత్వానికి, మానవ మౌలిక మూర్తిమత్వానికి, శ్రేయోదాయకమైన నవ్యసమన్వయానికి సాధనంగా వాడుకుంటుంది. నిత్యత్వాన్నీ నవ్యత్వాన్నీ విరోధంలేని పూర్ణ దశలుగా దర్శించే తత్త్వాన్ని వివిధ ప్రక్రియల ద్వారా సవిమర్శక చైతన్యంతో అభివ్యక్తీకరించే సాహిత్యోద్యమం నవ్యసంప్రదాయోద్యమం. *

(సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 14-1-1990)

# నవ్యసంప్రదాయవాదులు– తిప్పికొట్టిన దాడులు

నవ్యసంప్రదాయవాదుల సాహిత్య దర్శనం రససిద్ధాంతంమీద ఆధారపడి ఉన్నది. రససిద్ధాంతం ఎంత విశాలమైన ప్రాతిపదిక కలిగి ఉన్నదో, ఎంత విశ్వజనీనమైనదో ఆధునికులు అవగాహన చేసుకోవడానికి వీలుగా ఆచార్య నగేంద్ర రససిద్ధాంతంమీద ప్రామాణికమైన గ్రంథం రచించారు. నవ్యసంప్రదాయవాదిలాగా వాదించే విమర్శకుడు ఆచార్య నగేంద్ర. ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాలతో తులనాత్మకంగా పరిశీలించిన తరువాత ఆచార్య నగేంద్ర రససిద్ధాంతాన్ని గురించి ఈ క్రింది ఫలితాంశాన్ని ప్రకటించారు—

''ఈ సిద్ధాంతం ఆధారంగా సమస్త దేశాలకు, సమస్త కాలాలకు సంబంధించిన సృజనాత్మక సాహిత్యాన్ని, సృజనాత్మక సాహిత్యంలోని ప్రతిరూపాన్ని సముచితంగా విలువకట్టవచ్చు. దీని పరికల్పన ఎంత సర్వాంగీణమైనదంటే- మానవచేతనకు మూలప్రవృత్తి అయిన రాగతత్త్వాన్ని ఆధారంగా గ్రహించి ఇది ఇతరాలయిన అన్ని ప్రముఖ తత్త్వాలను సముచితరూపంలో స్వీకరిస్తుంది. అందువల్ల జీవితంలోని సమస్త రూపాలతో, వివిధ ప్రమాణాలతో రససిద్ధాంతానికి సంపూర్ణ సామంజస్యం కుదురుతుంది. ఆ సామంజస్యంలో వేర్వేరు వాదాల అతర్విరోధం అంతర్భవించిపోతుంది. రససిద్ధాంతం దృఢమయిన మానవవాద ఆధారంమీద సుప్రతిష్ఠితమై ఉండటమే దీనికి నిజమైన కారణం. ఇది మానవుణ్ణి అతని దేహమూ, ఆత్మ, శక్తి - సీమ, శక్తి-హద్దులు, సమస్త రాగద్వేషాలూ- వాటితోసహా స్వీకరిస్తుంది; అందువల్ల మానవుడి భూత, భవిష్యత్, వర్తమానాలతో దీనికి విడదీయరాని సంబంధం మానవవాదం మానవుణ్ణి అంతిమసత్యంగా భావించి, జీవనవికాసంతోపాటు నిరంతర వికాసశీలమై ఉన్నట్లు, రససిద్ధాంతం మానవ సంవేదనను చరమసత్యంగా భావించి, నిరంతరం వికాసశీలమై ఉన్నది. జీవితగమనవిధానం మారినప్పుడల్లా, మానవవాద పరికల్పనలో కూడా మార్పులు వస్తూ ఉంటాయి. సరిగ్గా అదే విధంగా వాఙ్మయగమన విధానాలలో మార్పులు

వచ్చినప్పుడల్లా రసస్వరూపం కూడా వ్యాపకమైపోతూ ఉంటుంది. జీవితంలోని నిరంతర వికాసశీల సిద్ధాంతాలను, అవసరాలను మానవవాదమే ఆకళింపు చేసుకో గలిగినట్లు, సాహిత్యంలోని వికాసశీలచేతనకు కూడా రససిద్ధాంతంవల్లనే పరితుష్టి కలుగుతుంది జీవనభూమికలో మానవతను మించిన మహత్తర సత్యం ఆవిర్భ వించనంతవరకూ, సాహిత్య భూమికలో మానవ సంవేదనను మించిన రమణీయ సత్యం కల్పించబడనంతవరకూ, రససిద్ధాంతాన్ని మించిన మరో ప్రామాణిక మయిన సిద్ధాంత పరికల్పనకూడా జరగదు." (రససిద్ధాంతం : అనువాదం- డా॥ భీమసేన్ 'నిర్మల్'; తెలుగు అకాడమి ప్రచురణ(1985) - పు 389-390.)

ఈ రస సిద్ధాంతాన్ని నవ్య సంప్రదాయవాదులు గతానుగతికమైన అనుసరణగా చేపట్టలేదు. రసం కంటె భావాన్ని, భావావస్థలనీ, స్థాయికంటె మానసోద్వేగ స్థితులనూ ఎక్కువగా మన్నించే భావకవిత్వ లక్ష్యాలనూ, కాల్పనిక కవితా ప్రవృత్తులనూ కాదని పరిపూర్ణ కళానుభవం వైపు సాహిత్యాన్ని పయ నింపజేసే ప్రయత్నంలో చేపట్టిన ఉద్యమం నవ్య సంప్రదాయోద్యమం. సామా జిక తత్త్వ భూమికలను ఆధారంగా చేసుకొని పుట్టి- సాహిత్య స్వభావాన్ని తమలో ప్రతిఫలింప చేసుకొనే నవల, కథానిక మొదలైన ప్రక్రియలు అందుకో లేని రసానుభవస్థితిని మరలా కావ్యరంగంలో పునస్థాపనం చేయాలనే లక్ష్యంతో కాలంలోని అవసరం గుర్తించి ఆవిర్భవించిన సాహిత్యోద్యమం నవ్య సంప్ర దాయం. తెలుగులో ఈ ఉద్యమం కాల్పనికయుగ కవితా ప్రక్రియలయొక్క పరిమిత శక్తియుక్తులపై అసంతృప్తి ప్రకటించిన రససిద్ధాంతవాదులు మానవ కళానందానుభవ సమగ్రమూర్తిమత్వాన్ని ఆవిష్కరింపగల కావ్యకళా ప్రక్రియ లను ఆధునిక దృక్పథంలో వెలువరించటానికి చేసిన విశిష్ట ప్రయత్నం నవ్య సంప్రదాయోదమం. అంతేకాదు. ఈ యుగంలో సాహిత్యంమీద సాగిన వివిధ దండయాత్రలను గుర్తించి వాటినుండి సాహిత్యాన్ని రక్షించటానికీ, వాటిపై తిరుగుదాడిగా ఒక ఉద్యమాన్ని రూపొందించి బలపరచటానికీ నవ్య సంప్రదా యోద్యమం కృషి చేసింది. ఈ సందర్భంలో సాహిత్యం మీదజరిగిన దాడులను గురించి కొంత ప్రస్తావించటం అవసరం.

తెలుగులో నవ్య సంప్రదాయవాదుల భావాలవంటి భావాలను, సాహిత్య సిద్ధాంతాలనూ వెలువరించిన ప్రసిద్ధ పాశ్చాత్య సాహిత్య విమర్శకుడు రెనెవెలెక్

'సాహిత్యంమీద దాడి' (ది ఎటాక్ అన్ లిటరేచర్) అనే వ్యాసం వ్రాశాడు. ఈ శతాబ్దంలో సాహిత్యంమీద దాదాపు నాలుగు విధాలుగా దాడులు జరిగాయని ఆయన విశ్లేషించాడు. వాటిని స్థూలంగా పేర్కొంటే ఇలా ఉంటాయి: 1. రాజకీయ సిద్ధాంతాల ప్రేరణతో సాగిన దాడి. 2. భాష మనిషిలోని లోతైన భావాలనూ, అంతర్దృష్టినీ, విశ్వ రహస్యాలనూ అభివ్యక్తం చేయగలిగిన సామర్థ్యం లేనిదనే వాదం ప్రేరణగా సాగిన దాడి. 3. కవితా సౌందర్య తత్త్వానికి వ్యతిరేకంగా సాగిన దాడి 4 భావప్రసార ప్రక్రియాభేదంగా రూపాన్ని మలచుకొనేదే సాహిత్యం కాబట్టి, ఆధునిక ప్రసార సాధనాలద్వారా రూపొందించే ప్రక్రియా సాహిత్యమని భావించేవారు సాగించే దాడి ఈ నాలుగురకాల దాడులూ సాహిత్యరంగంలో దుమారాలు రేపి, మౌలికమైన సాహిత్యతత్త్వాన్ని దర్శించటానికి అడ్డంకులను సృష్టించి, సాహిత్యవిమర్శ మార్గంలో సంక్షోభాన్ని కలిగించాయని రెనెవెలెక్ భావించాడు. ఆ దాడుల వలన కొన్ని విలువలు నేల కొరిగిపోయాయి. అయినా, సాహిత్యతత్త్వదర్శకుల తిరుగుదాడులు కొన్ని మౌలికమైన విలువలను సంరక్షించ గలిగాయి. ఈ తిరుగుదాడుల ఫలితంగా ఆ దాడులు కొన్ని దుమ్ముకొట్టుకొనిపోయాయి. చివరకు ఆ దాడులు ఏయే ప్రయోజనాలకోసం సాగాయో వాటిని విజయవంతంగా సాధించలేకపోవటమే కాకుండా, చేరుకోవలసిన గమ్యాన్ని, చూపవలసిన వెలుగునూ సమర్థనీయంగా ప్రదర్శింపలేకపోయాయి.

పూర్వయుగాలలో సాహిత్యం పాలకవర్గాల ప్రయోజనాలకు ఊడిగం చేయటానికే ప్రధానంగా సృజింపబడింది. అభివృద్ధి లేదా అభ్యుదయ నిరోధక లక్షణం దాని స్వభావం ఉన్నతవర్గాల ఔన్నత్యాన్ని చిత్రించటమే దాని నైజం. వర్గ విభేద కల్పన, మేధావి వైఖరి, సామాన్య ప్రజలకు అందరాని మ్రాని పండులా ఉండటం అనే లక్షణాలే దాని ఘనత. కాబట్టి, అటువంటి సాహిత్యాన్ని సమూలంగా మట్టుపెట్టాలి. మానవునికి రాజకీయంగా అభివృద్ధి సాధించి, సాంఘికంగా అభ్యుదయాన్ని అందించే సాహిత్యమే ఆధునిక యుగంలో ఉపాదేయం - అనేదే రాజకీయపరంగా సాగే దాడిలోని తాత్పర్యం.

భాషకూ అభివ్యక్తికీ వాస్తవంగా సంబంధం లేదనీ,మనిషిలోని అంతరంగా వస్తులను వ్యక్తంచేసే వాచ్యమైన శక్తి భాషకు లేదనీ అంతరమైన బీభత్సాన్ని

గానీ, సౌందరాన్నిగానీ పదాలు ప్రత్యక్షంగా మోసుకొని రాలేవనీ, శబ్దం కంటే నిశ్శబ్దమే అభివ్యక్తికి సమర్థవంతమైందనీ, ఒకవేళ అంతర్వ్యక్తిని శబ్దం వ్యక్తం చేయటానికి ప్రయత్నించినా అది సమగ్రంగా ప్రాతినిధ్యం వహించేటట్లు రూపొందదనీ, అందువలన శబ్దచిత్రాలనో, భావచిత్రాలనో, ప్రతీకలనో, నాదాలనో ఆశ్రయించి ప్రసరింపవలసి వస్తుందనీ భాషాపరంగా సాహిత్యం మీద దాడిచేసేవారి అభిప్రాయం.

సాహిత్యం ఒక ఉత్తమమైన కళ అనీ, సాహిత్యానుభూతి అలౌకికమనీ భావించే సంప్రదాయం మీద తిరుగుబాటు మూడవది. ఈ తిరుగుబాటు దారులు కళానుభూతికీ, భౌతికానుభూతికీ ఉన్న భేదాన్ని పరిగణించరు సంప్రదాయ వాదుల సౌందర్య దృష్టినీ, సంవిధాన శిల్పాన్నీ, ఆకృతి శిల్పాన్నీ, సంవాద శిల్పాన్నీ, అర్థవిస్పష్టతనూ వీరు విశ్వసించరు. కవితలోని భవ్యకవితావేశం కంటే, భౌతికాంశ విశ్లేషణం వీరిమతంలో ప్రధానం వీరి దృష్టిలో కవితకంటె కవి వేరు; కవితా వస్తువు వేరు; కవితా కళ వేరు.

ఇక నాల్గవదాడి సాంకేతిక దృష్టి ప్రధానమైనది మనం నివసిస్తున్నది ఎలక్ట్రానిక్ యుగంలో. భావప్రసారం లిఖిత సాహిత్యానికే పరిమితమై ఉండే రోజులు గతించాయి. వైజ్ఞానికంగా మనం ఎంతో పురోగతిని సాధించాం. నేటి సాహిత్యం ప్రచారసాధనాల ప్రక్రియలమీద ఆధారపడి ఉంది. జనజీవనంమీద టి.వి. ప్రభావం బలంగా ఉంది. నేటి మానవుడు విద్యుత్కాంతిద్వారా సాహిత్యాన్ని సృష్టిస్తున్నాడు, దర్శిస్తున్నాడు, పఠిస్తున్నాడు, పదిలపరచుకొంటున్నాడు. ప్రసరణమే నేటి సాహిత్యజీవితం. ఇంతకంటె సాహిత్యప్రమాణం మరొకటి ఉండబోదు - అనేది ఈ వాద తాత్పర్యం.

ఈ వాదాలన్నింటిలోనూ సర్వసామాన్యంగా కనపడే కొన్ని అంశాలున్నాయి సాహిత్యానికి సౌందర్యతత్త్వపరంగా కానీ, శాస్త్రపాండిత్యపరంగా కానీ ఉండే నాణ్యతను ప్రమాణంగా అంగీకరించకపోవటం వీటిల్లో వినపడే సామాన్య ధర్మం. అయితే, ఆధునిక యుగచైతన్యాన్ని దృష్టిలో పెట్టుకొని తమ తమ దృక్పథాల కనుగుణంగా సాహిత్యాన్ని నిర్వచించుకోవటానికి అవి యత్నించాయి. అందులోనూ నిత్యవ్యవహారంలో ఉండే అభివ్యక్తికీ, సాహి

త్యంలో కనపడే అభివ్యక్తికి కొంత భేదం ఉండకతప్పదని గుర్తించాయి. కాని, సాహిత్య ప్రమాణాలను నిర్దేశించటంలో మాత్రం నూతన మార్గాలను అన్వేషించాయి. క్రొత్త పరికరాలనూ, పద్ధతులనూ నిర్దేశించాయి.

ఈ దాడులన్నీ సామూహికంగా సాహిత్య ప్రక్రియలన్నింటిమీద లక్షింపబడ్డాయి. సాహిత్యంలో ఇతిహాసాలున్నాయి, పురాణాలున్నాయి, భావకవిత్వ ప్రక్రియలున్నాయి, రూపకవిశేషాలున్నాయి. నవల, కథానిక వంటి వచన ప్రక్రియలున్నాయి, విమర్శ వంటి వివేచన పద్ధతులున్నాయి, జానపద సాహిత్యంలోని మౌఖిక ప్రక్రియల సముదాయాలున్నాయి. వీటన్నింటికీ ఆయా ప్రక్రియా స్వరూప స్వభావాలనుబట్టి ప్రమాణాలు భేదిస్తూ ఉంటాయి. వీటన్నిటిలో కవిత్వానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. దానికి సౌందర్యతత్త్వానికి అవినాభావ సంబంధం ఉంది. కవితాప్రక్రియలనూ, తదితర ప్రక్రియలనూ సమాంతరంగా భావించి అభివ్యక్తిలో సామ్యాన్ని కోరటం కళాత్మకమైన విలువలను కల్లోలం చేయటమే అవుతుంది. రాజకీయ ప్రమేయంతో సాగే దాడి ప్రక్రియలోని విషయానికి, భావజాలానికి ఇచ్చిన విలువ, దాని విశ్వజనీనమైన కళాత్మకశక్తికి ఇవ్వటం లేదు ప్రబోధానికి, ప్రచారానికి యిచ్చిన గౌరవం కళాభివ్యక్తికి ఇవ్వటంలేదు కవితకు గాని, కళాప్రక్రియలకు గాని రాజకీయ, సామాజిక, ఆర్థికశాస్త్ర ప్రమాణాలు విలువలను నిర్ధారించే నికషోపలాలు కాజాలవు భాషకు అభివ్యక్తి లేదనటం పరిహాసాస్పదం.

అయితే, వాచ్యంగా చెప్పటం కళాస్వభావం కాదు. అది కళారాహిత్య చిహ్నం. కళాభివ్యక్తికి సృజనాత్మకశక్తి ముఖ్యం శబ్దం అర్థ సమర్పణలో వ్యంగ్యశక్తిని ప్రదర్శిస్తుంది, భాషకు కళ జీవనధర్మం. వాచ్యమైన వాక్కును కళావాహినిగా భావిస్తే, భాష బలహీనంగానే కనపడుతుంది. భావప్రతీకగా, అనుభూతికి ఆలంబనంగా భాషను దర్శించినప్పుడే కళాజగత్తులో భాష ఆస్వాద మధురంగా అందగిస్తుంది. సాహిత్యంలో రచయిత తన దర్శనాన్ని సృజిస్తాడు; తన భావాలకు అభివ్యక్తి కల్పిస్తాడు; తన ఆశలను, ఆశయాలను కళాత్మకంగా ప్రసారం చేస్తాడు. కవి కవితను ప్రజలకోసం చెపుతున్నా, వారికి అందుబాటులో

ఉండే భాషను గ్రహిస్తున్నా, దానిని కళగా ఆవిష్కరిస్తాడు. ఆ కళా గౌరవం లేకపోతే కవితకూ, ప్రచారానికీ, పత్రికా రచనలకూ, ప్రకటన పద్ధతులకూ తేడా లేకుండా పోతుంది. ప్రచార సాధనాలే సాహిత్య ప్రతిపత్తికి ప్రమాణాలని భావిస్తే, సాహిత్య ప్రమాణాలకే స్వస్తి చెప్పే తరుణం ఆసన్నమవుతుంది. సాహిత్యం సమాజానికి రాజకీయ విద్యను బోధించటానికి ఉపకరణంగా కానీ, ప్రజలలో కొన్ని సిద్ధాంతాల ప్రచారానికి సాధనంగా గానీ భావించేవారి మాట అటుంచి, సాహిత్యాన్ని ఒక కళగా సమాదరించే సహృదయ జగత్తు మాత్రం సౌందర్య తత్త్వాన్ని సాహిత్య ధర్మంగా సమ్మానిస్తుంది.

నవ్యసంప్రదాయవాదులు ఆశించింది సాహిత్యాన్ని కళగా దర్శింపగల సౌందర్య దృష్టి, దాన్ని అనుశీలించి అనుభవింపగల ప్రామాణిక ప్రవృత్తి. వీటిని విశ్వజనీనంగా వినిర్మించుకోగలిగినప్పుడు ఈ నాలుగు దాడులలోని దౌర్బల్యం స్పష్టమవుతుంది. అప్పుడు - రాజకీయ దృక్పథం సాహిత్యంలోని మౌలికాంశాలను మూలమట్టం చేయలేదు. భాషావాదం సాహిత్యంలోని కళాభివ్యక్తిని నిర్వీర్యం చేయలేదు. సౌందర్యతత్త్వ వివేకవాదం మానవకళానుభూతిని మరుగుపరచలేదు. ప్రచార సాధనాల సాంకేతికవాదం ప్రసారంకంటె ప్రధానమైన సాహిత్య కళావ్యక్తిత్వాన్ని సంకుచింపజేయలేదు. ఇటువంటి దాడులు సాహిత్య రూపాన్ని వంచగలవే కాని, సాహిత్య తత్త్వాన్ని త్రుంచలేవు - అని నవ్యసంప్రదాయవాదం నిరూపించింది.

నవ్యసంప్రదాయోద్యమం ప్రారంభించిన కవులు, రచయితలు సంస్కృతాంధ్ర భాషాసాహిత్యాలలోనే కాక దేశీయ భాషాసాహిత్యాలతోనూ, ఇంగ్లీషు భాషాసాహిత్యాలద్వారా ప్రపంచ సాహిత్యాలతోనూ, సాహిత్యోద్యమాలతోనూ పరిచయమున్నవారే. అంతేకాదు, విశ్వ సాహిత్యాలలోని క్రొత్తక్రొత్త సాహిత్య సిద్ధాంతాలను మన భారతీయ తత్త్వశాస్త్రం, కళాశాస్త్రం ఎలా ప్రభావితం చేస్తున్నాయో గమనించినవారు కూడా. ఉదాహరణకు - టి. యస్. ఎలియట్ మీద ఉపనిషత్తుల ప్రభావం ఉందని గుర్తించారు. ఇరవయ్యో శతాబ్దిలో పాశ్చాత్య సాహిత్య ప్రవర్తకులలో పేరెన్నికగన్నవారందరిమీదా భారతీయ కళా తత్త్వ ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కనపడుతుంది. ఆనందవర్ధనుడు అభినవగుప్తుడు, పాణిని, శంకరులు, వివేకానందుడు, రవీంద్రుడు, మహాత్మా గాంధీ

మొదలైనవారి ప్రభావం పాశ్చాత్య రచయితల ఆలోచనా పద్ధతులలోనూ, భావ జాలంలోనూ, కళా సిద్ధాంతాలలోనూ, కవితా ప్రయోగాలలోనూ మనవారు చూడగలిగారు. తెలుగు రచయితలకు దానివలన భారతీయ దర్శనంమీద ఒక విశ్వాసం ఏర్పడింది; తమ వ్యక్తిత్వం మీద ఒక గట్టి నమ్మకంతో కూడిన గౌరవభావం తమకే ఏర్పడింది. 'నేను భారతీయుణ్ణి, నా దర్శనం ఏ పాశ్చాత్య దర్శనాలకూ తీసిపోదు; ఎక్కడ మంచి కనపడ్డా దానిని మన్నించి తనలో విలీనం చేసుకొని అభినవస్ఫూర్తితో ప్రగతి పథంలో పయనించే భారతీయ తత్త్వం - ఓసికొనటమే కాదు ఘనంగా ఇవ్వగల'దనే ధీమా వచ్చింది. అయితే, నవ్యసంప్రదాయోద్యమ రచయితలు మౌలికంగా శాంతిప్రియులు. వీరు విప్ల వించరు. దృఢ విశ్వాసంతో ధీరుల్లాగా, స్వాతంత్ర్య వీరుల్లాగా, సత్యాగ్రహ శూరుల్లాగా ప్రయోగాలు చేసి, ఆచరణద్వారా తమ ఆశయాన్ని వ్యక్తీకరించు కొంటారు. ఈ ప్రవృత్తి భారతీయులకు తరతరాలుగా వచ్చే సంస్కార వైభవ మైనప్పటికీ, ఆనాడు గాంధీ నాయకత్వంలో సాగుతున్న స్వాతంత్ర్యోద్యమం వారిని ఆ రకంగా విశేషించి తీర్చి దిద్దింది.

ఆ కాలంలోనూ రాజకీయాలు ఉన్నాయి; వివిధ దృక్పథాలు ఉన్నాయి. రాజకీయ నాయకుల ప్రభావం సమాజం మీద బలంగా గోచరిస్తుంది. కాని, స్వాతంత్ర్యోద్యమ కాలంలో రాజకీయ నాయకులు సాహిత్యం మీద దాడి చేయ లేదు మార్క్సిస్టుల్లాగా. భారత రాజకీయ నాయకులకు సాహిత్యం ఒక స్వతంత్ర ప్రతిపత్తి గలిగిన సాంస్కృతిక వ్యవస్థ. కవిని నియంత్రించే రాజకీయ కళా శాలలు నడపరు. కవులు ఎన్నుకోబడని శాసన సభ్యుల లాంటివారు. వారు స్వతంత్రులుగా సాహిత్యాన్ని సృజించుకొనవచ్చు. అయితే, అవి జాతీయ జీవన గౌరవాన్ని, సాంస్కృతిక సౌరభాన్ని, దేశసమైక్యతనూ, భిన్నత్వంలో ఏకత్వంగా భాసించే భారతీయాత్మను విచ్ఛిన్నం చేసేవి కాకూడదని మాత్రమే ఆశించేవారు. దేశ భద్రతకు ముప్పువాటిల్లే సాహిత్యాన్ని నిరసించేవారు. ఈ రకం రాజకీయ వాదులు సాహిత్య చరిత్రతో మార్క్సిస్టు రాజకీయ వాదుల వలె జోక్యం కలిగించుకోరు. అందువలన, నవ్యసంప్రదాయ వాదులకు రాజ

కీయాల గొడుగు నీడలు లేని సాహితీరంగం స్వేచ్ఛగా విహరించటానికి దొరికింది. విశ్వమంతా వ్యాపించి ఉన్న వివిధ సాహిత్య తత్త్వాలు వారికి అందుబాటులోకి వచ్చాయి. వివిధ వాదాలు విని తమ పాత్రను నిర్వహించే అవకాశం లభించింది. కవులు ఉద్యమించారు. స్వాతంత్ర్యం వారి హక్కు; సాహిత్యం మీది దాడులను సహనంతో ఓర్చుకొన్నా, అదను చూచి ఆత్మశక్తితో తిప్పికొట్టి, దాడి చేసిన వారిని పొలిమేరలు దాటి పారిపోయేటట్లు చేయగల కార్యశక్తి స్వాతంత్ర్యయోధులకులాగానే నవ్య సంప్రదాయ రచయితలకు ఉంది. అదే వారికి శ్రీరామరక్ష!

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 21-1-1990)

# ఇంగ్లీషు విశ్వనాథ : తెలుగు ఎలియట్

నవ్య సంప్రదాయోద్యమ ఆరంభ వికాసాలను మరింత లోతుగా తెలుసుకోవాలంటే ఆ కాలంలో వచ్చిన పాశ్చాత్యసాహిత్యోద్యమాలనుకూడా అధ్యయనం చేయవలసి వస్తుంది. నవ్య సంప్రదాయోద్యమం దాదాపు 1933 - 35 సంవత్సరాలలో ఆరంభమైనట్లు స్పష్టం. ఈ సంవత్సరాల్లోనే 20 శతాబ్దిని బలంగా ప్రభావితం చేసిన మహాకవి, నాటక కర్త, విమర్శకుడు అయిన టి.యస్.ఎలియట్ వ్రాసిన సాహిత్యం వెలువడటం ప్రారంభించింది. క్రొత్త శకం రూపొందటం మొదలయ్యింది. 1933 లో 'ది యూజ్ అఫ్ పొయెట్రీ అండ్ ది యూజ్ అఫ్ క్రిటిసిజమ్' అనే వ్యాస సంపుటి వెలువడింది. అదే సమయంలో తెలుగులో రామాయణ కల్పవృక్షం రచన ప్రారంభమైంది. ఇది కాకతాళీయన్యాయంగా పైకి అనిపించినా, కాలస్వరూప తత్త్వ విచారంలో క్రొత్త పుంతలు చూపించిన ఆ యిరువురు రచయితలు కాలతత్త్వం నుండి పుట్టినవారే. వారి ఉద్యమాలు యుగోచిత సాహిత్య ప్రస్థానాలే!

విశ్వనాథ సత్యనారాయణగారిని ఎలియట్‌తో పోల్చి చెప్పటం, వారిరువురి అభిప్రాయాలలో, దృక్పథాలలో ఉన్న సామ్యభేదాలను పరిశీలించటం తెలుగు విమర్శలో గోచరిస్తుంది. ఉదాహరణకు 'బ్రాహ్మీమయమూర్తి'లో డా॥ ముదివేడు ప్రభాకరరావుగారి మాటలు గమనిద్దాం—

"మహాకావ్యాన్ని గూర్చి ఎలియట్ నిర్వచనం ఎంత సమన్వయపూర్వకంగా, విశ్వజనీనంగా ఉన్నదో చూడండి: 'ఒకదేశపు నాగరికత పరిపాకం చెందినప్పుడు, కవి మనస్సు పరిపక్వం చెందినప్పుడు మహాకావ్యం అవతరిస్తుంది.' 'పరిపాకం' అంటే ఏమిటో పరిపాకం చెందనివారికి తెలియచెప్పటం సాధ్యం కాదు. మనం ఎదిగి పరిపక్వత కలిగివుంటే ఆ లక్షణాన్ని వెంటనే గుర్తిస్తాము. పరిపక్వమైన భాషతోపాటు పరిపక్వమైన వేషభాషలు, చేష్టలు, అలవాట్లు కూడా వుండాలి. ప్రజలలో వర్తమానం పట్ల విశ్వాసం కుదుర్చుకోవాలి. భవిష్యత్తును గురించి అనుమానాలు కూడదు కవికి పూర్వకవులను గూర్చి తెలిసి వుండాలి.

అతని వెనుకనున్న సంప్రదాయంతో మనకు పరిచయం వుండాలి ప్రజామోదం పొందిన శైలిలో ఆయువుపట్లు కవి స్వంతం చేసుకోవాలి. సిద్ధమైన మనస్సు వుండాలంటే చరిత్ర, దాన్ని గూర్చి జిజ్ఞాస మాత్రమే కాకుండా మరొక దేశపు నాగరకత, చరిత్రలను గూర్చిన పరిజ్ఞానం సంపాదించాలి. ప్రాంతీయ భావం నశించి విశాల దృక్పథం అలవడటానికి ఈ రకంగా ఎదిగిన ప్రజ్ఞ కావాలి. ప్రజామోదం పొందినశైలి అంటే అట్లాంటి శైలి తటస్థపడగానే 'ఇది ప్రతిభాశాలి వాడిన భాష' అని ఆశ్చర్యం ప్రకటించక, 'ఇది ఈ భాషలోని ప్రతిభను పూర్తిగా వ్యక్తం చేసింది' అనగలగాలి" (What is Classic - T.S. Eliot - నన్ను మార్చిన పుస్తకం - బుచ్చిబాబు).

"విశ్వనాథ మహాకావ్యాన్ని ఏ దృష్టితో చూస్తారో ఆయన మాటల్లోనే విందాం. 'కావ్యము శిల్పముతో కూడినది. శిల్పశక్తి తగ్గని యే కావ్యమైన పరి గ్రాహ్యమే యగును. పాశ్చాత్య మహా కావ్యములు శిల్పభూమ లగుటచేతనే యచ్చటి మత సంప్రదాయాది విషయములు మనవి కాకపోయినను వానిని బరి గ్రహించుచున్నాము. రచయితల కాశిల్పబుద్ధి తగ్గనిచో కావ్యము కావ్యమగును. శిల్ప మక్షరము నొద్దనుండి కావ్యమహార్థాంత మనుస్యూతమైన విషయము. ప్రపంచమెంత యనంతమైనదో, ఎంత వివిధమైనదో కవితావిద్య యంత యనంతమైనది, యంత వివిధమైనది." (సారస్వత మహాసభ-అధ్యక్షోపన్యాసం- ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సం. 45.)

"మానసిక శాస్త్రం పెంపొంది ఫ్రాయిడ్ సిద్ధాంతాలు ప్రచారంలోకిరాగానే చాలమంది విమర్శకులు రచయిత జీవిత విశేషాలు బైటపెట్టి ఆ పరిశోధన ఫలితంగా బైటపడ్డ విషయాలను పురస్కరించుకొని అతని రచనలను పరామర్శిం చడం, విలువ కట్టడం జరుగుతున్న రోజుల్లో కావ్యానందం అనుభవించడానికి కవి జీవిత విశేషాలు ముఖ్యం కావని ధైర్యంగా చెప్పగలిగాడు ఎలియట్."

"సరిగ్గా విశ్వనాథ కూడా 'పంచశతి'లో పై అభిప్రాయాన్నే వ్యక్తీక రించారు. కవి సర్వమూ భావనావధిగ చూస్తాడు. 'అల్పులంబోలె బ్రతుకులో ననుభవించె ననుకొనుట వట్టి పామరమైన యూహ' అన్నారు."

"ఎలియట్ మానవతావాదం (Humanism) అనేది పూర్తిగా సఫలంకాని ఒక ఉద్యమం అని పేర్కొన్నారు. అలాగే ప్రపంచ సంస్కృతి (World

Culture) స్థాపిస్తామనడం కూడా అసంభవం అన్నారు. విశ్వనాథ వేయిపడగల్లో స్వర్గానికి నిచ్చెన మొదలైన నవలల్లో యిలాంటి వాదాలను ఖండించి వున్నారు."

"Life as a whole అనే మాట ఎలియట్ మహాకవి యొక్క సంపూర్ణ మానవ జీవిత దర్శనానికి సాక్ష్యంగా నిలుస్తోంది. అది భారతీయ జీవన దర్శనం. ధర్మార్థకామమోక్షాలు ఆ సంపూర్ణత్వాన్ని సాధించే నాల్గు సమాన పాదాలు. విశ్వనాథ ఈ సంపూర్ణజీవితాన్నే తమ వేయిపడగల్లో, కల్పవృక్షంలో చిత్రీకరించారు. అంతేకాదు, ఆయన గేయాలు మొదలుకొని మహాకావ్యందాకా అనుస్యూతంగా సంపూర్ణ మానవజీవిత వ్యాఖ్యానమే చేయబడింది. అందుకే ఆయన మానవజీవిత భాష్యకారుడు."

"విశ్వనాథ Glory - వైభవాన్ని మాత్రమే చెబుతారనీ, 'సనాతనవాది' అనీ, అది ఈనాడు ఎలా ఉపయోగపడుతుందనీ ఆధునికులు ప్రశ్నిస్తున్నారు. ఎన్ని యుగాలు గడిచినా, ఎన్ని నాగరికతలు మారినా, నిత్యమై ప్రముఖంగా నిలిచేది మానవ స్వభావమే నన్నాం. సరిగ్గా టి. యస్. ఎలియట్‌పై కూడ యిలాంటి విమర్శనే చేయబడింది. ఎలియట్ గత కాలంలో తలదాచుకొనేవాడని వాళ్ళు చెప్పటానికి కారణం ఎలియట్టే తాను ఒకచోట చెప్పినమాటలే. అవి యిలా వున్నాయి: 'సాహిత్యంలో నాది సాంప్రదాయకమైన మార్గం. రాజకీయంలో రాజపక్షావలంబిని; మతంలో రోమన్ కాథలిక్కుని.' ఈ మాటలు ఆధునిక కాలానికి ఎదురీతగా తోచింది విమర్శకులకు."

"ఇక విశ్వనాథపై శ్రీశ్రీ చెప్పినమాటలు గమనించండి: 'పురోగమనమా? పశ్చాద్గమనమా? అనే విషయం ఆలోచించాలి. ఇంగ్లండులో టి యస్. ఎలియట్‌ను మహాకవులలో ఒకడని అందరూ అంగీకరిస్తారు. కాని, అతని దృక్పథం మాత్రం అభ్యుదయ నిరోధకం. మన విశ్వనాథ సత్యనారాయణ గారున్నారు. ఆయనా అంతే. గ్రీకు, రోమన్ కాలాల సంస్కృతి ఎలియట్‌ను ఆకర్షించినట్టే, రామాయణ భారత కాలాల వైభవం విశ్వనాథవారిని ముగ్ధుల్ని చేస్తుంది. ఆవేళకి ఈవేళకి మానవజాతి చాల ముందంజ వేసిందంటే యిద్దరూ ఒప్పుకోరనుకుంటాను. ఇందుకు నిదర్శనంగా ఈ కాలపు మానసికాందోళనలను వేలెత్తి చూపిస్తాను.' (వ్యాసక్రీడలు.)

"ఇంకొకచోట యిలా అన్నారు శ్రీశ్రీ : 'ఈనాడు శ్రీనాథుడంతటి వాడైన విశ్వనాథ సత్యనారాయణని నేను ఎంత గౌరవిస్తానో నీకు తెలియదూ? వీలయితే యీ ప్రపంచాన్ని వెయ్యేళ్ళు వెనక్కు తీసుకుపోదామని విశ్వనాథ ప్రయత్నిస్తాడు. నా కత నెప్పుడూ నన్నయభట్టు లాగా కనబడ్డానికి కారణం యిదే."

"సంప్రదాయమంటే సమన్వయం అని తెలియనివారికి విశ్వనాథ సంప్రదాయ మంటే ఏమిటో తెలియటం కష్టం. 'ఆయన ఎంతటి సనాతనుడో అంతటి ఆధునికుడు' అన్నవారూ ఈనాడు ఉన్నారు. మరి పైఅపప్రథకు కారణమేమిటో తెలియదు ........ ఎలియట్ అభివృద్ధి నిరోధకుడనే దుష్ప్రచారం లేవదీసిన వారికి ప్రముఖ విమర్శకుడు ఐ.ఏ. రిచర్డ్సు ఇచ్చిన సమాధానం చూడండి: 'Mr. Eliot is neither sighing after vanished grlories nor holding contemporary experience upto scorn. Both bitterness and desolation are superficial aspects of his poetry." పై రిచర్డ్సు వాక్యాన్ని చదివి, శ్రీశ్రీ ఎలియట్‌నుగూర్చి చెప్పిన గ్రీకు, రోమన్ కాలాల వైభవం, విశ్వనాథను గూర్చి చెప్పిన రామాయణ మహాభారత కాలాల వైభవం అనే మాటలను గూర్చి ఆలోచిస్తే శ్రీశ్రీగారి వాదం ఎగిరిపోతుంది. రిచర్డ్సు 'వైభవం' అనే మాటకు 'Glory' అనే మాటను సరిగ్గా వాడాడు. ఎలియట్, విశ్వనాథ ఒకే మూసలోని వారని చెప్పినప్పుడు రిచర్డ్సు చెప్పిన మాటలు యిద్దరికీ అన్వర్తిస్తాయి."

"షేక్స్‌పియర్ ఇంగ్లండులో కామెడీ అఫ్ ఎర్రర్స్, ట్వెల్త్ నైట్ వంటి నాటకాలు వ్రాయగా అదేకాలంలో తెలుగుదేశంలో పింగళి సూరన కళాపూర్ణోదయాన్ని రచించాడు. ఆధునికయుగంలో అమెరికాలో 'వేస్ట్‌ల్యాండ్' పుట్టితే, తెలుగుదేశంలో 'వేయిపడగలు' తలెత్తింది."

"వేస్ట్‌ల్యాండ్ కావ్యధ్యేయం సత్యాన్వేషణే. వేస్ట్‌ల్యాండ్ కావ్య వస్తువులోను, సత్యాన్వేషణలోను బృహదారణ్యకోపనిషత్తుకు దగ్గరగా వుంటుంది. ఈ జీవితానికి తరణోపాయం ఉపనిషద్వాక్యమే. ఆ జీవనసూత్రాన్ని లోకం శిరసావహించినప్పుడే విముక్తి. దత్త, దయధ్వం, దమ్యత- దాతృత్వం, సానుభూతి, సంయమనం- జీవితానికి అర్థాన్ని కల్పిస్తాయి. శాంతిః శాంతిః శాంతిః - అనే శాంతిపాదంతో ముగుస్తుంది కావ్యం."

"ఫోర్ క్వార్టెర్స్ అనే మరో కావ్యంలో ఎలియట్ ఈ జీవితానికి తరణో పాయం కృష్ణుడు గీతలో చెప్పిన నిష్కామకర్మ అని వివరిస్తాడు గతంతో సమన్వయం కుదుర్చుకోవడానికి సాగించిన నాలుగు యాత్రల కథనం ఇందలి వస్తువు. విశ్వనాథ వ్రాసిన 'ఆరు నదులు' అనే నవలతో దీనిని పోల్చవచ్చు."

"చిందరవందరైన నిత్యజీవితంలోనే గీతా సత్యాన్ని ఉపనిషత్ పురుషార్థాన్ని చూపించిన మహాకవి ఎలియట్. అందుకనే విశ్వనాథవారు ఎలియట్‌ని 'మహర్షి' అన్నారు."

"ఎలియట్ సాహితీ సృష్టి అంతటిలోనూ అంతర్గతంగా అనుస్యూతంగా చెప్పబడ్డ విషయం ఒక్కటే. అది మానవ స్వభావాన్ని ఏకత్రితం చేయడం, ఇది బాహ్యదృష్టికి తెలియదు. ఎలియట్ జీర్ణమై శీర్ణమై శిథిలమైపోయిన గత వైభవాన్ని తలచుకొని నిట్టూర్పులు పుచ్చడం లేదు. అలాకాక సమకాలిక జీవితానుభవాలను హేళనగా చూడటంలేదు. తిరస్కార పురస్కారాలు రెండూ అతని కవితాదృష్టికి బాహ్యమైన విషయాలే. అంటే ఏమిటి? కవిది సమదర్శనం. తుల్యదృష్టి. ఈ మాటలు విశ్వనాథ చెప్పిన 'ఉర్విలోన మహాకవి యోగి వంటి వాడు' అనే మాటలతో సంవదిస్తోంది." (బ్రాహ్మీమయమూర్తి- పు. 167-175)

ప్రభాకరరావుగారి మాటలను విరివిగా తీసుకొన్నందుకు వారికి కృతజ్ఞతలు. ఈ మాటలు తెలుగులో నవ్య సంప్రదాయ ప్రవర్తకుడైన విశ్వనాథ పాశ్చాత్య దేశాల్లో సాహిత్యోద్యమాలు నిర్వహిస్తున్న ఎలియట్‌వంటి మహావ్యక్తుల అభిప్రాయాలతో సమానమైన అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ కలిగి ఉన్నారన్న విషయం సాహిత్యక్షేత్రంలో స్థిరీకరింపబడిందని ఋజువు చేస్తున్నాయి.

విశ్వనాథది భారతీయ దృక్పథమే అంటే, పాశ్చాత్య భావాలకు తలుపులు మూసుకొన్నది కాదు. ఎలియట్‌నుండి న్యూక్రిటిక్స్‌వరకూ వెలసిన సాహిత్య విమర్శ సిద్ధాంతాలనూ, అనుశీలన సూత్రాలనూ విశ్వనాథ విశ్వజనీన దృక్పథంతోనే సమీక్షించి మన సాహిత్యానికి కావలసిన అభినవ దృక్పథాన్ని రూపొందించుకొన్నారు. ఆధునికయుగం ఎలియట్‌తో అవిష్కృతమైంది. సంప్రదాయాన్ని గురించి, కవితా దృక్పథాన్ని గురించి క్రొత్త సమన్వయాలు ఆయన ప్రతిపాదించాడు. ఎలియట్ దృక్పథాన్ని కూడా ఇంగ్లీషులో నియో. క్లాసిసిజం

అని పిలిచేవారు కొందరున్నారు. విశ్వనాథ సాగించింది ఎలియట్‌వంటి సాహిత్యోద్యమమే.

కవీ, విమర్శకుడూ ఒక అవిచ్ఛిన్న సంప్రదాయధారలో ముందుకు సాగిపోతుంటారు. సంప్రదాయం స్థిరమైన జడపదార్థంకాదు. గతిశీలం దాని లక్షణం. గతంలోని మంచి మారుతున్న వర్తమానంలోకి ప్రవహిస్తుంది. సంప్రదాయం వంశపారంపర్యంగా వచ్చే లక్షణం కాదు. ఎప్పటికప్పుడు పరిశ్రమతో సాధించి అలవరచుకొనేది. సంప్రదాయావగాహనకు చారిత్రక పరిజ్ఞానం అవసరం. అయితే, ఆ పరిజ్ఞానం గతాన్ని త్రవ్వుకొంటూ కూర్చుండేది కాదు. పరంపరగా వస్తున్న చరిత్ర ప్రవాహంలో వర్తమానంలోని క్రొత్తదనంతో గతంలోని విలువలను వివేచించి సమన్వయించుకొంటూ వర్తమానంలోని విలువలను సరిదిద్దుకొంటూ సాగే సాహిత్య చైతన్యానికి విజ్ఞానాన్నిచ్చే విజ్ఞానపీఠి. "This historical sense which is a sense of the timeless as well as of the temporal and of the timeless and of the temporal together, is what makes a writer traditional And it is at the same time what makes the writer most acutely conscious of his place in time, of his own contemporaneity" అని అంటాడు ఎలియట్.

ఒక నవ్యకృతి సాహిత్యంలో వెలసిందంటే చరిత్రలో వస్తున్నక్రమం కొద్దిగానైనా మారుతుంది. అంటే, గతాన్ని వర్తమానం మారుస్తుంది; గతం వర్తమానంలో ప్రవహిస్తుంది. ఆ వరుసలో ఆ కృతిని అనుశీలించాలి కాని, దానిని ప్రత్యేకంగా పరిశీలించటం కుదరదు. దానివలన కలిగే అభినవాభిరుచులను ప్రాతవాటితో పోల్చి సంవదించుకొని చరిత్రగతిలో వాటి విలువలను వివేచించాలి. అందువలన తులనాత్మక ప్రవృత్తి, వివేచనాత్మకశీలం విమర్శకు ముఖ్య లక్షణాలంటాడు ఎలియట్. ఈ రెండు లక్షణాలతో చేసే విమర్శ గతాన్ని వినూత్నంగా వ్యాఖ్యానిస్తుంది వర్తమానాని కొక నియతితో కూడిన గతిని ప్రసాదిస్తుంది. గతానికీ వర్తమానానికీ మధ్య జరిగే ధ్రువీకరణమే సంప్రదాయం. నవ్యసంప్రదాయవాదులు సంప్రదాయాన్ని ఎలియట్‌లాగా సమన్వయిస్తారు.

టి. యస్. ఎలియట్ పాశ్చాత్య విమర్శకు 'ఇంపెర్సనాలిటీ', 'ఆబ్జెక్టివ్ కో రిలేటివ్', 'యూనిఫైడ్ సెన్సిబిలిటీ' మొదలైన పారిభాషిక పదాలను, విమర్శ సాధనాలను వినూత్నంగా కల్పించి ఇచ్చారు. విశ్వనాథ శిల్ప విమర్శ పద్ధతిని తెలుగులో ప్రపంచింప చేశారు. 'ప్రసన్న కథా కలితార్థయుక్తి', 'అభిజ్ఞానత', 'అల్లిక జిగిబిగి', 'కరుణ రసం' మొదలైనవాటికి అభినవ సమన్వయాలను సమర్పించారు. కథైక్యానికి బదులు ఏకవాక్యతను పరిచయం చేశారు.

ఇలా ఇద్దరూ యుగకర్తలే. మహాకవులు, నాటకకర్తలు, విమర్శకులు, దార్శనికులు. ఎలియట్ మీద భారతీయ ప్రభావం ఉంది. అందువలన అతని భావన విశ్వనాథకు సజాతీయ ధోరణిగా సమకూరింది. ఇద్దరూ కాలంలో ఒకేసారి విజృంభించారు. సంప్రదాయానికే ఒక క్రొత్తబాట చూపించారు.

ఇద్దరూ కాల్పనికోద్యమానికి ఎదురు తిరిగారు. ఇరువురి దృష్టిలోనూ కాల్పనిక కవిత్వానికి, క్లాసిక్ కవిత్వానికి నడుమ భేదాన్ని ఇలా భావించారు - "That between the complete and fragmentary, the adult and the mature, the orderly and chaotic."

ఎలియట్ తన విమర్శలో కవిత్వ సంబంధులైన మౌలికాంశాల నన్నింటినీ వివేచించాడు. విమర్శ కొరకు నిర్దుష్టమైన పద్ధతి ఉండాలనీ, అనుశీలనంలో శాస్త్ర సమ్మతమైన సరణి నెలకొల్పబడాలనీ ప్రబోధించాడు. విశ్వనాథవారు కూడా విమర్శ నొక దర్శనంగా భావించారు. విశ్వనాథ లాక్షణిక గ్రంథ సూత్రాలను కొలబద్దలుగా పెట్టుకొని విమర్శ సాగించలేదు. పాశ్చాత్య విమర్శలోని మేలిమిని భారతీయ దృక్పథంతో మేళవించి వివేకంతో విమర్శ సూత్రాలను నిర్మించుకొని ప్రాచీన సాహిత్యాన్ని ఆధునికంగా విమర్శించారు. వేదంవారి విమర్శనూ విశ్వనాథవారి విమర్శనూ తులనాత్మకంగా సమీక్షిస్తే ఈ సత్యం బోధపడుతుంది.

ఆధునికయుగంలో అభినవంగా సంప్రదాయాన్ని సాహిత్యంలో స్థాపించిన యుగపురుషులలో ఒకరు ఇంగ్లీషు విశ్వనాథ; మరొకరు తెలుగు ఎలియట్.

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు:
ఆదివారం ఆంధ్రప్రభ. 28-1-1990)

# 'రసము వేయిరెట్లు గొప్పది'

తెలుగులో కాల్పనిక కవితా చైతన్యం సాహిత్య ప్రక్రియ లన్నింటిని ఉత్తేజితం చేసిన కాలంలో పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలను, ప్రయోగ నైపుణ్యాలను మనవారు గ్రహించటం ఎక్కువగా కనపడుతుంది. అంటే, పాశ్చాత్య సాహిత్య చైతన్యం ప్రాచ్యం వైపు ప్రసరించటం ప్రస్ఫుటంగా గోచరించేది. నవ్యసంప్రదాయ కవితా చైతన్యం తలయెత్తి తన అస్తిత్వాన్ని, ఉద్యమస్ఫూర్తిని ప్రకటించేనాటికి భారతీయ తాత్త్విక సాహిత్య దృక్పథాల ప్రభావం పాశ్చాత్య కవులమీదా, రచయితలమీదా, విమర్శకులమీదా కనపడటం మొదలైంది. సాహిత్య సమస్యలకు భారతీయాలంకారికులు చూపిన మార్గాలే, పరిష్కారాలే పరిపక్వాలనీ, పరిపూర్ణాలనీ భావించటం జరుగుతోంది. సాహిత్యానికి సామాజిక, మానసిక, తాత్త్విక సూత్రాలకంటె సాహిత్యదార్శనిక పద్ధతులే సరియైన ప్రమాణాలుగా నిలువగలవని భావించే తరం మార్క్సిస్టు పద్ధతికి ప్రతిగా ప్రపంచమంతటా తన ప్రత్యేకతను ప్రకటిస్తూ భారతీయ దృక్పథాన్ని తనకు పోషకంగా, ప్రాపకంగా ప్రకటించుకోవటం, ఉద్యమస్ఫూర్తితో ముందుకు సాగటం స్పష్టమౌతోంది.

'ధ్వన్యాలోక' సంస్థ దర్శకులు శ్రీ సి. డి. నరసింహయ్యగారు నవ్య సంప్రదాయ వాదులలో ప్రసిద్ధులు వారు టి. యస్. ఎలియట్ విమర్శలో భారతీయాలంకారిక పరిభాషలకు సమాంతరంగా గోచరించే కొన్ని అంశాలను పేర్కొన్నారు.

1. "His difinition of the function of criticism as 'the common pursuit of true judgement' closely correspon. ding to the concept of sahridaya; and

2. his 'objective correlative' : which takes us back straigh to Bharata's theory of rasa nishpatti. To a Bengali

correspondent's query if he had read Bharatha's Natya Sastra, Eliot simply said 'I am familiar with the author of Vibhava. 'Objective correlative' is more than vibhava (విభావ); It is Sadharanikarana (సాధారణీకరణ). It is what the poet does with his Karayatripratibha (కారయిత్రీప్రతిభ) seeks corresponding concrete equivalents so as to evoke those feelings and that state of mind, which are also present in the reader. How little we have pursued this very central Indian concept which helped Eliot to perceive what was lacking in Shakespear's Hamlet and Milton's Poetry. And what Eliot did should have reminded us of our own contribution to criticism and helped to carry It forward."

"So too the theory of 'impersonality.' Surprising that so great poet as Tagore who was the product of this vital tradition should have called poetry self - expression, while Eliot sounded so spiritual in equating the poet's role in the creative act to that of a catalyst which was the counter part of the Indian concept of nimittamatra (నిమిత్తమాత్ర.)" The Literary criterion - A Dhvanyaloka Quarterly - Vol. XXIV, Nos. 3 & 4. - p. 16.

ఆచార్య నరసింహయ్య గారి లాగానే ఆంగ్లాచార్యులుగా, నవ్యసంప్రదాయ వాదులుగా పేరుపొందిన ఆచార్య కె. విశ్వనాథంగారు - భారతీయాలంకారికులు ప్రతిపాదించిన కావ్యతత్త్వ విశేషాలు పాశ్చాత్యులను ఎలా ఆకర్షించాయో, వారు ఆయా అంశాలను ఎలా అనువర్తించుకొని తమ తమ విమర్శలలో ప్రతిపాదించారో వివరించారు. మచ్చుకు కొన్ని మాటలు—

"So great and perpetually modern is the speculative thought of India, writes Joad, that the latest novelties of

the 20th Century turn up casually as it were and as matters taken for granted. Prof Edgerton exhorts all interested in literary aesthetics to study Dhvani carefully and Prof. Brough points out that Sanskrit Poetics as at least as well worth reading as Aristotle's Poetics or Horace's Ars Poetica and in many ways much more sensitive in its approach to poetry than either of these works. Still no outstanding modern critic deigns to take notice of it. Caudwell refers to Dhvani in his 'Illusion and Reality' and Myers in his 'The Near and the Far' refers to Rasa, Susan Langer devo-tees a paragraph to this in her 'Feeling and Form ' " (Emo-tional Effect : Katharsis and Rasa - (Essay) - Literary Criticism : European and Indian Traditions - Ed: C. D. Narasimhiah - p 101 )

నవ్య సంప్రదాయవాదుల్లో మరొక ప్రసిద్ధ ఆంగ్ల సాహిత్యాచార్యులు డాక్టర్ పి. యస్. శాస్త్రిగారు అమెరికాలోనూ, ఇంగ్లండులోనూ దాదాపు మూడు దశాబ్దాలు ఒక పెద్ద ఉద్యమంగా సాగిన 'న్యూ క్రిటిసిజం' (అభినవ విమర్శో ద్యమం) ప్రతిపాదించిన ప్రమాణాలు భారతీయాలంకారికులు ప్రతిపాదించిన గుణాలంకారరీతి సిద్ధాంతాలకు పాక్షికాలైన మారు రూపాలే అని వివేచించారు.

"New Criticism as propounded by Ransom, Tate, Brooks, Warren and others has now become an incident in the past history of literary theory Led by Richards and Eliot, strange bedfellows belonging to opposite camps, it swept the word of criticism for about thirty years When we examine it closely, we will find it to be a one sided reformulation of the guna (గుణ), alankara (అలంకార) and riti (రీతి) theories of Ancient India." (New criticism As a Movement (1974) P.`).

అభినవవిమర్శోద్యమం ప్రధానంగా చారిత్రిక విమర్శ పద్ధతిని, మానవతా వాద విమర్శనూ, మార్క్సిస్టు విమర్శ విధానాన్ని ప్రతిఘటించింది. ఈ ఉద్యమ విమర్శకులు T. E. Hulme, Ezra Pound రచనలచే ప్రభావితులైనా టి. యస్. ఎలియట్ పంథాను అనుసరించారు. అయితే, అతని చారిత్రికవిమర్శ దృక్పథాన్ని గ్రహించలేదు. వీరు కవిత్వంపట్ల ప్రసరించిన దృక్పథాన్ని తెలుసు కోవాలంటే Cleanth Brooks పేర్కొన్న ఈ మాటలు తోడ్పడతాయి: "The poem has to be read as a poem - that what it 'says' is a question for the critic to answer and that no amouut of histonical evidence as such can finally determine what the poem says." నవ్యసంప్రదాయ యుగకవుల దృక్పథానికి ఇది దగ్గరగా ఉంది.

అభినవ విమర్శోద్యమం ఉవ్వెత్తుగా సాగుతున్నప్పుడే చికాగో విశ్వవిద్యా లయానికి సంబంధించిన రోనాల్డ్, యస్. క్రేన్ మొదలైన విమర్శకులు దానికి వ్యతిరేకంగా మరొక ఉద్యమాన్ని లేవదీశారు; దాన్ని 'చికాగో స్కూల్ ఆఫ్ క్రిటిసిజం' అనీ లేదా 'నియో ఆరిష్టోటలియన్ స్కూల్ ఆఫ్ క్రిటిసిజం' అనీ పిలుస్తారు. ఈ ఉద్యమ విమర్శకులు అభినవ విమర్శకులను రెండుమూడంశాలపై విమర్శించారు. వారు వివిధ ప్రక్రియలకు పేరడాక్స్, ఐరనీ, కాంపెక్స్ మీనింగ్ అనే ప్రమాణాలతో మాత్రమే వివేచిస్తూ వైవిధ్యాన్ని పాటించేవారు కాదని మొదట విమర్శించారు. చారిత్రిక విమర్శను నిరసించినందుకు కూడా అభినవ విమర్శకులను అధిక్షేపించేవారు, అభినవ అరిస్టాటిల్ విమర్శ పద్ధతి వస్తు నిర్మాణ శిల్పానికీ, కథాకావ్య ప్రగతి పరిశీలనకూ ప్రాధాన్యం ఇచ్చింది. 'Action is the soul of Tragedy' అన్న అరిస్టాటిల్ అభిప్రాయం వీరికి ఉత్తేజాన్ని కలిగించింది. వీరు అరిస్టాటిల్ పేరు నుపయోగించుకొన్నా, అతనిని అనుక రించటం కాదు వీరి అభిమతం. అభినవ విమర్శకుల ఆకృతి విమర్శకుల ఆకృతి విమర్శకంటె భావావేశ ప్రధానమైన విమర్శను వెలయించటమే వీరి ఆశయం. ఏమైనా ఈ విమర్శకులు భారతీయుల రసదర్శనం వంటి సమగ్ర సాహిత్యాను శీలన పద్ధతులను రూపొందించలేకపోయారు. అయితే భారతీయాలంకారిక సిద్ధాం తాలు వారిని సరిక్రొత్తగా ఆలోచించే అభినవలోచనాలను అందించాయి.

అభినవ విమర్శకులకు ప్రేరక శక్తులుగా వారికి ముందున్న ప్రసిద్ధ విమర్శకులు టి.యస్. ఎలియట్, ఐ ఏ. రిచర్డ్స్, ఎఫ్ ఆర్. లీవీస్ నవ్యసంప్ర

దాయ వాదులు దృక్పథాలకు దగ్గరగా ఉంటారు. కళానుభవానికీ, కళానుశీలనానికీ భేదం తెలిపి ప్రవర్తించటమే విమర్శ ధర్మమనీ, కళానుభవ స్వభావాన్ని గురించీ, కళకు విలువకట్టే విమర్శ సిద్ధాంతాలను గురించీ, కళను లోకానికి అందించే విధానాలను గురించి తెలియకపోతే విమర్శ తన ధర్మాన్ని సక్రమంగా నిర్వహించలేదనీ ఐ.ఏ. రిచర్డ్స్ భావించాడు. అతని విమర్శ మార్గంలోని మనస్తత్వ శాస్త్ర పద్ధతిని కొంత ప్రక్కకు పెట్టితే-పై భావాలు నవ్యసంప్రదాయ వాదులు అంగీకరించేవే. అభినవగుప్తుని అభివ్యక్తివాదం రిచర్డ్స్ సిద్ధాంతంకంటె సమగ్రమైనదని భారతీయ విమర్శకులు సులభంగా గ్రహించగలుగుతారు.

ఎఫ్. ఆర్. లీవిస్ సాహిత్య వివేచనంలో సంస్కృతికి సమధికస్థానాన్ని ఇచ్చాడు. ఒక నాగరక సంఘానికి ఉండే ఆదర్శం ప్రకారం వ్యవస్థీకరింపబడిన క్రమబద్ధమైన జీవన విధానాన్ని సంస్కృతి అని అభివర్ణించాడు. ప్రాచీన గ్రామాలలోని సహజీవన విధానంలో ఇటువంటి సంస్కృతి సుసంపన్నంగా ఉండేదనీ, ఆధునిక యాంత్రిక జీవన విధానంలో ఆ సమైక్యత, ఆ సహజీవనం సహానుభవ ప్రవృత్తి లోపించిందనీ అతడు భావించాడు. సమాజంలో ప్రతి వ్యక్తికీ నిజమైన సంస్కృతిని, కృత్రిమసంస్కృతినీ గుర్తించే వివేకాన్ని సాహిత్యం అందించాలని ఆదేశించాడు. రచయిత సమకాలీన సమాజంలో సంస్కృతి సంప్రదాయ సదవగాహనకు తోడ్పడాలని ఆశించాడు. చరిత్ర ఈ పని చేస్తుంది. కాని, దానికంటే విలక్షణంగా సాహిత్యం సంస్కృతి పునరుజ్జీవనాన్ని నిర్వహిస్తుందని వివేచించాడు.

సాహిత్యంలో వికాసం చెందుతున్న ఒక సంప్రదాయాన్ని గానీ, ఒక ప్రక్రియలో అనుస్యూతంగా ఉన్న రచయితల రచనలను అనుశీలించటం ద్వారా అధ్యయనం చేయటం విమర్శ ధర్మమని అతడు పేర్కొన్నాడు. సాహిత్యం వర్తమానంలోనే జీవిస్తుంది. వర్తమాన సాహిత్యమే మన సమీక్షా క్షేత్రం. వర్తమానంలో సజీవంగా ఉన్నదే సంప్రదాయం అయితే, వర్తమాన సాహిత్యం గతంలోనుంచి అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చెందుతున్న సంప్రదాయమే. గతంలోని మంచిని మీగడతరగల్లా వర్తమానం గ్రహించి జీర్ణించుకొంటుంది. విమర్శకుడు వర్తమాన సాహిత్యానుశీలనంలో సజీవంగా ఉన్న గతాన్నీ, అది చెందిన మార్పులనూ సమీక్షించగలుగుతాడు. ఈ దృష్టితో సాహిత్యాన్నీ, దాని వాస్తవపద్ధతినీ

విమర్శ గమనించాలి. లీవిస్ విమర్శ విధానంలో ముఖ్యంగా మూడు ప్రవృత్తులు కనపడతాయి. అవి. 1. **A Complete response to the work in hand. 2. Its close scrutiny or an analysis 3. Judgement of its significance.** అనూచానంగా వస్తున్న ప్రమాణాలను కావ్యవివేచనానికి తోడ్పడినంతవరకే గ్రహించాలి. కాని, అవశ్యకర్తవ్యంగా అనుసరించరాదని లీవిస్ మతం. గతంలోని గతాన్నే చూడడం కాకుండా గతంయొక్క వర్తమాన స్థితిని దర్శించటం సంప్రదాయం (**Tradition**) అంటాడు లీవిస్. ఒక విమర్శకుడన్నట్లు అతని విమర్శలో- "The best **features** of academic **criticism** are combined with best features of periodical **criticism** and then the amalgam is refined and ennobled **with a master's touch.**" (Prniciples and History of literary **criticism** - S. C. Mundra & Agarwal - పు. 591). లీవిస్ సాహిత్య దృక్పథం, సాంస్కృతిక దృక్పథం, సంప్రదాయ భావనం తెలుగులో నవ్య సంప్రదాయ రచయితలకు సజాతీయాలుగా ఉంటాయి.

నవ్య సంప్రదాయోద్యమ నాయకుడుగా విశ్వనాథ తెలుగు సాహిత్య రంగంలో నిలుస్తాడు. ఆయన వ్యక్తిత్వాన్ని విలువకట్టాలంటే- ఆంగ్ల సాహిత్య చరిత్రలో విక్టోరియన్, ఆధునిక యుగాల్లో ప్రసిద్ధులైన మాచ్యూ ఆర్నాల్డ్, వాల్టర్ పేటర్, టి ఎస్. ఎలియట్, ఐ. ఎ. రిచర్డ్, ఎఫ్ ఆర్ లీవిస్ మొదలైన వారిలో ఉన్న సాహిత్య చైతన్యం విశ్వనాథలో సమాహారంగా సన్నద్ధమైనదని చెప్పాలి. "**Arnold repeats** over **and** over **again** that **literative educates**, that it **forms** man, **makes** him see things, **makes him know himself**, gives him **serenity**" అన్న రెనె వెలెక్ మాటలు ఆర్నాల్డ్‌కు ఎంత వర్తిస్తాయో విశ్వనాథకూ అంతే వర్తిస్తాయి.

''నేను ఏమి వ్రాస్తానో నేను తెలుసుకొని వ్రాస్తాను కనుక, నేను వ్రాసిన దానిని, అనంత విషయములు చొప్పించి వ్రాస్తాను. కనక, అనాదినుంచీ ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకొంటూ వస్తున్నది. ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణయ్యాను. వాళ్ళను జ్ఞానవంతులను చేస్తున్నాను అనే భావం నాకు ఉన్నది కనక, ఈ భావం ఉన్నవాళ్ళు చాలమంది ఉన్నారని నాకు తెలుసు కనక. పూర్వసాహిత్యం ఒకటి ఉన్నది. అది నేనుపోతే నాతో పోయే వాళ్ళు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న,

పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలైనవారు - ఊరికే ఒట్టి పూర్వకవు లని కాదు, పద్యరచనా సామ్రాజ్య పట్టభద్రులు, కథాకథన శిల్పనూత్నాచార్యులు, వేదవేదాంగాది మహాగ్రంథస్థులు, మహావిషయ నిర్ణేతలు, బహువిషయ వ్యాఖ్యాతలు, కావ్య కథాశిల్ప రహస్యవేత్తలు - అనే దృష్టితో ఆ పూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేనూ నిలుస్తాను. నేను చేసినపని అటువంటిది." (నేనూ, నా సాహిత్య రచనలూ (1947.72) వ్యా. - మహతి - ప్రతిభ విభాగం-పు. 4.) విశ్వనాథవారి ఈ మాటల్లో ఆర్నాల్డ్ వేదనవంటి వేదన వినబడటం లేదూ? ఎలియట్‌లోని 'The idea of conformity to tradition' - కనపడటం లేదూ? రిచర్డ్స్ చెప్పే కళాప్రసార (communication) గౌరవం ప్రసరించటం లేదూ? లీవిస్ సంప్రదాయ దర్శనం ప్రతిఫలించటం లేదూ?

విశ్వనాథవారి విమర్శ దృక్పథమంటే సాహిత్య దృక్పథ మన్నమాట. అది సృజన మార్గాన్ని ఆశ్రయిస్తే రచనగా అవతరిస్తుంది; అనుశీలనమార్గంలో ప్రసరిస్తే విమర్శగా పరిణమిస్తుంది. ఆధునిక పాశ్చాత్య విమర్శలో Practical criticism, New criticism అనేవి ఉద్యమాలుగా సాగాయి. వాటిమీద భారతీయాలంకారిక సిద్ధాంతాల ప్రభావం కనపడుతుంది. అయినా, వాటన్నిటి కంటె ధ్వన్యౌచిత్యరస ప్రస్థానాలు కావ్యతత్త్వ వివేచనంలో సమగ్రంగానూ, సమర్థంగానూ పనికివస్తాయని మన రచయితలకు తెలుసు. అందువలన, నవ్య సంప్రదాయవాదులు రసప్రస్థానాన్ని తమ రాజమార్గంగా ఎన్నుకొన్నారు. "ప్రాగ్వి పశ్చి న్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవకథాదృతిని మించి" అని చాటారు. రసప్రస్థానంతో సాహిత్యాన్ని సృజించటం, విమర్శించటమంటే మన జాతీయ దృక్పథంలో ప్రపంచాన్ని పరిశీలించటం. నవ్య సంప్రదాయోద్యమంలోని జీవశక్తి అది ఇచ్చిపుచ్చుకోవటంలో ఈ క్రింది సూత్రం నవ్య సంప్రదాయానికి వర్తిస్తుంది: "For history has shown that whenever a people have revitalised themselves they have done so both by giving back to the sources of their own culture and by looking around to imbibe influences from outside.... It is time that we set in motion reciprocacity instead of the one way traffic we now have with Europe and America." (శ్రీ సి. డి. నరసింహయ్యగారు.)

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 4-2-1990)

# నవ్యసంప్రదాయవాదుల నవరససూత్రం

నవ్యసంప్రదాయవాదులు దర్శించిన రససిద్ధాంతం ఆధునిక స్పృహతో కూడుకొన్నది. భరతుని నుండి రసగంగాధరకర్తదాకా సాగిన రసవిచారానికిన్నీ నవ్యసంప్రదాయ యుగకవులు తమ కావ్యప్రయోగాల్లో పోషించిన రసవ్యక్తికిన్నీ భేదం ఉంది. ఆ భేదం ఆ కాలానికి సంబంధించింది. అటు కాల్పనిక కవులూ, ఇటు అభ్యుదయవాద కవులూ రసాన్ని గురించి వ్యాఖ్యానించిన వైఖరులూ, పాశ్చాత్య విషాదాంత నాటకాలలో కానవచ్చే కెథార్సిస్ కలిగించిన నూత్న స్ఫూర్తులూ, భారత స్వాతంత్ర్యోద్యమంలో జాతి పొందుతున్న సత్యాగ్రహం, త్యాగం, ఉత్సాహం, మరణానికికూడా వెనుకాడని ఉద్యమచైతన్యం, స్వాతంత్ర్య వీరం, జాత్యభిమానం, దేశభక్తి, దేశంకోసం అసువులు కోల్పోయిన వీరులపట్ల, వారి గాథలపట్ల అమరవీరభావనం, దేశీయమైన దృక్పథంతో కళాతత్త్వాన్ని దర్శించే జాతీయ సాహిత్య భావనం - ఇవన్నీ నవ్యసంప్రదాయవాదుల రస సిద్ధాంత దర్శనం మీదా, వారి ప్రయోగాలమీదా బలంగా పనిచేశాయి. ఈ నేప థ్యంలో నవ్యసంప్రదాయవాదుల ఉద్యమాన్ని సమీక్షించవలసి వస్తుంది.

హిందీలో నవ్యసంప్రదాయ సాహిత్య తత్త్వ విమర్శకులలో ప్రముఖులు ఆచార్య నగేంద్ర. వారు రససిద్ధాంతంమీద రచించిన గ్రంథం - ఆదర్శనం ఆర్ష కాలం నుండి ఆధునిక కాలంవరకు పరిణామం చెందిన విధానాన్ని వివేకవంతంగా వ్యాఖ్యానించింది. అభ్యుదయవాదులు రససిద్ధాంతం మీద చేసిన తిరుగుబాటు ఎలా భ్రాంతిమూలకమైందో వివరించింది. ఆచార్య నగేంద్ర ఇలా అన్నారు—

"ప్రస్తుతకాలంలోని సాహిత్య విలువలతో రససిద్ధాంతానికి మౌలికమయిన భేదమున్నట్లు అనిపిస్తుంది. కాని, అది పూర్తిగా భ్రాంతిమూలకమయింది. ప్రతి కొత్త ఉద్యమంవలెనే ప్రగతివాదం (అభ్యుదయవాదం అని తెలుగువారు పిలిచే దాన్ని హిందీవారు ప్రగతివాదం అంటారు) కూడా సంప్రదాయానికి విరుద్ధంగా గుడ్డి తిరుగుబాటులా తలెత్తింది. భారతీయ సాహిత్యంలో రసవాద సంప్రదాయం దాదాపు నిరంతరాయంగా సాగి వస్తున్నటువంటిది. అందువల్ల ప్రగతివాదానికి

చెందిన భారతీయ వ్యాఖ్యాతలు అతి అభినివేశంతో రస సిద్ధాంతాన్ని ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటనలో అసలు రెండు అభిమతాలున్నాయి. ఒకటి - రస వాదానికి ఆధారం కేవలం ఆహ్లాదం అనీ, మానవ చేతన వికాసంపట్ల అది ఔదాసీన్యం వహించి ఉన్నది అనీ; రెండవది - రసం ఆధ్యాత్మికమైన లేదా, అర్ధ - ఆధ్యాత్మికమయిన కల్పన. అది అభిజాత్యవాదపు - లేదా - సామంతవాదపు యుగానికి చెందిన ఎన్నో ప్రపంచక సిద్ధాంతాలవలె అబద్ధాల పుట్ట, జనహిత భావనకు విరుద్ధమయిందనీ. అందువల్ల హిందీలో కొంతమంది రచయితలు 'బ్రహ్మానంద సహోదర' మనే పదాన్ని పట్టుకొని రకరకాల వాదమూలాలయిన నిర్ణయాలు ప్రతిపాదించసాగారు. నిజానికి పై రెండు అభిమాతాలూ సమంజస మైనవి కావు. రసం 'ప్లెజర్' (Pleasure), 'రుచి' లేదా 'వినోదం' అన్న మాటలకు పర్యాయ పదంగా ఎప్పుడూ పరిగణింపబడలేదు, అది ఆనందానికి పర్యాయం. ఆ ఆనందం వ్యష్టి - సమష్టి హితానికి అంతిమ పరిణతి. అందువల్ల మొదటి అభిమతం ఆనందానికీ కళ్యాణానికీ మధ్య మిథ్యాభేద కల్పన మీద ఆధారపడింది. రెండవదానికి ఆధారం రసం యొక్క ఆధ్యాత్మిక కల్పనకు సంబంధించిన భ్రాంతి...."

"ఈ భ్రాంతి పూర్ణమయిన అభిప్రాయాలు ఖండించబడిన తరవాత రస వాదంపట్ల మార్క్సువాద కావ్యదర్శన విరోధభావం - కనీసం దాని ఉగ్రత్వం అన్నా - చాలామటుకు సమసిపోతుంది. ప్రగతివాదంలోని ప్రముఖ అభిమతం - సమష్టిగత కావ్య చేతనకు సాధరీకరణ సిద్ధాంతంతో ప్రత్యక్షంగా సమభావం ఉందనే ఉన్నది, ఇతర అభిమతాలకూ రస పరిధిలో పూర్తి అవకాశం ఉన్నది. రసంలో ప్రేమ - శాంతివలెనే, సంఘర్షణ లేదా ద్వంద్వభావంకూడా గ్రాహ్యమే, సంఘర్షణలో ఉన్న విభిన్న తత్త్వాలకు - ఉత్సాహం, క్రోధం లేదా మన్యువు, కరుణ మొదలయిన వాటికి రసచక్రంలో మహత్వ పూర్ణమయిన స్థానం ఉంది. ప్రజాసాహిత్యం అయితే అదికూడా ప్రజల సుఖ - దుఃఖాలను, హర్ష - విషాదాలను, ఆశా - ఆకాంక్షలను, సంఘర్ష - సిద్ధులను చిత్రించేదిగానే ఉంటుంది కదా? మరి, ఇదే రసానికి ఆధార సామగ్రి."

"సామ్రాజ్యవాద - సామంతవాద సంస్కృతి యొక్క ఉన్మూలనం జాతీయ స్వాతంత్ర్య రక్షణ, ప్రజాతంత్రం, శాంతి స్థాపనవంటి ప్రజాహితకరా

లయిన లక్ష్యాలతో రససిద్ధాంతానికి విరోధం ఎందుకుంటుంది? మానవ సంవేదన, సౌందర్య జ్ఞానాల వికాసం రసవాదానికి కూడా లక్ష్యమే. నైతికాలయిన విలువలను కూడా అది పూర్తి అభినివేశంతో స్వీకరిస్తుంది. ఆశాభావాన్ని రేకెత్తించటం, కర్మచేతనా స్ఫూర్తి, వ్యక్తిగతాలయిన క్షుద్రభావాలనుంచి విముక్తి, నిరాశాకుంఠాభావాల ఖండన మొదలయినవి రసవాదానికి ఆధారభూతాలయిన లక్షణాలు. కాబట్టి వ్యాపకమైన అర్థంలో సాహిత్యంలో ఉండే ప్రగతిశీల భావాలను రసవాదం పూర్తిగా సమర్థిస్తుంది. మార్క్సవాద విమర్శకుడు ప్రజాసంఘర్షానికి వర్గసీమితమయిన ఏక పక్షీయమయిన అర్థం చెప్పినప్పుడే - సమస్య ఏర్పడుతుంది; కాని, ఇది రససిద్ధాంత దోషంకాదు." (రససిద్ధాంతం - తెలుగు అకాడమీ ప్రచురణ (1985); అను: భీమసేన్ నిర్మల్; పు: 362 - 363).

అభ్యుదయవాదులు సాహిత్యానికి, విశేషించి కవితకు, కవితకు సంబంధించిన ప్రక్రియలకు సామాజిక దర్శనం మూలమని వ్యాఖ్యానించే యత్నం చేశారు. నవలా ప్రక్రియకు ప్రధానమైన సామాజిక వాస్తవికతను కవితా ప్రక్రియలకు కూడా ప్రధానమని ప్రతిపాదించారు. వారి వాదం సాహిత్య జగత్తులో నిలవాలంటే రససిద్ధాంతాన్ని కాదనాలి. అందువలన రసవాదాన్ని సంప్రదాయవాదంగా, ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించిందిగా చెప్పి, కవిత్వం ఆనందాన్ని అందించటంకోసంకాదు, జాతిలో కార్యశీలత్వాన్ని కలిగించటానికే ఉపయోగపడాలని వాదించారు. ఆంధ్ర సాహిత్య చరిత్రలో మొట్టమొదటిసారిగా కవిత్వానికి సాహిత్య సిద్ధాంత ప్రాతిపదికను కాదన్నవారు అభ్యుదయ వామపక్షీయులూ విప్లవకవులు. దీన్ని వ్యతిరేకించి సామాజిక చైతన్యాన్ని రసదర్శనంగా మార్చుకొనే సాహిత్య ప్రక్రియలను చేపట్టి అపూర్వంగా నిర్వహించి నవ్యసంప్రదాయోద్యమాన్ని సాగించారు నవ్యసంప్రదాయకవులు. నవ్యసంప్రదాయ కవులది నవ్యరసమార్గమనటం మరింత సమంజసం!

ఈ నవ్యసంప్రదాయోద్యమంలో నవ్యరసమార్గాన్ని సమర్థవంతంగా నిర్వహించినవారు ఈ యుగంలోని చారిత్రక కావ్యకర్తలు. డి రాజశేఖర శతావధానిగారి 'రాణా ప్రతాపసింహ చరిత్ర' మొదలుకొని ముదిగొండ వీరభద్రమూర్తి గారి 'వందేమాతరం' దాకా తెలుగు సాహిత్యంలో మేరుపర్వత శిఖరాల్లా కనిపించే మహాకావ్యాలు చారిత్రక కావ్యాలు. మన భారత స్వాతంత్ర్య చరిత్రయే

ఒక వాస్తవ సత్యమైతే, నునం స్వాతంత్ర్యంకోసం చేసిన పోరాటమే నాటి సామాజిక వాస్తవికత అయితే, ఈ చరిత్ర కావ్యాలు కూడా ఆ వాస్తవ సామాజిక స్పృహను రసదర్శనంతో ఆవిష్కరించిన మహాకావ్యాలు, క్లాసిక్స్.

క్లాసిక్‌గా, లేదా కావ్యేతిహాసంగా పేరుపొందిన ఆంధ్ర మహాభారతానికీ, నవ్యసంప్రదాయ మహాకావ్యంగా వాసికెక్కిన 'రాణా ప్రతాపసింహచరిత్ర'కూ ఉన్న భేదాన్ని విశ్వనాథవారు ఇలా నిరూపించారు:

''భారతము పూర్వకాలము కథనే చెప్పును. అందులోనున్న ధర్మము మాత్రమే మన జాతిది. ఆ విషయము ద్వాపరయుగమునాటిది. మన పరిస్థితులతో సంబంధములేనిది. ప్రతాపసింహ చరిత్ర మన ధర్మమునేగాక మన పరిస్థితులను గూడ చెప్పును. అక్బరు చక్రవర్తితో పాతికేళ్ళు హోంహోరి పోరి, స్వదేశము నందలి కొండలలో, గుట్టలలో నివసించి, తిండిలేక గడ్డిరొట్టెలు తిని దైవవశమున మఱల స్వాతంత్ర్యము సంపాదించిన మహాపురుషుడు రాణా ప్రతాపుడు! ఆయనకన్న ధర్మరాజాదులేమియు నెక్కువవారు కారు. వస్తురమ్యతకుగాని, కథారచనకుగాని, ఇందలి భిన్నపాత్రల భిన్నతావిశిష్టతకుగాని భారతమునకీ గ్రంథము తీసిపోదు."

"ఈ గ్రంథము అస్వతంత్ర జాతియొక్క స్మృతిగ్రంథము వంటిది. రాణా ప్రతాపుని భద్రాకరణ ప్రతిజ్ఞ చదివినచో పారతంత్ర్య జాతికి ఇది స్మృతి గ్రంథమన్న మాట కర్థము తెలియును. రాణా ప్రతాపునకును మహాత్మునకును గల సామ్యము - భారతజాతికి గల యస్వతంత్రత. మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపుపోరు; ప్రతాపునిది కత్తి గల సాత్త్వికపుపోరు. ప్రతాపసింహుడు అక్బరును జయింపవలెనని యుద్ధము చేయలేదు. పౌరుష శక్తితో గెలువలేనని యాయనకు తెలియును. కాని, వట్టి ధర్మముకోసము యుద్ధము చేసెను. భారత జాతీయ ధర్మము పరులకు లొంగిపోదు - చచ్చిపోదు - అని ఋజువు చేయుటకే యుద్ధము చేసెను."

"కాన విజయము ముఖ్యంబు గాదు మనకు!
ధర్మ నిర్వహణంబు కర్తవ్య మిపుడు!"

"అని ప్రతాపుని యూహ. నేటి సత్యాగ్రహమునకు ఆనాటి ప్రతాపుని యుద్ధ ధర్మమునకును భేదమే లేదు,"

"ప్రతాపుడు గాంధివంటివాడు; ఏసుక్రీస్తు వంటివాడు, చివఱ కిట్లనెను నా రాజ్య మరణ్యము. మేము సన్న్యాసులము. మీ యగ్బరునకు మమ్ము గెలువ. వలెనని పట్టుదల యేమి? అప్రతిహతముగా నగ్బరొక్కనే క్షితిని దేవుడు సృష్టి చేయలేదు. ప్రజ లతనిచే జంపబడుటకు పుట్టలేదు. రాజకన్యక లతని భోగపరత కుద్దేశింపబడలేదు. అతని రాజ్య తృష్ణముందు సర్వజగత్తు పారతంత్ర్యమున మునుగుచెల్ల పాడిగా దనుచు నక్బరెంత యెఱిగిన జగమున కంతమేలు!" (రాణా ప్రతాపసింహ చరిత్ర పీఠిక.)

ఈ వాక్యాలెందుకు పేర్కొన్నానంటే నవ్యసంప్రదాయోద్యమ కవుల స్వభావం కూడా రాణా ప్రతాపసింహాని వంటిదనే చెప్పటానికి. వలస సామ్రాజ్య వాదులను, దోపిడీ వర్గ వ్యాపారులను వ్యతిరేకించటంలో స్వాతంత్ర్యయోధులు ప్రపంచ చరిత్రలోని ఏ విప్లవకారులకూ ఎందులోనూ తీసిపోరు. పైపెచ్చు రక్త నదులు ప్రవహించే తిరుగుబాట్లకంటె, హింసను పెంపొందించే విప్లవ ధోరణి కంటె మనిషిమీద భౌతికంగా కంటె ముందు నైతికంగా విజయాన్ని సాధించాలనీ, నైతికంగా పరిణామం చెందందే భౌతికంగా, మానసికంగా మనిషి ప్రవర్తనలో మార్పు రాదనీ గాంధేయవాదం చెపుతుంది. భారతదేశం నుండి ఆంగ్లేయులు చావును మూటకట్టుకొని పోలేదు; చరిత్ర గుణపాఠాన్ని చర్వణం చేస్తూ పోయారు. సత్యాగ్రహం యూరోపు దేశాల విప్లవాల కంటె, సామ్యవాద విప్లవాలకంటె సాత్త్వికమైనదనీ, మానవీయమైనదనీ, ఆదర్శప్రాయమైనదనీ ప్రపంచానికి చాటుతూ భారతదేశం నుండి తరలిపోయారు. నవ్యసంప్రదాయ వాదుల ఉద్యమం కూడా ఇటువంటిదే. వీరి ఉద్యమ ప్రవృత్తికి అభ్యుదయ వామ పక్షవాదానికి, విప్లవ వాదానికి ఉన్నభేదం సత్యాగ్రహోద్యమ ప్రవృత్తికి, ఉగ్ర వాద ప్రవృత్తికి ఉన్న భేదంలాంటిదే. వామపక్షీయులు వ్యూహరచనాసక్తులు; ఏవిధంగానైనా విజయం ముఖ్యం దాన్ని సాగించటంలో ఉపకరణాలు అన్ని వేళలా రక్తసిక్తంకాకుండా ఉండాలనే నియమం వారికి లేదు. సామాజికంగా జరిగే తిరుగుబాట్లల్లో సాయుధపోరాటాలు సాగించడం ఆ వాదం వారికి ఆచరణ సూత్రం. మరి, సాహిత్యరంగంలో ఎదుటివారి దృక్పథాలను, పారిభాషిక పదాలను వక్రీకరించి, వాటిని తమ సిద్ధాంతాలతో సంధించి తిప్పి వారిమీదకే పేల్చటం, వామపక్షదేశాధినేతల పాలన సూత్రాలకు అనుగుణంగా సాహిత్యం లోని భావజాలాన్ని వ్యాఖ్యానించి చెప్పటం. ఇది ఎంతటి గొప్ప ధోరణియైనా జాతీయతను నమ్మి స్వాతంత్ర్యాన్ని కోరే దేశీయులకు నచ్చలేదు. వారు సైద్ధాంతి

కంగా వామపక్షీయులపై అసంతృప్తి ప్రకటించేవారు. వ్యక్తిస్వాతంత్ర్యంకోసం, సమ సమాజ నిర్మాణంకోసం జరుగుతున్న పోరాటాలకు సత్యాగ్రహోద్యమం ప్రాతిపదికగా ప్రపంచదేశాల్లో భారతీయమైన వ్యాఖ్యానాన్ని, భారతీయ తత్త్వ దర్శనాన్ని, అందించాలనీ, అదే ప్రపంచ శ్రేయస్సుకు తరణోపాయమనీ గాంధేయవాదులంటారు. ఈ గాంధేయ సామాజిక తత్త్వదర్శనాన్ని చారిత్రక కావ్యాల్లో వస్తుతత్త్వంగా ప్రతిపాదిస్తూ, అటువంటి కథలలో పోషింపబడే రస తత్త్వాన్ని నవ్యసంప్రదాయవాదులు నవరససూక్తంగా వ్యక్తీకరించారు.

స్వాతంత్ర్య సమరవీరుల చరిత్రల్లో "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అనే స్ఫూర్తి గోచరిస్తుంది. స్వాతంత్ర్యమే వారికి దైవం.

"భూమిపాలుర పాదములు గొల్వగా పూజ్య
మగు ప్రపంచాధిపత్యమున కన్న
దేవేంద్రు విభవంబు దెగడి యానంద సౌ
ఖ్యము గూర్పఁజాలు భోగముల కన్న
బరమసౌందర్య సంపద్విభూషిత లప్స
రస్త్రీ రహో విహారమున కన్న
నవ సంఖ్య నిధులకు నాయకుండగు రాజ
రాజాధికార గౌరవము కన్న

నట్టి దశకోటి శతకోటి యంత లెక్క
దగుచు నాత్మ స్వతంత్రత యలరు దాని
కన్న దేశ స్వతంత్రత యధికమగు; స్వ
తంత్రతను మించు దైవమీ ధరణి లేదు." (అమరసింహ చరిత్ర)

ఆ స్వాతంత్ర్యం కోసం అసువులర్పించటం మాతృమూర్తి చరణాలపై ఆత్మసమర్పణం చేసుకొన్నట్లు వారు భావిస్తారు. నవవిధ భక్తులలో చివరిదైన ఆత్మ సమర్పణకు స్వాతంత్రోద్యమం ఒక నవ్యరుచిని కల్పించిపెట్టింది. శరీరాలు రాలిపోవచ్చును గాని స్వాతంత్ర్యేచ్ఛ నశించిపోదు! ఇది త్యాగధురులైన స్వాతంత్ర్యవీరుల విశ్వాసం! అది చరిత్ర సత్యం; వాస్తవం కూడా!

"విమతుల ఖడ్గము హృదయా
బ్జము జొచ్చును గాక, యచటి స్వాతంత్ర్యపు బీ
జముఁ జంపుట మాత్ర మసా
ధ్యము; నెఱవేరదు జగంబు తల్క్రిందైనన్." (రాణా. చరి.)

దేశంకొరకై ప్రాణాలనర్పించే వీరులను, స్వాతంత్ర్య ధర్మం కోసం పోరాడే ధీరులను, జాతీయ ధర్మాన్ని పునరుద్ధరించుకొనే శూరులను కావ్య నాయకులుగా ఎన్నుకొనే ప్రవృత్తి నవ్య సంప్రదాయవాదులు ప్రకటించారు. ఆ మహాకవులు రచించిన కావ్యాలలో ఆ అమరవీరులు కావ్యనాయకులై రస జగత్తులో, రసిక హృదయజగత్తుల్లో జీవించారు; జీవిస్తున్నారు. రాణా ప్రతాప సింహుడు, అమరసింహుడు, శివాజీ మొదలైనవారు స్వాతంత్ర్యయుద్ధంలో పాల్గొన్నవారు కాకపోయినా, వారి చరిత్ర కావ్యాలు వారిని స్వాతంత్ర్య సమర యోధులుగా మనకు అందించాయి.

స్వాతంత్ర్యయోధుల వస్తువులను ఎన్నుకోవటానికి తోడ్పడిన మొదటి కారణం- సమకాలీన స్వాతంత్ర్యోద్యమ స్పృహ. రెండవ కారణం-ఆ వస్తువులలో సహజంగా అమరియున్న కథారిసిస్. పాశ్చాత్య విషాదాంతరూపకాలు సామాజి కులకందించే కెథారిసిస్ ఆంధ్ర నాటకకర్తలను మొదట ఆకర్షించింది; భారతీయ నాటకాల్లో కథారిసిస్ వంటి అనుభవాన్ని కలిగించగల అభిజ్ఞాన శాకుంతలం, ఉత్తరరామచరితం వంటి విషాద గంభీర నాటకాలను తెలుగు చేయటానికి ప్రోత్స హించింది; ఆపైన విషాద సారంగధర, నర్తనశాలవంటి విషాదాంత నాటకాలనే తెలుగులో వినిర్మించుకొనేటట్లు చేసింది.

తెలుగులో కట్టమంచివారి 'ముసలమ్మ మరణం' విషాదకావ్య ప్రక్రియ లలో తొలి ఉషస్సు. అది త్యాగవీరాన్ని కరుణాన్ని కలిపిచేసిన విశిష్ట ప్రయోగం. ముసలమ్మ భారతీయాలంకారశాస్త్రం ప్రకారం త్యాగవీరురాలు; పాశ్చాత్యనాటక సూత్రం ప్రకారం విషాదాలత పాత్ర. ఈ పాత్ర విధిచేత విషాదాంతం పొందు తుంది; పఠితలలో కథారిసిస్ కలిగించే శక్తిని ప్రదర్శిస్తుంది. చారిత్రక కావ్యాలలో వీరులుకూడా విషాదాంత నాటక నాయకుల్లాంటివారు కారు. కాని, అటువంటి సానుభూతినిపొంది తమ జీవితాలను అవిచ్ఛిన్న స్వాతంత్ర్యోద్యమ సవనంలో ఆహూతులుగా అర్పించిన అనుభూతిని అందిస్తారు. ఈ అనుభవం పూర్వ సాహిత్యంలో లేదు. నవ్యసంప్రదాయ కావ్యాలలో నవ్యరస సూక్తంగా నినదిస్తు న్నది.

(సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ - 11-2-1990)

# నవ్యసంప్రదాయం : చారిత్రకకావ్యం

నవ్యసంప్రదాయోద్యమానికి ఒక ప్రయోగ గౌరవాన్ని కలిగించింది చారిత్రకకావ్యం. ఆ ఉద్యమ తాత్త్వికసూత్రాన్నీ, రసదర్శనాన్నీ, సామాజిక ప్రయోజనాన్నీ సంవదించుకొని సముద్భవించిన సాహిత్యప్రక్రియ చారిత్రక కావ్యం స్థూలంగా పరిశీలిస్తే చారిత్రక కావ్యంలో చరిత్రత్వం, కావ్యత్వం సంగమించి ఒక ప్రక్రియగా రూపొందుతాయి. అయితే చరిత్ర వాస్తవ ప్రమాణ మూలం; చారిత్రక కావ్యం కళాప్రమాణ మూలం. చరిత్ర గతజీవితాన్ని చిత్రిస్తుంది; చారిత్రక కావ్యం గతజీవితాన్ని వర్తమానానికి అనువుగా వ్యాఖ్యానిస్తుంది; చరిత్ర గతిని చెప్పినంతగా నీతిని చెప్పదు; చారిత్రకకావ్యం నీతిని చెప్పి, జాతికి ప్రగతిని సూచిస్తుంది. తనను తాను పునఃపరిశీలించుకోవటానికి జాతికి చరిత్ర పనికి వస్తుంది. తనను తాను పునరుద్ధరించుకోవటానికి జాతికి చారిత్రక కావ్యం తోడుపడుతుంది.

చరిత్ర రచయిత వేరు, కావ్యకర్త వేరు. చరిత్ర రచన ఎంతటి కళాసౌందర్యాన్ని సంతరించుకొన్నా కావ్యం కాదు; కాలేదు. కావ్య రచన ఎంతటి సత్యనిష్ఠను ప్రకటించినా చరిత్ర కాదు; కాబోదు చారిత్రక కావ్యకర్తకు చరిత్రలోని ఒక ఘట్టాన్ని కళామయంగా వ్రాద్దామనే దృక్పథంకంటె ఆ వస్తువుద్వారా జాతికి ఒక వినూత్న సందేశాన్ని అందించాలన్న ఆకాంక్ష బలంగా ఉంటుంది. చరిత్రఘట్టాన్ని కావ్యవస్తువుగా మలచుకొంటాడు మొదట కవి. వస్తువు కవి దర్శనంనుండి ఉద్భవించే ప్రయోగభూమిక. దానికి కవి నేర్పిన స్వభావం ఒంటపడుతుంది. కవి అలవరచిన అభినయం అలవడుతుంది. చరిత్రకంటె చారిత్రక కావ్యానికి అనుభవాన్నిచ్చే ఆలోచనాశక్తి ఎక్కువ; జీవిత తత్త్వాన్ని వ్యాఖ్యానించే వివేచనాశక్తి ఎక్కువ

సాహిత్య ప్రక్రియలన్నింటిలో లాగానే చారిత్రకకావ్యాలలో కూడా స్వభావాలనుబట్టి భేదాలు కనపడతాయి. భారతీయ సాహిత్యాల్లో మొట్టమొదట వెలసిన చారిత్రకసంబంధి సాహిత్యప్రక్రియలు పురాణేతిహాసాలు వాటిలో

మానవజాతి వికాసాన్ని దార్శనిక దృష్టితో వ్యాఖ్యానించేది పురాణం. ఒక రాజ వంశాన్ని గాని, ఒక వీరుని జీవితగాథను గాని పురుషార్థ సాధనామయమైన ధర్మదృష్టితో చిత్రించేది ఇతిహాసం. పురాణంలో సర్గాదులు దర్శనమూలాలు; ఇతిహాసంలోని కథార్థాలు పరంపరాగతమైన శ్రుతిమూలాలు. వస్తువుల స్వభావాన్నిబట్టి అవి భేదించినా వేదార్థ బృంహితత్వం వాటియందు నియతలక్షణంగా నిలిచి ఉంటుంది. ఇతిహాస పరిధికంటె కావ్యపరిధి పరిమితం. ఒక పురుషార్థాన్ని కానీ, ఒక ప్రయోజనాన్ని కానీ సాధించటానికి ఆరంభమైన ఒక కార్యం విస్తరిల్లి ఫలవంతమయ్యేంతవరకు స్వయంసమగ్రంగా చిత్రింపబడే వస్తు జీవితం కావ్యం. ఇందులోని వస్తువు చారిత్రకమైతే అది చారిత్రక కావ్యం అవుతుంది.

కావ్యంలో వస్తువు, నాయకుడు, రసం, రచన అనే అంశాలు ప్రాధాన్యత వహిస్తాయి. చారిత్రక కావ్యంలో వాటితోపాటు 'దేశ, కాల, పాత్రములు' ప్రత్యేక గౌరవాన్ని సంపాదిస్తాయి. వస్తువు దేశసంబంధి; నాయకుడు కాలసంబంధి; రసము పాత్ర సంబంధి. చరిత్రలో ఒక సన్నివేశం ఒక ప్రాంతంలో కార్యకారణ సంబద్ధంగా సంభవిస్తుంది. కాలానుగుణమైన ప్రయోజనాన్ని సాధించటానికి నాయకుడు - లేదా - ఒక ఉద్యమ చైతన్యశక్తి, ఆ సన్నివేశాన్ని దిద్ది తీరుస్తుంది; ఫలాన్ని సాధిస్తుంది. ఆ పాత్ర సాగించే కార్యప్రవృత్తిలో భావరూపంగా జాలువారే మానసిక చైతన్యం రసవృత్తి. చారిత్రక కావ్యం ఇలా ఒక చారిత్రక ఘట్టానికి రసజీవితాన్ని అలవరుస్తుంది. దానితో సీమలకు పరిమితమైన దేశం ఆవరణాలను ఛేదించుకొని అనుభవ క్షేత్రంగా మారుతుంది. వ్యష్టిగా భాసించే నాయకుడు సమాజంలోని సమష్టి చైతన్యంలోని సజీవశక్తిగా మారిపోతాడు; అతడు వ్యక్తంచేసే రసభావజగత్తు వ్యక్తి పరిధిని దాటి విశ్వజనీనంగా వ్యాపించి జాతిలోని వాసనాజగత్తును జాగృతం చేసి రసీకృతం చేస్తుంది. చరిత్రలో లేని కళానుభవం చారిత్రక కావ్యంలో ఉంటుంది. ఆ అనుభవంకోసమే అది పుడుతుంది; దానిలోనే అది జీవిస్తుంది.

చారిత్రక కావ్య రచనలో కూడా కవులు అనేక ప్రయోగాలు చేశారు. తెలుగులో వెలసిన చారిత్రక కావ్యాల్లో ముఖ్యమైనవి - చారిత్రక వస్తుకావ్యం; చారిత్రక రసకావ్యం; చారిత్రక తత్త్వకావ్యం - అని పేర్కొనవచ్చు. వీటిలో వస్తుకావ్యం చరిత్రలోని ఘట్టాలను వర్ణించే ప్రవృత్తికి ప్రాధాన్యం ఇస్తుంది.

ఒక పరిణామ సూత్రాన్ని కాని, సమన్వయ విధానాన్నిగానీ, వ్యాఖ్యాన వైఖరిని గాని ఆశ్రయించి, కావ్యంలోని సన్నివేశాలు దారానికి గుచ్చబడిన పూసల్లాగా అమర్చబడటం వస్తుకావ్యలక్షణం. ఆంధ్రపురాణం, వందేమాతరం లాంటివి ఈ వర్గానికి చెందే చారిత్రక కావ్యాలు. చారిత్రక రసకావ్యం ఏకనాయకమై రస ప్రధానమై సాగుతుంది. ఇందులో వస్తువు చారిత్రకం; నాయకుడు చారిత్రకవ్యక్తి. అయినా, ఆ రెండూ రసపోషణకు అడ్డురావు, ప్రఖ్యాతేతివృత్తంగల కావ్యంలో లాగా. ఈ వర్గానికి చెందిన కావ్యాలు రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం మొదలైనవి. ఈ రెండింటికంటె చారిత్రక తత్త్వకావ్యం విశిష్టమైనది. ఇందులోని వస్తువు కథకోసంగానీ, రసంకోసంగానీ చెప్పబడదు. చారిత్రక సన్నివేశం వెనుక రచయిత దర్శించిన తాత్త్విక సిద్ధాంతం కావ్యార్థాలకు గమ్యమానంగా నిలుస్తుంది. ఈ ప్రక్రియలో కవి కథ నెలా చిత్రించాడన్నది ప్రధానం కాదు; కవి కథ నెలా ఒక తత్త్వానికి వ్యాఖ్యగా నిబంధించాడన్నదే ప్రధానం. ఇటువంటి కావ్యాలకు విశ్వనాథ వారి ఝాన్సీరాణి, శివార్పణం లాంటివి చక్కని ఉదాహరణలు.

చారిత్రక కావ్యాల్లో మహాకావ్యాలూ ఉండవచ్చు; ఖండకావ్యాలూ ఉండవచ్చు. అంతేకాదు- వ్యంగ్యకావ్యాలూ, అధిక్షేపకావ్యాలూ, వంశకావ్యాలూ, ఉద్యమచరిత్రలూ, మహాపురుష చరిత్రలూ - ఇలా ఎన్నో రకాల ప్రయోగాలు ఉండవచ్చు. ఈ దృష్టితో చూస్తే పోతన చరిత్ర, శంకర చరిత్ర వంటి పద్య కావ్యాలూ; త్వమేవాహం, తెలంగాణా వంటి వచన కావ్యాలూ ఈ శాఖలోకి వచ్చే అవకాశం ఉంది. పైపద్యకావ్యాల వెనుక నవ్యసంప్రదాయోద్యమ ప్రవృత్తి బలంగా ఉంది; వచనకావ్యాల మీద నవ్యసంప్రదాయవాదుల ప్రక్రియా దృక్పథం వేసిన బలమైన ప్రభావం స్పష్టంగా గోచరిస్తున్నది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రబోధ కవిత్వం దేశచరిత్రను కవితామయంగా చిత్రించి, ఉత్తేజకరంగా ఉల్లేఖించి, ఉపదేశాత్మకంగా అభివ్యక్తీకరించే పద్ధతిని తెలుగువాడికి నేర్పింది. ఆంధ్రేతిహాసంలోని చరిత్ర విశేషాలను మల్లంపల్లి సోమశేఖరశర్మ వంటి మనీషులు వెలికితీసి కుప్పలు పోశారు. విశ్వనాథవంటి మహాకవులు ఖండకావ్యాలగా చారిత్రక ఘట్టాలను చిత్రించి

దేశాభిమానంతో పాటు, ఆత్మాభిమానాన్ని కూడా నేర్పారు. దుర్భాక రాజశేఖర శతావధానిగారు రాజాస్థాన వీరగాథలలో నుండి రాణా ప్రతాపుని చారిత్రక గాథను స్వాతంత్ర్యోద్యమ చైతన్య ప్రబోధదాయకంగా చిత్రించి, తెలుగువారికి వినిపించారు. అదే వరుసలో ఎన్నో కావ్యాలను ఆ ఉద్యమానికి ఉపాయనంగా సమర్పించారు. రాణా ప్రతాపుడు సాగించింది రాజకీయ యుద్ధమైనా ఆకృతిలో మనకు స్వరాజ్యోద్యమానికి ప్రతిబింబంగా భాసించింది. తెలుగువారు సాగించే స్వాతంత్ర్య సంగ్రామానికి ఒక క్రొత్త ఆవేశాన్ని అందించింది. రాణా ప్రతాపునిలో మహాత్మా గాంధీ మనకు దోబూచులాడుతూ ప్రత్యక్షమౌతాడు. అతనిలోని త్యాగం, దీక్ష, స్వార్థరాహిత్యం, సత్యనిరతి - అన్నీ వెరసి రాణా ప్రతాప సింహానిలో రాణిస్తాయి. ఆ పాత్ర జాతి స్వాతంత్ర్యేచ్ఛకు ప్రతీక (Symbol) మాత్రంగానేకాక ప్రాగ్రూప (Archetype) పరికల్పనంగా సహృదయులకు ఒక విశిష్టానుభవాన్ని కలిగిస్తుంది.

'శివభారతము' చారిత్రక రసకావ్యాలలో తలమానికం, దుర్భాకవారు జాతిలో కవితతో ఆవేశం మోసులెత్తింపజేస్తే, గడియారం వారు కవితతో జాతిని ఆలోచింపజేశారు. శివాజీ చరిత్రలో సంగ్రామగాథ ఎంత ఉన్నదో, ధర్మ బోధ అంత ఉన్నది జాతికి వీరమాతలు కావాలి; ధర్మవీరులు కావాలి, ధర్మం త్యాగశీలంతో తేజరిల్లాలి; భక్తిగా సాగి శక్తిగా రూపొందాలి; ఐహికంలో ఆముష్మికం ప్రజ్వరిల్లాలి. శివాజీ చరిత్రం తెలుగువారికి దేశభక్తిని, ధర్మశక్తిని ప్రబోధించింది. స్వాతంత్ర్యానికి పూర్వం రాణాప్రతాపుడు, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత శివాజీ - మనకు మార్గదర్శకులు. వారిరువురిలో ఉండే భేద సాదృశ్యాలను సమీక్షిస్తూ డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారిలా వివేచించారు-

"సనాతన ధర్మ పునరుద్ధరణకు కంకణము గట్టి పరిశ్రమించిన వారిలో రాజపుత్రులు - తరువాత మహారాష్ట్రులు ముఖ్యులు ఇద్దఱును భారతచరిత్రలో మహా ఖ్యాతిఁ బొందినవారు కాని, ఒకరు కృతకృత్యులు కాలేదు; కాలక్రమమున శత్రువులకు వశులై పరరాజ్యాభివృద్ధికి పట్టుకొమ్మలైనారు శత్రువులను ధిక్క-రించి శౌర్య సాహసములను వెలయించి, అంతరించినవా రంతరించగా మిగిలిన యోధులు పరులు సింహాసనములముందు మోకరించి తలవంచినారు. భారతనారీ ధర్మమును నిలుపుటకై అగ్నియందుఁ బ్రవేశించిన వీరపతివ్రతలు గతింపగా కొందఱు రాజపుత్ర స్త్రీలు మొగలు జనానాలో ప్రవేశించినారు. అది కాల మహిమ దానికి 'మొండి తెగువ' కారణము".

"మహారాష్ట్రులట్టివారు కారు వారు రాజపుత్రులవలె కాక 'సమయమెరుచ్ఛ' ఘనులు! వారికి 'మోటు తెగువ' లేదు. అడగుగాక, పేడియగుగాక, పెనుపీక నాల త్రిప్పువాడె యర్జునుండు.' పరాపహృతమైన భారత భూధేనువును త్రిప్పి శివాజీ అర్జునుండై, నాటి భారతోదంతము నవిచ్ఛిన్నముగ సాగించినాడు, కృత కృత్యుడైనాడు. ఒక్కొక్క మహారాష్ట్రుడు ఒక్కొక్క భారతీయుడు తన యంతటివాడగుటకు వలయు దీక్షా బీజములను వెదజల్లి నిష్క్రమించినాడు."

"శివునికి యవనులపై నసూయలేదు. భారతభూమి సకల ప్రపంచమునకు ఆతిథ్య మీయగలదు. కాని, అతడు 'నా' 'నీ' అను భేదముల మూలమున ఒక తెగ కన్యాయము జరుగుట సహించలేదు."

'యవనుల్ హైందవు లన్న భిన్నత నసూయం జూపగా లేదు తా
మెవరీ రాజ్యము నేలినన్ తగవు లేనేలేదు, నీ నా యటం
చవకాశమ్ము నుబట్టి యొక్క తెగ కన్యాయంబు గావింప నౌ
నవునం చూరక 'వంత పాట పని' సేయంజాల.... ......." (ద్వి. 133)

డాతడు. ఈ వంతపాట పని జరుగునప్పుడు సంఘర్షణము, అగ్గి, కార్చిచ్చు కలుగుతూ ఉంటవి. భారతావనీపాలకు లెవ్వరైనా ఇట్టి విపరీత పరిణామము కలుగకుండా చేయడమే నీతి." (శివభారతము, ఉపోద్ఘాతము.)

డా॥ చిలుకూరివారు రాణా ప్రతాపునీ, శివాజీనీ, అటు రాజపుత్రుల ప్రవృత్తికీ, ఇటు మహారాష్ట్రుల ప్రవృత్తికీ ప్రతినిధులుగా ప్రత్యేకించి వ్యాఖ్యానించారు. అయితే, భారత స్వాతంత్ర్యోద్యమాన్ని సాగిస్తున్న భారతీయుల ప్రవృత్తులకు వారిరువురూ ప్రాగ్రూప వ్యక్తులుగా ఆ కావ్యాలలో రాణించారని వ్యంగ్యంగా వ్యాఖ్యానించారు. రాజపుత్రులలో యుద్ధంలో పరాజయం పొందిన వారూ ఉన్నారు. వీరస్వర్గం పొందిన వీరులూ, ఆత్మాహుతి చేసుకొన్న వీరవనితలూ అధికసంఖ్యలో గోచరిస్తారు. విధివంచితులై పరుల కొలువులో చేరినా తరుణం కోసం వేచియుండి స్వతంత్రశక్తులకు సానుభూతి సహకారాలందించే పాత్రలూ కనపడతారు. వీరులు గతించినా స్వాతంత్ర్యేచ్ఛ నశించదు. అవిచ్ఛిన్నంగా ముందుకు సాగుతూవుంటుంది- జాతి పారతంత్ర్యంలో అనుభవించే పరిభవాగ్నిని రాజపుత్రుల రాజసం మనలో రగులింపజేస్తుంది. ప్రతీకారంలో భారతీయమైన 'సత్యాగ్రహ' మార్గాన్ని అనుసరించే రాజపుత్ర వీరులు మనలోని జాతిపరమైన సామూహిక అవచేతనను పరోక్షంగా జాగృతంచేసి, వారిని మన జాతి ప్రాగ్రూప ప్రతినిధులుగా భావించి, రమించి, రసానుభవస్థితిని పొందేటట్లు చేస్తారు. మహా

రాష్ట్రీలు కార్యశూరులు, కార్యసాధకులు. శివాజీ ఉద్యమసాధన ప్రవృత్తికి ప్రాగ్రూపశక్తి దాసబోధ భారతీయతత్త్వ దర్శనానికి ప్రతీక. శివాజీ ఆ దర్శనంలో నుండి పుట్టిన ఆదర్శకార్యశక్తి విషాదాంతాలైనా రాజపుత్రవీరుల కథలు పారతంత్ర్యాన్ని పారద్రోలే ఉద్యమాలకు ఊపిరిపోసే ఉజ్జ్వలగాథలు. వీరిలో భారతీయమైన వీరరససిద్ధితోపాటు పాశ్చాత్య విషాదాంత నాటకాలలో అనుభవానికి అందే కథారిసిస్ స్ఫూర్తి ఉంది విధి వారికి అనుకూలించకపోవటమే విషాద వాతావరణకల్పనకు దోహదం ఆ రెండూ కలిసి ఒక వింత అనుభవాన్ని అందిస్తాయి. ఒక విధంగా దుర్భాకవారి కావ్యాలు సానుభూతితోకూడిన సహానుభూతినిపొందే శక్తిని కావ్యనాయక పాత్రకు కల్పించాయి. గడియారంవారి కావ్యాలు ప్రధాన పాత్రలో 'అపద్ధర్మాలను' పాటించే పద్ధతులను కల్పించి, అవి 'ట్రాజిక్ ఫ్లా'కు ప్రత్యామ్నాయంగా రూపొందించి, అవి విజయలబ్ధికి అనుసరించే కాలోచిత కుశలకర్మలుగా వ్యాఖ్యానించి సానుభూతిని, సహానుభూతికి పోషకంగా నిలిపాయి. సానుభూతి కెథార్సిస్‌లోనూ, సహానుభూతి రసంలోనూ ప్రధానపాత్ర నిర్వహిస్తాయి. స్వాతంత్ర్య వీరులలోని వ్యక్తిగత లోపాలను క్షమిస్తారు పాఠకులు. ఆ లోపాలను సానుభూతిని పోషించే శక్తి కేంద్రాలుగా మలచటం చారిత్రక రసకావ్యాలలో గోచరించే విశేషం.

ఏ జాతి చరిత్రనైనా కావ్యంగా వ్రాస్తే అది ఇతిహాసమౌతుంది. చరిత్ర రసవ్యాఖ్యతో రమణీయాకృతి తాలుస్తుంది తెలుగు రాజుల ప్రతాపచరిత్ర ఆంధ్ర పురాణం వస్తుకావ్యాలలో విలక్షణమైన మార్గం దానిది. ఆంధ్ర పురాణం వట్టి చారిత్రక కావ్యమంటే చాలదు. ఆదినుండి ఆంధ్రజాతిలో క్రమంగా వికాసం చెందుతున్న అభిమాన దశావస్థలను ఆయా యుగప్రవృత్తుల నాశ్రయించుకొని ఆవిష్కరించే అంతస్సూత్రాన్ని సమన్వయసుందరంగా, వ్యంగ్యమధురంగా, ఏకవాక్యతాలక్షణంగా సంపదించుకొన్న వస్తుకావ్యం. ఈ లక్షణాన్ని విలక్షణంగా వ్యక్తీకరించడమే మధునాపంతులవారు పురాణీకరించట మన్నదానికి తాత్పర్యం. అందువలన ఆంధ్ర పురాణనామం అక్షరాలా సార్థకం. అటువంటి కావ్య ప్రక్రియకు ఆదర్శ ప్రయోగం! తెలుగులో అటువంటిది అంతకు పూర్వం లేదు. జాతి చరిత్రను, సాహిత్య చరిత్రను కావ్య ప్రక్రియలో మలచే ప్రయోగాన్ని నవ్య సంప్రదాయవాదులు మాత్రమే భావించగలరు; ప్రయోగించగలరు. అలాగే దేశ స్వాతంత్ర్య సంగ్రామచరిత్ర కవితా జీవితంలో జాలువారిన కృతి

'వందేమాతరం.' ఆంధ్రులకు ఆత్మచరిత్ర ఆంధ్ర పురాణం భారతీయాంధ్రులకు మాతృ (దేశ) గీతం 'వందేమాతరం.' రాష్ట్రాభిమానం, రాష్ట్ర సమైక్యత, దేశాభిమానం, దేశ సమైక్యత అనే ఉత్తమభావాలు చారిత్రక కావ్యపఠనం వలన జాతిలో ప్రబుద్ధం కావటం నాడూ, నేడూ మనకు అందుబాటులో ఉన్న అనుభవం.

విశ్వనాథవారు చారిత్రక తత్త్వ కావ్యప్రక్రియను తెలుగులో ప్రయోగించి చూపిన ప్రయోక్త. ఆయన కవితలో దర్శనశక్తి ఉంది. దాన్ని చరిత్రకు నేర్పాడాయన స్వాతంత్ర్య దీక్షను ఒక యజ్ఞంగా భావించి, దేశంకోసం తన జీవితాన్ని ఒక కర్పూర నీరాజనంగా అర్పించిన త్యాగవీరురాలు ఝాన్సీ లక్ష్మీబాయి. ఆమె దృక్పథంలో స్వాతంత్ర్య సమరమంటే—

"....స్వతంత్రభాను మహిమ్మ్రకతు వియ్యది యీ మహాగ్నిలో
నుఱికినవాఁడు దీన మఱియున్ హంతమౌటయె వెన్క కేగుటన్
సరణియె లేద యిందుఁబడి జచ్చిన దుఃఖము తప్పిపోవు న
ఖ్ఖరమునులే దకాలమయ పూరుష పౌరుషవహ్ని లేదికన్."

సఫలం కాని స్వాతంత్ర్యసమరాన్ని కాలమహిమగా చిత్రించి ఋతువర్ణనాదులతో దానిని సమన్వయించి కావ్య నిర్వహణాన్ని అపూర్వంగా చేసిన విశ్వనాథ చారిత్రకతత్త్వ కావ్యశిల్పి. ఇటువంటి కావ్యమే వారి 'శివార్పణం.'

విశ్వనాథవలెనే 1857 జాతీయ విప్లవాన్ని ఇతివృత్తంగా తీసికొని లఘు కావ్యాన్ని సంతరించిన వారిలో ప్రసిద్ధులు 'సిపాయి పితూరి' కావ్యకర్త శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు. వారి ఈ క్రింది పద్యం చారిత్రక కావ్య కర్తలైన నవ్య సంప్రదాయవాదుల ఆశయానికి అద్దం:

"మహితంబైన స్వతంత్ర భారతము నిర్మాణంబు సేయంగ దు
స్సహ కష్టంబుల కోర్చి వీరులయి స్వచ్ఛందంబుగా బోరి శ
త్రుహత ప్రాణులుగా ధరంబడిన నిత్యుల్ నాకు సాక్షాత్కరిం
త్రు హితాశీస్సులు నింత్రుగాక భవమందున్ భావలోకంబులన్.''

నవ్య సంప్రదాయోద్యమ కవులకు చారిత్రక కావ్య ప్రక్రియ చక్రాయుధంలా ఉపయోగపడింది ఆ ఉద్యమానికి చారిత్రక కావ్యం ఊపిరి. *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 18-2-1990)

# నవ్యసంప్రదాయం : చారిత్రక నవల

నవ్యసంప్రదాయోద్యమంలో వెలువడిన పద్యరూపాలలో చారిత్రకకావ్యం ఎంత విశిష్టమైనదో, వచన రూపాలలో చారిత్రక నవల అంత ప్రసిద్ధమైనది. చారిత్రక కావ్యానికిలాగానే చారిత్రక నవలకు కూడా ఒక ప్రత్యేక చరిత్ర ఉంది. ప్రబోధకవిత్వరూపంలో వెలువడిన ఖండకావ్యం క్రమంగా కాల్పనిక చైతన్యం నుండి నవ్యసంప్రదాయోద్యమంవైపు సాగిపోయిన కవుల చేతుల్లోనూ, భావ కవితాప్రభావం లేని దుర్భాక, గడియారం లాంటి కవుల చేతుల్లోనూ మహాకావ్య రూపగౌరవంతో చారిత్రక కావ్యంగా పరిణతి చెందింది. అది అలా ఉండగా, ప్రబోధ కవిత్వాన్ని లేదా దేశభక్తి కవిత్వాన్ని లేదా రాష్ట్రాభిమాన కవిత్వాన్ని లేదా స్వాతంత్ర్యోద్యమ గీతాలను, కవితలను పూర్తిగా కాల్పనిక కవిత్వశాఖలు గానే భావించాలనా, అంతకంటె విలక్షణంగా వివేచించి పరిగణించాలనా అనే అభిప్రాయాలు ఆధునికులలో ఉన్నాయి. వామపక్షీయులు ఈ శాఖను శుద్ధ కాల్పనిక ప్రవృత్తి గలదిగా లెక్కించరు. అయితే, కాల్పనిక ప్రవృత్తిని మన్నించే దేశభక్తి కవితారూపంగా పరిగణిస్తారు. మిగతావారు దేశభక్తి కవిత్వాన్ని కాల్పనిక కవిత్వోద్యమంలోని భాగంగానే పరిగణిస్తారు. కాని, దాని ధోరణి భావకవిత్వం కంటె భిన్నమైనదిగా గుర్తిస్తారు. ఈ పద్ధతి సత్యానికి చాలా దగ్గరగా ఉంటుంది.

అసలు విషయ మేమంటే - ఆంధ్రదేశ చరిత్రను గురించి తెలుగువారు అప్పుడే పరిశోధనలు మొదలుపెట్టి, క్రొత్త క్రొత్త ఆకరాలద్వారా లభిస్తున్న ఆంధ్రేతిహాస చరిత్ర శకలాలను ఆశ్చర్యంతో అధ్యయనం చేయటం, ఒక శాస్త్రీయమైన చరిత్రను నిర్మించే యత్నంలో ఆకరాలు దొరకని ఖాళీలను కొన్ని ఊహలతో, తార్కిక అనుమానాలతో పూరించటం జరుగుతున్న రోజులవి. అందువలన చారిత్రక కావ్యం కంటె చారిత్రక ఖండకావ్యం ముందు వచ్చింది. ఆ తరువాత ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి, సాహిత్యం మొదలైన అంశాలమీద

అవగాహన పెరిగిన తరువాత 'ఆంధ్రపురాణం' లాంటి చారిత్రక కావ్యాలు వచ్చాయి. ఆంధ్రపురాణం ఆంధ్రులచరిత్ర సంస్కృతులకు సాహిత్యచరిత్రలకు సంబంధించిన ఒక సమన్వయసూత్రం సాధింపబడిన తరువాత వెలువడిన సాహిత్యప్రక్రియ. అలాగే భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర నిర్మాణం ఒక స్థాయికి వచ్చిన తరువాత వెలువడిన మహాకావ్యం 'వందేమాతరం' చారిత్రక అవగాహనతోపాటు చారిత్రకకావ్యం అవతరించింది. భారతీయ సంస్కృతిమీద, సాహిత్యంమీద, చరిత్రమీద- అలాగే ఆంధ్ర భాషా సాహిత్య సంస్కృతులమీద చరిత్రమీద అభిమానంతో స్వీయజాతి గౌరవ నిర్మాణ దీక్షతో వెలువడిన ఉద్యమం నవ్యసంప్రదాయోద్యం కాబట్టి ఆ ఉద్యమ ఆరంభ వికాసదశలకు దేశ భక్తి కవితలు, దేశచరిత్ర కావ్యాలూ క్రమంగా ప్రాతినిధ్యం వహిస్తాయి.

చారిత్రకకావ్యం వంటిదే చారిత్రక నవల కూడానూ. ఈ ప్రక్రియ పుట్టటానికీ పెరగటానికీ దోహదంగా నిలిచేది చారిత్రక సామగ్రి. దాని లబ్ధినిబట్టి, అది సమకాలీన సామాజిక పరిస్థితుల కనువుగా ఉండేదాన్నిబట్టి చారిత్రక నవల జీవితం సాగుతుంది. తెలుగులో స్వతంత్ర చారిత్రక నవల పుట్టుపూర్వోత్తరాలను గురించి నోరి నరసింహశాస్త్రి గారి మాటలు గమనింపదగినవి—''In the last decade of the last century, the Historical Novel in Andhra made its first appearance under the inspiration of Todd's Tales of Rajasthan The valour and courage of Rajasthan heroes was the favourite subject of our novelists, poets, dramatists for long time. After a few years, the exploits of Sivaji began to share with the Rajasthan heroes the favcur of Andhra Writers. But our writers had no intimate knowledge, of the social and geographical back-ground or the background of the heroes against which their exploits were enacted. As such, the writings were naturally un-convincing except as mere heroic incidents without a real background. But, towards the end of first decade of this century, a comprehensive history of Andhra was first attempted and soon other historians gradually revealed the

glories of Andhra history by their labours. Thereafter Andhra writers began to present Andhra heroes. They were now in an atmosphere familiar to them and their writings began to be more and more convincing." (Telugu Novel - Yuvabharathi Publication (1975) పు. 24.)

నోరివారు చెపుతున్న పరిస్థితులు నవలలకు ఎంతవరకు వర్తిస్తాయో, కావ్యాలకూ నాటకాలకూడా ఆ విధంగానే వర్తిస్తాయి. అయితే నవల వాస్తవికత ప్రాతిపదికగా కలిగింది. దానికి అనుబంధంగా కాల్పనికత, ఊహాకల్పన, సమాహార స్వభావం అనే మరో మూడు లక్షణాలు కూడా ఉంటాయి. ఈ నాలుగు లక్షణాలు సాంఘిక నవలకు యథాతథంగా వర్తిస్తాయి. మరి, చారిత్రక నవలలో వాస్తవికతకు బదులు చారిత్రక సత్య నిబద్ధత మొదటి లక్షణంగా ఉంటుంది. మిగిలిన మూడూ తత్పోషకంగా సంపదింపబడి ఉంటాయి. అయితే, చారిత్రక నవలల్లో కూడా ఈ నాలుగు లక్షణాలలో ఒక్కొక్కటి ప్రాధాన్యం వహించే నాలుగురకాల ప్రయోగాలు ఉండవచ్చు. వాటిలో కాల్పనికతకూ, ఫాంటసీకి అధిక ప్రాధాన్యం ఉండే ప్రయోగాలు కాల్పనికయుగంలోనూ; చారిత్రకతకూ సమాహార స్వభావానికీ ప్రాధాన్యముండే ప్రయోగాలు నవ్యసంప్రదాయ యుగం లోనూ; వాస్తవిక స్వభావం బలంగా ఉండే ప్రయోగాలు అభ్యుదయ చైతన్యం లోనూ ఎక్కువగా వెలువడటానికి వీలుంటుంది. తెలుగులో అలాగే జరిగింది కూడా!

తెలుగులో స్వతంత్ర చారిత్రక నవలా ప్రక్రియా వికాసానికి కారకులైన వారిలో ప్రధానులు - విశ్వనాథ సత్యనారాయణగారూ, అడవి బాపిరాజుగారూ, నోరి నరసింహశాస్త్రిగారూ- ఈ ముగ్గురూ మూడుదశలకూ, మూడుస్వభావాలకూ ప్రముఖంగా ప్రాతినిధ్యం వహిస్తారు.

విశ్వనాథ వారి ఏకవీర (1925), బద్దన్న సేనాని (1938), కడిమిచెట్టు (1946), ధర్మచక్రము (1947) మొదలైనవి ఒక తెగకు సంబంధించిన చారిత్రక నవలలు. మరో తెగకు చెందినవి 1958-61 నడుమ రచించిన పురాణవైరి గ్రంథమాలలోని పన్నెండు నవలలు, 1967 నుండి వ్రాసిన నేపాలదేశ చరిత్రకు

సంబంధించిన నవలలు. విశ్వనాథవారు స్వతంత్ర చారిత్రక నవలావికాసంలో మొదటిదశకు ప్రతినిధి. ఏకవీర, బద్దన్న సేనాని, కడిమిచెట్టు, ధర్మచక్రము - అనే చారిత్రక నవలలు అచ్చంగా కాల్పనిక యుగచైతన్యాన్ని ఎక్కువగా మన్నించినవి. ఆకృతిలో, ప్రకృతిలో కూడా కవితల్లో ఖండకావ్యాల్లాగా పరిమితమైనవి, మధురమైనవి. నవలాలక్షణాల్లో కాల్పనికతకు వాటిలో పట్టం కట్టబడింది. డాక్టర్ మొదలి నాగభూషణశర్మగారి అంశాన్నే భంగ్యంతరంగా చెప్పారు - "విశ్వనాథ చారిత్రక నవలలలో ఒక విశేషం వున్నది. చారిత్రక భ్రాంతి కల్పించటానికి ఆయన ఎక్కువగా పాటుపడడు. ఆ కథలో వుండే సంఘర్షణే పాఠకులను ఆకట్టుకుంటుంది. కథాభాగం, పాత్రలలోని వైచిత్రి, సంఘటనలలోని బలం ముఖ్యం. కాని, చరిత్రను అంతగా ఆదరించడు. ఒక్క ఏకవీరలో మాత్రం యిందుకు భిన్నంగా కొన్ని చారిత్రక సంఘటనలను కూడా-కథకు అనువైనవానిని - చేర్చి, చరిత్రను నవలలో ముఖ్యభాగంగా నిర్మించాడు." (తెలుగు నవలా వికాసం (1971) - పు. 83.)

విశ్వనాథవారి మిగతా తెగలకు సంబంధించిన నవలలు రూపంలో పెద్దవి. స్వభావంలో సంశ్లిష్టమైనవి. వాటిల్లో కాల్పనికత ఎంత ఉంటుందో సమాహార స్వభావం అంత ఉంటుంది. అవి నవ్యసంప్రదాయ యుగచైతన్యంతో వ్రాసిన బృహత్ నవలా ప్రక్రియలు. వాటిని ఒక్కొక్క నవలగా చదువుకోవచ్చు; ఒక్కొక్క గ్రంథమాలలో వెలువడిన నవలలన్నీ ఒక సంపుటిగా పరిగణించవచ్చు. ఒక్కొక్కటి చదివితే ఒక్కొక్క చారిత్రక నవలాప్రయోగం; అన్నీ కలిపి చదువుకుంటే ఐతిహాసిక నవలా సంహిత! విశేషమేమంటే - విశ్వనాథ వారు కాలక్రమంగా చారిత్రక నవలా వికాసంలో మొదటి దశకు మొదట చెందినా, చివరకు పరిణత దశను కూడా ప్రదర్శించారు. తెలుగులో ఇలా కాల్పనిక ప్రవృత్తిని, నవ్యసంప్రదాయోద్యమ స్ఫూర్తిని ప్రపంచించిన చారిత్రక నవలారచయితల్లో ప్రథమగణ్యుడు విశ్వనాథ సత్యనారాయణగారే.

అడవి బాపిరాజుగారు రెండవ దశకు ప్రాతినిధ్యం వహిస్తారు. విశ్వనాథ వారు తమ చారిత్రక నవలల్లో చరిత్రను కొన్ని కొండగుర్తులుగానే పరిచయం చేస్తారు. చెప్పదలచుకొన్న తత్త్వానికో, అందించదలచుకొన్న సందేశానికో, చిత్రింపదలచుకొన్న సంఘర్షణకో, సమస్యకో అనుగుణంగా ఉండే చారిత్రకాంశా

లనే ఎన్నుకొని ఇతివృత్తంగా మలిచి కళాత్మకంగా వ్యక్తీకరిస్తారు. అందువలన విశ్వనాథవారి నవలల్లో చరిత్ర - చెరువులో చేపలాగా నడయాడుతూ ఉంటుంది. అడవి బాపిరాజుగారి నవలల్లో కథాకాలానికి సంబంధిన చారిత్రక వాతావరణం బాగా ఆవరిస్తుంది. కాని, అందులోని పాత్రలు మాత్రం చాలవరకు బాపిరాజుగారి చెప్పుచేతల్లోనే భావబంధురంగా కళాత్మకంగా-ఒక్కొకసారి ఆదర్శ సుందరంగా జీవిస్తాయి. చరిత్రను రంగులతో, రేఖలతో చిత్రించినట్లుంటుంది బాపిరాజుగారి రచన.

బాపిరాజుగారి ప్రసిద్ధ చారిత్రక నవలలు- హిమబిందు, గోన గన్నారెడ్డి, అడవి శాంతిశ్రీ - ఈ మూడూ ఆంధ్రచరిత్రకు సంబంధించినవే. అటు శాతవాహనులను, ఇటు కాకతీయులను, మరి - విజయపురి ఇక్ష్వాకులను, వారి కాలంలోని వాతావరణాన్ని సజీవంగా చిత్రించిన నవలలివి. అడవి బాపిరాజుగారు చరిత్ర నవలా కాలంలోని వాస్తవాలను పరిశీలకందించే ఓర్పు, నేర్పు ఎంత విరివిగా ప్రదర్శిస్తారో, పాత్రల, సన్నివేశాల ఆదర్శీకరణం చేయటానికి కూడా అంత తాపత్రయపడతారు. ఆదర్శీకరణ ప్రవృత్తి క్లాసిక్ స్వరూపాన్ని నవలకు కల్పించటంలో తోడ్పడుతుంది. విశ్వనాథవారి మొదటి తెగలోని నవలలు చారిత్రక నవలను కాల్పనికయుగ చైతన్యంలో జీవింపచేస్తూనే, అక్కడినుండి ముందుకు సాగాలన్న ఆకాంక్షను వ్యక్తం చేస్తాయి. వేయిపడగలు మొదలైనవి వెలుపలికి వచ్చి తమ వ్యక్తిత్వాలను చాటుకొన్నాయి. అయితే, చారిత్రక నవల బాపిరాజుగారి కాలంలోనే నవ్యసంప్రదాయ మార్గంలో ఆదర్శరూపం వైపు పయనించటం నేర్చుకొన్నది. ఆ ప్రయాణాన్ని గమ్యానికి చేర్చినవారు నోరి నరసింహ శాస్త్రిగారు. స్వతంత్ర చారిత్రక నవల ప్రౌఢ ప్రక్రియగా మారటానికే కాక, తెలుగు సాహిత్య చరిత్రలోని మహాకవుల మూర్తిమత్వాలకు అపూర్వ చిత్రణ నందించి, ఆ పాత్రలను చారిత్రక సత్యాలుగావే కాక ఆంధ్ర ప్రజల హృదయాలలో నుండి వెలువడిన ప్రాగ్రూపాలుగా భాసించే అనుభవాన్ని అందించటానికి కూడా కృషి చేసింది. నోరివారి నవలలు చారిత్రక వాతావరణం కలిగించటంతోపాటు అందులో జీవిస్తున్న అనుభవాన్ని కూడా అందిస్తాయి. వారి నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి, కవిసార్వభౌముడు, ధూర్జటి, కవిద్వయం మొదలైన నవలలు తెలుగువారిలో బహుళ ప్రచారంలో ఉండటమే కాకుండా, తెలుగులో చారిత్రక నవలా ప్రక్రియకు ప్రామాణిక రూపాలుగా గూడా పరిగణింపబడుతూ ఉన్నాయి.

విశ్వనాథ, అడవి, నోరి - ఈ ముగ్గురూ నవ్యసంప్రదాయ మార్గ ప్రవర్తకులుగా చారిత్రక నవలా ప్రక్రియను ప్రయోగించారు. సామాన్యంగా నవ్యసంప్రదాయ యుగ నవలల్లో మూడు స్వభావాలు గోచరిస్తాయి. వాటిల్లో మొదటిది - తెలుగువారి సాంస్కృతిక, మత, తాత్త్వికాంశాలకు చారిత్రకాంశాలకంటె ఎక్కువ చోటిచ్చే స్వభావం. రెండవది - కథాకాలానికి చెందిన జీవిత విశేషాలను వివరాలను తెలుపుతూ, జీవన విధానాలకు సంబంధించిన సమకాలీన భావ సంఘర్షణలనూ, గాంధేయ సిద్ధాంతంలో వాటి సమాధానాల కోసం చేసే అన్వేషణలనూ చిత్రించే స్వభావం మూడవది - ఆంధ్ర వీరులను, కవులను సాధ్యమైనంతవరకు చారిత్రక భూమికలుగా పరిచయం చేస్తూనే, వారి చరిత్రకాతికొక ఉత్తేజాన్ని కలిగించేటట్లు చెప్పటం; చరిత్రలో వివరాలు తెలియని ఖాళీలను కాల్పనిక శక్తితో పూరించి, వాటికి వాస్తవస్ఫూర్తిని కలిగించే స్వభావం. ఈ మూడు రకాలకూ క్రమంగా విశ్వనాథవారూ, బాపిరాజుగారూ, నోరివారూ ప్రాతినిధ్యం వహిస్తారు.

ఈ ముగ్గురి చేతుల్లో చారిత్రకనవల ఎలా వైవిధ్యాన్నీ,వైశిష్ట్యాన్నీ సాధించిందో డాక్టర్ మొదలి నాగభూషణశర్మగారిలా వివరించారు—"విశ్వనాథ, బాపిరాజు, నోరి-ముగ్గురూ గొప్ప నవలాకారులు. తెలుగు చరిత్ర ఆధారంగా రచనలు చేశారు అందులో విశ్వనాథ చరిత్రను కేవలం భూమికా మాత్రంగానే స్వీకరించాడు. ఆయనకు కథ ముఖ్యం ఇతివృత్తాన్ని యిష్టం వచ్చినన్ని మలుపులు మళ్ళిస్తూ కూడా వస్త్వైక్యం చెడకుండా నిలబెట్టి తన రచనను సుసంఘటితమైన శిల్పమూర్తిగా వెలువరించే నేర్పుగలవాడు. చరిత్రాత్మక నవలలో చరిత్ర ప్రధాన స్థానం వహిస్తుంది. గంభీరమైన పాత్రలు, ఉదాత్తమైన కథాకథనం, రచయిత తాను స్వీకరించిన కాలానికి అనుగుణంగా చిత్రించే వాతావరణ కల్పన- ఇవి చారిత్రక నవలలకు ముఖ్య లక్షణాలు అంతవరకు యీ ముగ్గురి రచనలు ఒకే పద్ధతిని అనుసరించాయి. కాని, విశ్వనాథలో చరిత్రకన్న కథ ముఖ్యం. నోరిలో చరిత్ర పునర్నిర్మించడానికి గట్టి పట్టుదల ఉన్నా, సంఘటనలలో, పాత్ర చిత్రణలో కొంత ఆధునికత, కొంత సమకాలీన జీవనాన్ని ప్రతిబింబింపజేయాలనే ఆకాంక్ష కనిపిస్తుంది ఇక బాపిరాజు తన నవలలలో చారిత్రక భావాన్ని సృష్టించడంలో కృతకృత్యుడైనాడు. దానికి బహుశః ఆయన చేసిన వర్ణనలు ఒక ముఖ్యమైన కారణం కావచ్చు."

''తిరిగి ఈ వర్ణనంలో కూడా యీ ముగ్గురిలో వైవిధ్యం ఉంది. విశ్వనాథ వర్ణనలు ప్రతీకాత్మకాలు. అవి పాత్రల మనోచిత్రణకు ఎంతో ఉపకరిస్తాయి. నోరి వారిలో వర్ణనలు తక్కువ ఉన్న వర్ణనలు కూడా పాత్రనిష్ఠమైనవి. ఇక బాపిరాజుగారి వర్ణనలు - తాను ఏ కాలాన్ని చిత్రిస్తున్నాడో ఆ కాలంలోని అన్ని విషయాలను - ఉదాహరణకు భవనాలను రాజమార్గాలను, సైన్యాన్ని, వేషభాషల్ని, ప్రతి చిన్న విషయాన్ని కూడా వర్ణిస్తాయి. ఈ వర్ణించడంలో చిత్రలేఖనంలో చూపించే నేర్పంతా చూపించాడు బాపిరాజు.'' (తెలుగు నవలా వికాసం (1971) పు. 78-79.)

చారిత్ర కావ్య రచనలో దుర్భాక, గడియారం, విశ్వనాథ మూడు రకాల శైలులను ఆ ప్రక్రియకు నెలకొల్పారు - అలాగే చారిత్రక నవలకు విశ్వనాథ, అడవి, నోరి - మూడు ప్రవృత్తులను సంతరించారు చారిత్రక కావ్యాలు మరెన్నో ఆంధ్ర పురాణాం, వందేమాతరం లాంటివి వెలువడ్డాయి. అలాగే చారిత్రక నవలలు కూడా ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు చారిత్రక నవలలకే కొన్నినాళ్ళు బహుమతులిచ్చారు. శ్రీమతి మల్లాది వసుంధర, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి, డా॥ పాటిబండ మాధవశర్మ, డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి ప్రభృతులు బహుమతులను పొందారు అప్పటికి, ఇప్పటికి చారిత్రక నవలా ప్రక్రియ ఆగిపోకుండా సాగివస్తూనే ఉన్నది. ఏమైనా 1935 - 1975 సం॥ల నడుమ వెలసిన చారిత్రక నవలలన్నీ నవ్యసంప్రదాయోద్యమానికి చెందినవే.

చారిత్రక నవలల్లో ప్రత్యేకంగా పేర్కొనతగింది తెన్నేటి సూరి 'చంఘిజ్ ఖాన్' ''The only novel to my knowledge in Telugu which went beyond India for its subject is this Genghis Khan of Sri Suri....Without any doubt it is one of the best historical novels written in modern times'' అని నోరివారు ప్రశంసించారు.

భావకవిత్వంలో చరిత్ర కావ్యం పుట్టలేదు: అభ్యుదయ కవిత్వంలో పుట్టబోదు; నవ్యసంప్రదాయోద్యమం కని- పెంచిన కమనీయ పద్యరూపం చారిత్రక కావ్యం; మహనీయ వచన రూపం చారిత్రక నవల! ఈ రెండూ ఈ ఉద్యమానికి రెండు వరాలు!!

*

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు : ఆదివారం ఆంధ్రప్రభ - 25.2.1990)

# నవ్య సంప్రదాయం : జాతీయ దృక్పథం

నవ్య సంప్రదాయోద్యమ వ్యాప్తికి తోడ్పడిన పంచశక్తులు సాహిత్య జీవితాన్ని వికసింపజేశాయి. ఆ అయిదింటిని ఇలా పేర్కొనవచ్చు :

1. దేశభక్తి.
2. స్వాతంత్ర్యాసక్తి.
3. రసానురక్తి.
4. సామాజిక సాహిత్యస్పృహ.
5. ప్రక్రియావికాసస్ఫూర్తి.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో దైవభక్తి రసస్ఫూర్తితో పోషింపబడింది. 'దేశభక్తి' ఆధునిక సాహిత్యంలోనే గోచరిస్తుంది. భక్తిరస పోషణంలో దేశభక్తి ఒక నవ్య సమన్వయ దృక్పథాన్ని తెలుగు సాహిత్యానికి అందించింది. దేవుని స్థానంలో దేశం నిలిచింది. దేశం తల్లిగా, శక్తిగా దర్శనమిచ్చింది. ఈ దర్శనంలో జన్మనిచ్చిన భూమిని, కన్నతల్లిగా భావించే సంస్కారం ప్రాతిపదిక, భారతదేశం నా దేశం, నా దేశ స్వాతంత్ర్యం కోసం నేను ఉద్యమిస్తున్నాను, నా దేశానికీ నా తల్లికీ భేదం లేదు. 'మాతృదేవోభవ' అన్నది ప్రాచీన సూక్తి అయితే, 'మాతృదేశమే నా దేవత, నా శక్తి, నా మాతృమూర్తి' అన్నది నవ్య సంప్రదాయసూక్తి. తల్లికి పరపాలన నుండి, దాస్య శృంఖలాల నుండి విముక్తిని కల్గించటమే నాటి దేశభక్తి. జాతికి, దేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించటం అనే స్వాతంత్ర్యానురక్తి ఆ దేశభక్తికి మూలశక్తి. నవ్య సంప్రదాయోద్యమ చైతన్యం స్వాతంత్ర్యోద్యమ వికాసంలో నుండి ఆవిర్భవించిందే. దేశాన్ని తల్లిగా, దేవతగా భావించటంలోనూ. ఆమెయందు దైవరతి వంటి భావాన్ని స్థాయిగా పరిపోషించుకోవటంలోనూ, ఆమె బాధయే తమ బాధగా, తమ ఆకాంక్షలే ఆమె ఆకాంక్షలుగా సంభావించటంలోనూ ఒక నవ్య భక్తిరస

విస్ఫూర్తి తెలుగు సాహిత్యంలో తొలకరించింది. అది జాతికి సమకాలీన స్వాతంత్ర్యోద్యమ వాస్తవ జీవితానుభవాలను, అసువులను మాతృమూర్తి పాదాలపై వుంచే పూజాకుసుమాలుగా భావించే ఒక ఉద్యమ భావనాజగత్తును, ఒక రసానుభవ ప్రతిపత్తిని ప్రసాదించింది. దేశభక్తి అనేది మానవజాతిలో సహజంగా, స్వభావసిద్ధంగా ఉండే ఒక రసభావ సంస్కారమని నవ్య సంప్రదాయోద్యమం గుర్తించి, సాహిత్యంలో రససిద్ధికి దానిని దోహదంగా నిలిపింది. ఒక జాతియొక్క సుప్త చైతన్యంలో సజీవంగా ప్రవహించే 'స్వీయదేశరతి' ఈ రస దర్శనానికి మూలచైతన్యం. దానిని జాగృతం చేయటం నవ్య సంప్రదాయ కవితాలక్ష్యం. అది కావ్య భావ ప్రపంచంలో అలౌకికంగా ఆస్వాదింపబడుతుంది; దేశభక్తి రసంగా అనుభవింపబడుతుంది.

దేశభక్తి రసానికి స్థాయిభావం, స్వాతంత్ర్యోత్సాహం. దేశభక్తి దేశ విముక్తిని సాధించే లక్ష్యంతో మొదట సాగింది. ఆ తరువాత సంస్థానాల విముక్తికై పోరాడింది. ఆ తరువాత ఆఫ్రికాదేశాల వంటి వలస దేశాల స్వాతంత్ర్య లబ్ధికై తన సహకారాన్ని అందించింది నేటికీ ప్రపంచంలో ఏ జాతి అయినా, ఏ దేశమైనా పరాయిపాలనలో అస్వతంత్ర అంధకారంలో మ్రగ్గుతూంటే, దాని స్వాతంత్ర్యంకోసం ఆకాంక్షించి, ఆ ఆశయాన్ని అక్షరబద్ధంచేసి ఆవిష్కరించే సాహిత్య చైతన్యం నవ్యసంప్రదాయోద్యమం కలిగించిన సామాజిక సాహిత్య స్పృహగానే సంభావింపబడుతుంది.

దేశభక్తిరసం నవ్యసంప్రదాయ సాహిత్యోద్యమ ఆత్మచైతన్యం. అది సర్వప్రక్రియా జీవనసూత్రంగా సంభావించటం నవ్యసంప్రదాయోద్యమ లక్షణం. అది అభువు కావచ్చు, చాటువు కావచ్చు, ఉద్యమగీతం కావచ్చు, స్మృతిగీతం కావచ్చు, ఖండకావ్యం కావచ్చు, లఘుకావ్యం కావచ్చు, వస్తుకావ్యం కావచ్చు, రసప్రధానమైన మహాకావ్యం కావచ్చు, పద్యకవిత కావచ్చు, గేయకవిత లేదా వచన కవిత కావచ్చు. రూపం ఏదైనా, ప్రక్రియ ఏదైనా దేశభక్తి స్థాయిగా జీవించే రచన చేయటం నవ్యసంప్రదాయోద్యమ స్వభావం.

ఒక దేశంలో ఒక సాహిత్యోద్యమం ఒక సమకాలీన రాజకీయోద్యమ స్ఫూర్తితో జన్మించి, వికసించి, జీవించి - ప్రజలను కూడా అందులో జీక్షప

చేస్తుంది అనే ఒక నవ్యమైన అనుభవాన్ని ఆంధ్రులకూ, ఆంధ్ర సాహిత్యానికీ
అందింపచేసింది దేశభక్తి కవిత్వమే. అందువల్లనే దేశభక్తి కవితలను జాతీయో
ద్యమ కవిత్వంగా కూడా సాహిత్య చరిత్రకారులు వ్యవహరిస్తున్నారు. దాదాపు
క్రీ.శ. 1905 నుండి 1935 దాకా వెలువడిన దేశభక్తి కవిత్వం ఖండకావ్య
ప్రక్రియ నాశ్రయించి పొంగులువారింది. ఆ తర్వాత ఇది చారిత్రక కావ్యరచనా
చైతన్యంగా ప్రవహించింది. అదే నేటికి కూడా ప్రపంచంలోని జాతివిముక్త్యు
ద్యమ చైతన్యాన్ని సాహిత్యంలో మోసుకొని వస్తోంది.

జాతీయోద్యమం సాహిత్యోద్యమంగా రూపొందటమే సామాజిక సాహిత్య
స్పృహగా నవ్యసంప్రదాయవాదులు సంభావిస్తారు. ప్రయోగాలు నిర్వహిస్తారు.
1935 నాటికే దేశభక్తి కవిత్వం తన ఉద్యమశక్తిని ప్రదర్శించింది. అభ్యుదయ
వామపక్షీయులు మార్క్సిస్టు భావజాలాన్ని తెలుగు సాహిత్యంలో, అందులోనూ
ఖండకావ్యాల్లో వ్యక్తీకరించటానికి మార్గం చూపించిందీ, ఓనమాలు దిద్దించిందీ,
పరోక్షంగా ప్రేరణనిచ్చిందీ జాతీయోద్యమ కవిత్వోద్యమమే. 'మహాప్రస్థానం'
లోని ప్రబోధశక్తిగానీ, ఉద్యమదీప్తిగానీ, గేయస్ఫూర్తిగానీ గాలిలో నుండి
ఊడిపడలేదు. దేశభక్తి గేయాల ఉద్యమశక్తిని, కవితారక్తిని, సామాజిక
సంసక్తిని సరిక్రొత్త ఉద్యమస్ఫూర్తి నాందిగా పలికించటమే శ్రీశ్రీ కవిత్వంలోని
అసలు రహస్యం. చారిత్రకంగా చూస్తే దేశభక్తి కవిత్వంలోని ఉద్యమస్ఫూర్తియే
అభ్యుదయ కవిత్వోద్యమావిర్భావానికి,దాని అభ్యుదయానికి ప్రేరకమైందని స్పష్ట
మౌతుంది. అయితే, అభ్యుదయోద్యమ రచయితల భావజాలంలో కానవచ్చే
నియంత్రత దాని ప్రత్యేకత నిబద్ధత అనేది దేశభక్తి కవులకూ ఉంది,
అభ్యుదయ రచయితలకూ ఉంది. ఒకరిది జాతీయ నిబద్ధత; మరొకరిది
మార్క్సీయ నిబద్ధత. జాతీయోద్యమ కవిత నవ్యసంప్రదాయోద్యమ ప్రగతిలో
ప్రథమరంగం. రెండవరంగంలో ఆ ఉద్యమం మహాకావ్య ప్రక్రియావికాసదశను
అందుకొన్నది. ముందుకు జీవనదిగా ప్రవహించిపోతోంది. సెలయేళ్లూ, జల
పాతాలూ సాగి సాగి ప్రవాహాలుగా మారుతున్నదశ నవ్యసంప్రదాయోద్యమంలో
కనపడుతుంది. అది అందించిన అనుభవం ప్రాతిపదికగా అభ్యుదయ కవిత్వో
ద్యమం సెలయేళ్ళుగా, జలపాతాలుగా పుట్టటం, పరుగెత్తటం 1935 ప్రాంతంలో
నేర్చుకొన్నది. జాతీయోద్యమకవిత జాతిలో ఒక దేశభక్తి మయమైన సంస్కా
రాన్ని జాగృతం చేసింది. అది యూంగ్ చెప్పినట్లు సామూహిక చేతన, అధి

రసానుభవానికి మూలశక్తి. దానిని పోషించి జాతీయోద్యమం ఒక నవ్యసంప్ర దాయాన్ని సాహిత్యానికి సమర్పించింది. అది గాంధీయ సిద్ధాంతంతో ఒక ఔన్న త్యాన్ని సాధించింది.

గాంధీయ దర్శనంలో మానవులలదరూ ఒకటే అయితే ఒకజాతివారు మరోజాతిని పరతంత్రవ్యవస్థలో బలప్రయోగంతో ముంచి, వారి స్వేచ్ఛను హరించటం అధర్మం. అంతేకాదు, మానవధర్మానికి విరుద్ధం. మనిషికి స్వేచ్ఛ వ్యక్తిగతంగా, సమాజపరంగా వికసించటానికి కావలసిన ప్రాథమికమైన అవ సరం. దానికోసం సత్యాగ్రహాన్ని ప్రకటించే హక్కు పారతంత్ర్యంలో ఉన్న వాళ్ళకు నైతికంగా, సహజంగా ఉంటుంది. 'స్వాతంత్ర్యం నాజన్మహక్కు' అనే నినాదం మానవుడు భౌతికంగా, మానసికంగా, బౌద్ధికంగా, సంస్కార గతంగా, అనుభవపరంగా సాధించుకోవలసిన పంచకోశాత్మక ప్రగతికి ప్రేరకం. దేశానికి భౌతికంగా స్వాతంత్ర్యం రావటం మొదటి మెట్టు. దానివలన జాతి వాస్తవప్రధానమైన అనుభూతిని పొందుతుంది; ఆ తరువాత జాతి తన స్వాతం త్ర్యాన్ని మానసికంగా స్పందించటంలో సాధించాలి. ఈ మానసికానుభవం స్వతంత్ర పౌరునికుండే వ్యక్తిత్వాన్ని ప్రసాదిస్తుంది. భౌతిక స్వాతంత్ర్యం వచ్చినా జాతి దానిని మానసికంగా అనుభవించ లేకపోతే స్వాతంత్ర్యం జీవన విధానంగా మారదు. నిత్యజీవితంలో ప్రతిఫలించే స్వాతంత్ర్యమే నిత్యమైనది; సత్యమైనది. స్వాతంత్ర్యం జాతి మనస్సుతో జీవిస్తుంది; బుద్ధితో వికసిస్తుంది. స్వాతంత్ర్య భావవికాసం బౌద్ధికమైంది. బౌద్ధిక వికాసంలో భాగంగానే సాహిత్యం, శాస్త్రం, కళలు మొదలైనవి వస్తాయి. జాతి తన స్వతంత్ర మూర్తిమత్వాన్ని సమగ్రంగా వ్యక్తీకరించుకోవటంలో కళాత్మక వాహికలుగా తోడ్పడేవి సాహిత్య ప్రక్రియలు, కళాప్రయోగాలు. శాస్త్రం వైజ్ఞానికంగానూ, ఉత్పత్తిపరంగానూ జాతి స్వయం పోషకత్వం సాధించటానికి ఉపకరిస్తుంది; హేతుబద్ధంగా, శాస్త్రీ యంగా ఆలోచించటానికి సహకరిస్తుంది. శాస్త్రం వైజ్ఞానికంగానూ, కళాసాహి త్యాలు ప్రజ్ఞాపరంగాను జాతి బుద్ధి శక్తికి రెండు రెక్కలుగా నిలిచి తద్వికాసా నికి దోహదం చేస్తాయి. పక్షికి రెండు రెక్కలెలా ముఖ్యమో, జాతి బుద్ధి శక్తికి కళాశాస్త్రాలు అలా అవసరం.

ఒక జాతి సాంస్కృతిక భూమికనుండి అనుభవ స్పందనలు పుడుతూ ఉంటాయి. వాటినుండే ప్రాగ్రూపాలూ, ప్రతీకలూ, భావచిత్రాలూ, కవి సమయాలూ, ఉపమాసామగ్రులూ, రూపక రూపాలూ, సాహిత్య కళాదర్శనాలూ ఆవిర్భవిస్తూ ఉంటాయి. సాహిత్యోద్యమాలు జాతిలో స్వయంసిద్ధంగా ఉండే ఈ కళా సంస్కార సంపదను క్రొత్త ప్రయోగాలతో, పదబంధాలతో, వస్తుకల్పనలతో, రూపవైచిత్రితో, శైలీవైవిధ్యంతో అభినవంగా అనుభవస్ఫోరకంగా ఆవిష్కరిస్తాయి. జాతీయోద్యమ కవులు ఈ మార్గాన్ని క్రొత్తరుచులతో తెలుగు సహృదయలోకానికి పరిచయం చేశారు. అభ్యుదయకవులు ఆ రుచులకు క్రొత్త తిరుగబోతలు వేశారు రెండు ఉద్యమాలకూ దినుసులు వేరు. కాని, పాకకళ ఒకటే. రూపాలు వేరు. కాని, ప్రయోజనాలు ఒక్కటే.

'దేశభక్తి' జాతిలో ఒక సంస్కార స్థాయిభావం. అది సాహిత్యంలో ఏ కథ నాశ్రయించి ఏ రూపంలో, ఏ భావంగా జాలువారినా అది ఆ జాతికి సద్యఃస్ఫూర్తితో రసానుభవాన్ని కలిగిస్తుంది. ఆంధ్ర మహాభాగవతం ఎలా భక్తి రసాన్ని అలవోకగా పఠితలో ప్రభవింపచేసే శక్తిని కలిగి ఉందో, అలాగే ఆధునిక సాహిత్యంలో కూడా 'దేశభక్తి' ఈ జాతి రసజీవితంలో విశ్వజనీతను సాధింపజేసే శక్తిని సంపాదింపగలిగింది ఇదే అనుభవపరంగా ఒక సాహిత్యోద్యమం సాధింపగలిగే అత్యున్నతస్థితి. ప్రాచీన సాహిత్యంలో 'దేశభక్తి' అనే మార్గం ప్రత్యేకంగా లేదు; దైవభక్తి మాత్రమే గోచరిస్తుంది. కాని, ఆధునిక సాహిత్యంలో దైవభక్తికి దీటుగా దేశభక్తిని నిలిపింది, దేశభక్తిని దైవభక్తికి సాధనంగా సంభావింపగలిగింది గాంధీయ సిద్ధాంత దర్శనమే; నవ్యసంప్రదాయోద్యమమే!

గాంధీయ దర్శనం భౌతిక స్థితినుండి ఆధ్యాత్మిక స్థితివరకూ మానవ వికాస స్థితిని జాతి జీవన పరంగా, విశ్వమానవ భావపరంగా నిరూపింపగలిగిన అపూర్వదర్శనం అది నవ్య సంప్రదాయోద్యమానికి సామాజిక సాహిత్యదర్శన ప్రాతిపదిక నందించింది. అయితే, ఒకటి మాత్రం తప్పక గుర్తుంచుకోవాలి. గాంధీయ దర్శనం మొదట భారత స్వాతంత్ర్య సాధనకు శక్తిమంతమైన ఉపకరణంగా ఉపయోగపడినా, అది జాతిజీవిత విధానానికి కూడా ఒక క్రొత్త గతి సూత్రాన్ని అందించింది. ఆ జాతి జీవన విధానంలో భారతీయ సంస్కృతి

పరంపరగా అందించే జాతి సంస్కారం జీవచైతన్యంగా రాణిస్తుంది. దానికి అభివ్యక్తియే సత్యాగ్రహం. గాంధీజీ సత్యాగ్రహోద్యమం స్వాతంత్ర్యోదమంలోని ప్రధానధార. దానికి ప్రతిస్పందనలున్నా, అవి ప్రయోగాలు చేసినా, చివరకు విజయాన్ని సాధించింది అహింసా ప్రధానమైన సత్యాగ్రహోద్యమమే. నవ్య సంప్రదాయోద్యమ కావ్యప్రయోగాలలో జాతీయోద్యమంలో నినదించిన వివిధ తరంగాల సవ్వడి వినిపిస్తుంది.

అయితే, ఏ ఉద్యమ తరంగం కూడా రచయితల భావాలను శాసించ లేదు; నియమించలేదు. ఈ ఉద్యమాలలో రచయితలు స్వతంత్రులు. స్వాతంత్ర్యం మొదట రచయిత కిచ్చింది స్వాతంత్ర్యోద్యమం. రచయితలు ఏ పార్టీకి సాంస్కృతిక దళంగా పరిగణింపబడలేదు. గాంధీయ మార్గంలో నవ్యసంప్రదాయవాదులు గ్రహించిన స్వాతంత్ర్య సూత్రం ఇదే. ఉద్యమం దేశ కాల పాత్రాలకు పరిమితం అయివుంటుంది. దానిని, దానితత్త్వాన్ని సాహిత్యంలో దేశ కాల పాత్రాతీతంగా ప్రతిపాదించే బాధ్యత రచయితలకున్నదని నవ్య సంప్రదాయ వాదులు విశ్వసిస్తారు. రచయిత సామాజికంగా పొందిన వాస్తవాను భవాన్ని సాహిత్యంలో కళానుభవంగా మార్చగలిగినప్పుడే విశ్వజనీనమైన సాహిత్యంగా రచన గౌరవింపబడుతుందని నవ్యసంప్రదాయవాదులు నమ్ముతారు.

''ఆధునికాంధ్ర కవిత్వంలో దేశభక్తి రెండుపాయలుగా ప్రవహించింది; ఒకటి భారత జాతీయాభిమాన సంబంధి; రెండవది ఆంధ్రాభిమాన సంబంధి'' అని డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు వివేచించారు. (ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు: ప్రయోగములు (1977 ముద్రణ) పుట : 356.) ఈ రెండు ఉద్యమాలూ పరస్పర విరుద్ధాలు కావు; పరస్పర పోషకాలు మాత్రమే. నవ్య సంప్రదాయోద్యమ పూర్వరంగంలో (1905-1935) కానవచ్చే ఈ రెండు పాయలనూ అభ్యుదయ కవిత్వోద్యమంలోని వామపక్షీయులు దాదాపు వ్యతి రేకిస్తారు. ఎందువల్లనంటే - అభ్యుదయమార్గం జాతీయతను, దేశీయతను మన్నించదు; గతితార్కిక భౌతికవాద దృక్పథంతో మానవ సమాజాన్ని సమీక్షిస్తుంది; అందులో భారతదేశం, ఆంధ్రప్రదేశం ఒక ప్రాంతం మాత్రమే. ఎల్లలచేత సీమితంగాదు మార్క్సిస్టు సిద్ధాంతం. కాని, స్థానిక పరిస్థితుల పరి ణామానికి మానవ సమాజానికి వర్తించే గతి తార్కిక భౌతికవాద సూత్రాలనే

కాలమానాలుగా గ్రహించటం అభ్యుదయ వామపక్షీయుల సిద్ధాంతం. ఈ భేదాన్ని దేశభక్తి కవిత్వాన్నీ, అభ్యుదయ కవిత్వాన్నీ చదివేటప్పుడు మనం గమనించ గలుగుతాం.

దేశభక్తి అనగానే తెలుగులో గురజాడవారి 'దేశభక్తి' గేయం జ్ఞాపకం వస్తుంది. 'దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా; వొట్టి మాటలు కట్టిపెట్టోయ్, గట్టిమేల్ తలపెట్టవోయ్; దేశాభిమానం నాకు కద్దని, వట్టి గొప్పలు చెప్పుకోకోయ్; పూని యేదైనాను వొకమేల్ కూర్చి జనులకు చూపవోయ్; దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' మొదలైన గేయ చరణాలు తెలుగువారి దేశభక్తిని ప్రజ్వలింప చేసిన ఇంధనాలు. అలాగే రాయప్రోలువారి "ఏ దేశమేగినా ఎందు కాలిడినా, పొగడరా నీ తల్లి భూమి భారతిని" మొదలైన గీతాలు జాతిని దేశభక్తిపూరితం చేశాయి. ఈ గీతాల కంటె విలక్షణంగా వినిపించేది శ్రీశ్రీ రచించిన "ఏ దేశ చరిత్ర చూచినా, ఏమున్నది గర్వకారణం; నరజాతి చరిత్ర సమస్తం, పరపీడన పరాయణత్వం." ఈ గీతంలో గతి తార్కిక భౌతికవాద దృక్పథం ప్రస్ఫుటంగా వినిపిస్తున్నది. భారతజాతిని మరిచిపోని మానవజాతి దృక్పథం నవ్యసంప్రదాయ వాదులది; 'నరజాతి చరిత్ర సమస్తం'లో మన జాతి చరిత్ర గతార్థంగా అభ్యుదయ వామ పక్షీయులు భావిస్తారు. ఒక జాతి వికాసంలో కలిగే పరిణామాలను ఆ జాతి యొక్క చారిత్రక సాంస్కృతిక ఆధ్యాత్మిక ప్రాతిపదికలను ఆధారంగా చేసి కొని వ్యాఖ్యానించాలనీ, ఆ పరిణామం ఒక జాతి చరిత్రలో విలక్షణంగా గోచ రించినా, ప్రపంచ జాతివికాస చరిత్రకు విపరీతంగా భాసించదనీ, జాతుల మధ్య కలిగే సంబంధ బాంధవ్యాలు కారణంగా జాతి వికాస చరిత్ర ప్రగతిపథంలో పురోగమిస్తుందనీ, అందువలన జాతి ప్రపంచానికిచ్చే జీవనవిధానం, దార్శనిక శక్తి మీదనే దేశం లేదా జాతి వ్యక్తిత్వం గౌరవింపబడుతుందనీ నవ్యసంప్ర దాయ వాదులు నమ్ముతారు. అందువల్ల వారిది మౌలికంగా జాతీయవాద దృక్పథం; పర్యంతంగా విశ్వ దృక్పథం, వారి జీవనదర్శనం భౌతికస్థాయిలో మొదలై ఆధ్యాత్మిక స్థాయివరకూ వ్యాపించి ఉంటుంది. వారి దృష్టిలో సాహిత్యం భౌతికాధ్యాత్మిక స్థితులకు వారధి. సమాజానికి లాగానే సాహిత్యానికి కూడా స్వతంత్ర ప్రవృత్తి ఉండాలని నవ్యసంప్రదాయవాదులు కోరుతారు. సమాజ దర్శనాన్ని మార్చే శక్తి సాహిత్యదర్శనానికి ఉంటుందని విశ్వసిస్తారు. ఒక్కొక

సారి సమకాలీన సమాజ పరిస్థితులకంటె అతీతంగా ఆలోచించి భవిష్యద్దర్శనాన్ని తాత్త్వికంగా కవి చేసి కళామార్గంద్వారా వ్యక్తీకరిస్తాడని నవ్యసంప్రదాయ వాదులు నమ్ముతారు.

ప్రపంచం భిన్నజాతుల కుటుంబం. ఒక్కొక జాతికి స్వీయజీవన తాత్త్వికదర్శనం ఉంటుంది. దానిని సాహిత్యం వ్యక్తీకరిస్తుంది; క్రొత్తపుంతలకు నడిపిస్తుంది. జాతి సాధించే ప్రగతి ప్రపంచ జీవనదృక్పథానికి ఒక నవ్యసంప్రదాయాన్ని అందించాలి దానిని రచయితలు సాహిత్యపరంగా ఒక నవ్యసంప్రదాయంగా మలచుకోవాలి. భారత స్వాతంత్ర్యోద్యమం జాతీయదృక్పథంతో వెలువడే నవ్యసంప్రదాయ సాహిత్యోద్యమానికి జీవితాన్నిచ్చింది; ఆ సాహిత్యోద్యమం ఆధునిక సాహిత్యానికి ఒక క్రొత్త జీవితాన్ని ప్రసాదించింది. *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 4-3-1990)

# నవ్యసంప్రదాయరస దర్శనం : 'ధర్మవీర ఏవ రసానాం రసః'

'రసము వేయిరెట్లు గొప్పది' అని భావించిన నవ్యసంప్రదాయోద్యమ కవులు ఆ దృక్పథంలో కావ్యప్రయోగాలను, నాటక ప్రయోగాలను, నవలాప్రయోగాలను కూడా చేసి చూపించారు. ఈ ఉద్యమంలో సాహిత్యవిమర్శ కూడా ఒక ఉదాత్తపాత్ర నిర్వహించింది; ఉజ్జ్వలంగా జీవించింది.

ఆధునిక సాహిత్యంలో సాహిత్య విమర్శ కూడా ఒక ప్రక్రియగా పరిగణింపబడుతోంది. అయితే అది కవిత్వంలాగా, కావ్యప్రక్రియల్లాగా శుద్ధ సృజనాత్మక కళారూపం కాదు. శాస్త్ర స్వభావాన్ని కళాత్మకంగా సంతరించుకొన్న సాహిత్య ప్రక్రియ. శాస్త్రీయమైన దృక్పథాన్ని కళానుభవంగా వ్యాఖ్యానించి పఠితలచేత ఆస్వాదింపచేసే శక్తి గల ప్రక్రియ సాహిత్యవిమర్శ.

ఇది సృజనాత్మక ప్రక్రియలను ఆశ్రయించి జీవిస్తుందనే అభిప్రాయం సాహితీలోకంలో బలంగా నాటుకొని ఉంది. దానికి కారణం లేకపోలేదు. రచన ఒకటి పుట్టిన తరువాతే దానిమీద విమర్శ రావటం ఏర్పడుతుంది. అందువలన విమర్శ సృజనాత్మక రచనలమీదనే ఉపజీవిస్తుంది అని సాధారణంగా భావిస్తుంటారు. అయితే, సాహిత్యవిమర్శ నవ్య సిద్ధాంతాలను గానీ, వినూత్నమైన అనుశీలన సూత్రాలను గానీ, విశిష్టమైన వివేచన విధానాన్ని గానీ ప్రతిపాదింపగలిగినప్పుడు, దానికి ఇటువంటి అపవాదు తొలగిపోయే అవకాశం ఉంది. మరో మాటలో చెప్పాలంటే - సాహిత్య విమర్శ సృజనాత్మక దశను పొందినప్పుడు తన వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా ప్రకటింపగలుగుతుంది. నవ్యసంప్రదాయ యుగంలో సాహిత్యవిమర్శ సృజనాత్మకశక్తిని ప్రదర్శించి తన మౌలికమైన జీవతత్త్వాన్ని వ్యక్తీకరించింది.

సాధారణంగా సాహిత్యవిమర్శ ఆరు రకాల బాధ్యతలను నిర్వహిస్తుంది. అది సాహిత్యాంశాలను దేశకాలపాత్రోచితంగా వర్ణించి చెపుతుంది; విజ్ఞతతో

విశ్లేషించి చూపుతుంది; విలువలెరిగి వివేచించి- సాహిత్యంలోని బలాబలాలను, గుణాగుణాలను, సత్యాసత్యాలను నిరూపిస్తుంది; వైవిధ్యాలను, వైరుధ్యాలను సమన్వయించి సాహిత్యప్రయోగ వ్యక్తిత్వాలకు విలువ కడుతుంది; అనుభవ స్ఫోరకంగా అనుశీలించి సాహిత్యమూర్తిమత్వాన్ని సహృదయులకు అందిస్తుంది; తత్త్వదృష్టితో దర్శించి సాహిత్య వికాస మార్గానికి శాస్త్రీయమైన గతి సూత్రాన్ని నిర్దేశిస్తుంది. వీటిల్లో ఉత్తరోత్తరాలు బలీయాలు.

అన్ని కాలాలల్లోనూ సాహిత్య విమర్శ అన్ని బాధ్యతలనూ ఆదర్శ ప్రాయంగా నిర్వహింపలేకపోవచ్చు. కొన్నింటిని మాత్రమే ప్రశంసనీయంగా ప్రదర్శించవచ్చు. అయినా, చివరి బాధ్యతను చిత్తశుద్ధితో సాధించే ప్రస్థానంలో మిగిలిన బాధ్యతలను సమర్థవంతంగా మలచుకొన్న కాలం ఉత్తమ మనిపించు కొంటుంది. ఆధునిక సాహిత్యంలో మొదటినుండి చివరిదాకా అన్ని బాధ్యత లనూ శక్తిమంతంగా సాహిత్య విమర్శ నిర్వహించిన కాలం నవ్యసంప్రదా యోద్యమయుగం ఈ యుగంలో సాహిత్య విమర్శ ప్రదర్శించినంత పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని మరే యుగంలోనూ ప్రకటించలేదంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

ఈ వాస్తవాన్ని తెలుసుకోవడానికి విమర్శ నిర్వహించిన ఆరు బాధ్యత లకూ నవ్యసంప్రదాయోద్యమంనుంచి ఆరు ఉదాహరణలను పేర్కొంటాను. ఇది దిఙ్మాత్రపరిశీలనం మాత్రమే.

సాహిత్య విమర్శ ఎక్కగలిగిన శిఖరం సిద్ధాంత దర్శనం, ప్రతిపాదనం. నవ్యసంప్రదాయయుగంలో ప్రతిపాదింపబడిన రససిద్ధాంతాలలో మొదట పేర్కొనదగింది ఈ వ్యాస రచయిత జి వి సుబ్రహ్మణ్యం స్థాపించిన 'ధర్మ వీర ఏవ రసానాం రసః' అనే సిద్ధాంతం- రస సమీకరణ సిద్ధాంతాల స్థాయికి చెందిన ఈ రససిద్ధాంతం భారతీయాలంకారిక ప్రస్థానాల్లో ఒక ఆధునిక స్థానాన్ని సంపాదించుకొన్నది.

ఈ సిద్ధాంతానికి ప్రాతిపదిక 1960 లోనే పడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి 1960 సం॥ బహుమతినందుకొన్న వీర రసము అనే గ్రంథంలోనే ఈ సిద్ధాంతం రూపుదాల్చింది. ఆ తరువాత 1980 లో ప్రచురింపబడిన 'రసోల్లాసము'లో వాదంగా ప్రతిపాదింపబడింది. ఈ ఇరవై యేళ్ళలో ఈ వాదం చర్చలకు గురికావటం, విమర్శలకు ఎదురొడ్డి రసక్షేత్రంలో నిలువదొక్కుకోవటం జరిగింది. మహాభారతంలో అంగిరసం ధర్మవీరమనీ, రామాయణంలో కూడా ప్రధాన రసం ధర్మవీరమనీ నేను చేసిన ప్రతిపాదనలు వాద ప్రతివాదాల తరువాత విమర్శ క్షేత్రంలో కాలూని నిలిచాయి. కావ్యంలో రస నిర్ణయం చేయటం ఎలా? అనుశీలనంలో రస చర్చ చేయటం ఎలా? వివిధ ప్రక్రియల్లో రసం పోషింపబడే పద్ధతులను ఏర్పరచుకోవటం ఎలా? శాంత రస కావ్యాలలో నవమ రసమైన శాంతరసాన్ని, ప్రకృతి రసమైన శాంతరసాన్ని నిరూపించే విధానాలు ఎలాంటివి? రస సమీకరణ వాదాలకు సాహిత్య విమర్శలోనూ, రస విమర్శలోనూ గల స్థానాలేమిటి? మొదలైన ఎన్నో ప్రశ్నలకు 1960 నుండి విమర్శలో సమాధానం చెప్పే యత్నం చేశాను. ఆయా అంశాలలో హేతుబద్ధమైన, ఆచరణయోగ్యమైన సూత్రాలనూ, అన్వయాలనూ, నిర్ణయాలనూ చేసి చూపించాను. ఈ సమాలోచనానికి నాకు సమకాలీనంగా సాగుతున్న నవ్యసంప్రదాయోద్యమం సహజ ప్రేరణను కలిగించిందనటంలో అనుమానం లేదు ఆ యుగం సాహిత్యానికి 'రసదర్శనాన్ని' అభినవంగా ప్రసాదించింది. విశ్వనాథాదులు కావ్యరసాన్ని గురించి ఎన్నో చర్చలు చేస్తుండేవారు; ఉపన్యాసాలిస్తుండేవారు: వ్యాసాలు వ్రాస్తుండేవారు. ఆ యుగంలో నాకు దర్శనమిచ్చింది 'ధర్మవీరం.' దానినే 'రసానాం రసః' అన్నాను.

నవ్య సంప్రదాయోద్యమంలో వెలువడిన కావ్య ప్రయోగాలను పరిశీలించిన తరువాత వీరరస భేదాల్లో మరొక మూడింటిని నేను ప్రతిపాదించాను. అవి - స్వాతంత్ర్యవీరం, యశోవీరం, మానవీరం. భారతీయ జాతీయ స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో వెలువడుతున్న చారిత్రక కావ్యాలూ, ప్రబోధ కవితలూ, జాతీయ స్వాతంత్ర్య గీతాలూ చదివిన తరువాత పరంపరగా వస్తున్న వీరరస వివేచనం ఈ చైతన్యానికి ఒక ప్రత్యేక శాఖను కల్పించలేకపోవటంచేత, దేశ స్వాతంత్ర్యోద్యమ సాహిత్యం నవ్య సంప్రదాయోద్యమంలో వెలువడిన శక్తిమంతమైన ప్రక్రియా ప్రపంచం కావటంచేత అందులో అభినవంగా అనుభూతికందుతున్న స్వాతంత్ర్యవీరాన్ని - ధర్మవీరరూపాంతరంగానే ప్రతిపాదించాను.

జాత్యభిమానం రాష్ట్రాభిమానం, జాతీయాభిమానం, భాషాభిమానం మొదలైన భావాలు సాహిత్యంలో మోసులెత్తుతున్న వైఖరులను, కావ్య ప్రక్రియలను చదివిన తరువాత మానవీరం ఒక వీరరసశాఖగా పోషింపబడినవిధం నిరూపించాను. దేశంకోసం, నమ్మిన ఆశయాలకోసం, ధర్మంకోసం అసువులను సైతం సంతోషంతో సమర్పించే త్యాగవీరుల ఉజ్జ్వల గాథలలో యశోవీరం గోచరించింది. అలా నవ్య సంప్రదాయ సాహిత్యంలో పోషింపబడిన వీరరస వైవిధ్యాలను దృష్టిలో ఉంచుకొని ఈ మూడు రకాలను సాహిత్య క్షేత్రంలో నేను ప్రతిపాదించాను. ఇటువంటి రస విమర్శ విశ్లేషణకు, వివేచనకు సంబంధించింది. ఈ రెంటికీ మూలమయినది సిద్ధాంతం. దానిని ముందుగానే దర్శించి ప్రపంచించాను. ఇదివరలో నేను చేసిన ప్రతిపాదననే నా మాటల్లోనే ఈ వ్యాసంలో ఉట్టంకిస్తాను.

"వీరము 'రసానాం రసః' అనునప్పుడు, వీరము రసశ్రేష్ఠమను తాత్పర్యముతో పాటు మూడు విధాలైన అన్వయము లేర్పడునని స్పష్టమగుచున్నది.

1. రసములకు (మూలమైన) రసము.
2. రసములలో (వ్యాప్తమైన) రసము.
3 రసముయొక్క (సారమైన) రసము.

1. రసశబ్ద వాచ్యములైన స్థాయిభావములకు రసత్వసిద్ధిని సాధించు సహృదయ హృదయస్థమైన ఉత్సాహమనెడి స్థాయి చిత్తప్రవృత్తియే సర్వరస ప్రవృత్తులకు మూలమైన రసము.

2. నవవిధ రసములు ధర్మోత్సాహానుప్రాణితము లైనప్పుడే దీప్తిమంతములగును. కావున నుత్సాహస్థాయి అయిన వీరము, సర్వరస పోషణమును గావించు స్థాయి రసము. ప్రవృత్తి నివృత్తి రూపములైన చిత్త వృత్తులచే వీరము చతుర్వర్గ సాధన కుపయుక్త మయ్యెడిది కాన, రసము లన్నింటి యందును వ్యాప్తి చెందిన రసము వీరము

3. నిమిత్తభేదములనుబట్టి వీరము బహువిధములుగా భాసించినను, వానికన్నింటికి మూలమైనది ధర్మవీరము. వీరరసభేదముల కన్నింటికిని రసత్వసిద్ధిని

కలిగించునది ధర్మవీరము అదియే దాని సారము. కాబట్టి "ధర్మవీర ఏవ రసానాం రసః."

"అభినవగుప్తపాదులు ధర్మప్రధానమైనది వీరమని చెప్పియుండుట గమనార్హము. ధర్మనిష్ఠముగాని యుత్సాహము వీరరసరూపము దాల్చజాలదు. కావున వీరము ధర్మమూలము. ధర్మమే దాని మూలస్వరూపము. ధర్మవీరమే వీరము. మిగిలిన వీరభేదములు ధర్మనిష్ఠములైన ఉత్సాహభావములే కావున, ధర్మవీరమునకు బహువిధములైన అవాంతర రూపములే యగుచున్నవి. సలిల మొక్కటియే యైనను ఆవర్త, బుద్బుద, తరంగ వికారములచే భిన్నభిన్నాకృతులతో నెట్లు కానబడునో-అట్లే ధర్మానుప్రాణితమైన వీరరసభేదములన్నియు ధర్మస్వరూపములయ్యు తత్తదాశ్రయ నిమిత్తభేదముచే వివిధ నామములతో వ్యవహరింపబడుచున్నవి"

"రసోన్ముఖమై సాగు సర్వమానస వ్యాపారమంతయు సాధనాత్మకమైన ఉత్సాహప్రవృత్తి రూపమగుటచే సర్వరసములకును ఉత్సాహము మూలప్రకృతి అని నిర్ధారితమగుచున్నది. శారదాతనయుడు ఉత్సాహశబ్దమును నిర్వచించుచు-

"ఉత్తంద్రతా మభిభవ త్యత ఉత్సాహ నిర్వహః
ఉత్సాహ్యతే చేత్సహతే ఉత్సాహయతి వా భవేత్"

(భావప్రకాశమ్. అధి. 2. పు. 37)

అని పేర్కొనినాడు. తంద్రతను (తూగుట, కునికిపాటు పడుటలను) అభిభవించునది (తిరస్కరించునది, తెగడునది) ఉత్సాహమనియు, ఈ పదమునకు ఉత్సాహమును పొందుట ఉత్సాహ పెట్టుట, ఉత్సాహపడుట అను నర్థములు కల్గుననియు దెల్పినాడు తంద్రతాభిభవము తమోగుణనిరాకరణమును సూచించుచున్నది. ఉత్సాహమును పొందుట యను నర్థము విభావాది వ్యాపారములను వ్యంజింపజేయుచున్నది. ఉత్సాహ పెట్టుట యను నర్థము శక్తిత్రయప్రచోదన శీలమును సూచించుచున్నది. ఉత్సాహపడుట హృదయ సహజ వ్యాపార ధర్మమును ధ్వనింపజేయుచున్నది. పై పెచ్చు తత్ప్రవృత్తి మెరపువలె చకచ్చకితమై, తరళసుందరమై, నిరంతర ప్రవాహరూపమై, తేజోమయమై సర్వకార్యములందు సత్వర ప్రసారక్రియాలక్షణ సంశోభితమై యొప్పునను తాత్పర్యమేర్పడుచున్నది.

ఇట్టి మానసిక వ్యాపారము సర్వరససాధన ప్రవృత్తికి ప్రాణభూతమనుటలో సంశయముండుటకు వీలులేదు ''

"ఇట్టి ఉత్సాహ ప్రవృత్తి సామాజిక హృదయమునందు రససాధనావసరమున నిలుచు స్థాయి. అనగా - సహృదయ రససాధన వ్యాపారము అలౌకిక విభావజన్య మగుటచే రసనామయోగ్య మగుచున్నది. అది వీర రస నిష్ఠము. వీరము సర్వరసములకును రసత్వమును గల్పించు స్థాయిరసము. ఇట్టి స్థాయి రసమైన వీరము లేనిదే రసభావాభివ్యక్తియు, భావోన్మీలనమును, ఉత్కర్షావస్థయు, స్థాయి చర్వణదశయు. శృంగారాది రసానుభవస్థితియు లేవని తాత్పర్యము. అందువలన వీరమే 'రసానాం రసః' అని సంభావింపదగియున్నది."

"అయినచో - నవవిధ రసములలోని వీరమే ఈ వీరరసమని భావించుట పొసగునా? యను ప్రశ్న యుదయించును. దాని నిట్లన్వయించవలెను - సహృదయ రససాధన ప్రవృత్తియందలి వీరమును, కావ్య రసమగు వీరమును ఒకటి యనుట లోక వ్యవహారమునుబట్టియు స్థాయి స్వభావభేదమునుబట్టియు పొసగదు. కాని, ప్రవృత్తిచేత రెండును సజాతీయములే ఎట్లనగా, రామాదుల నాశ్రయించి ప్రవర్తిల్లెడి స్థాయియైన ఉత్సాహము సహృదయునిచే ధర్మయుద్ధవీరాదులుగా నాస్వాద్యమానమగుచున్నది. దాని నాతడు తన్మయీభవన యోగ్యతచే సంవాదము చెంది అనుభవించుచున్నాడు. ఇది కావ్యవిభావాదిజన్యమైన రసము. నవరసములలో నొకటి. కాగా, సహృదయుడు రసానందమును సాధించు వ్యాపారమునందు వివిధస్థాయి భావములను చర్వణముచేయు నుత్సాహప్రవృత్తిని వెలార్చుచున్నాడు. దానివలన నాతడు సర్వరసముల నాస్వాదింపగలుగుచున్నాడు. నాయకాశ్రితమైన ఉత్సాహస్థాయి నిమిత్తముగా సహృదయుడనుభవించు రసము నవ రసములలోని వీరము. నాయకాదుల నాశ్రయించిన ఎట్టి స్థాయిభావమైనను నిమిత్తముగాగొని సహృదయుడు సాధించు రసము - మూలప్రకృతియైన వీరము."

"వీర రసవాదమున సర్వ రస సాధన ప్రవృత్తియైన సహృదయుని యందలి ఉత్సాహము రసానుభవ మూలకందము. దీనిని రసమని వ్యవహరించినను ప్రవృత్తి అని పరిగణించుచున్నాము. ఇది రసములకు (మూలమైన)

రసము. స్థాయిభావ చర్వణమునందు సహృదయ సంస్కార రూప భావాభివ్యక్తిని, ఆత్మయొక్క ఆనంద చిత్కళా ప్రతిబింబన వ్యాపారానుకూల్యతను సాధించి కావ్యరసముల నాస్వాదయోగ్యములుగా నొనర్చి రసస్థితిని కలిగించు మనోవ్యాపారము ఈ రసము. సర్వకావ్యరసములకు సహృదయచిత్తక్షేత్రమున రసత్వసిద్ధిని సాధించు సాధనము ఉత్సాహస్థాయియైన ఈ వీరము. సహృదయ హృదయస్థాయియైన ఈ ఉత్సాహము సాధ్యములైన రసములయొక్క అస్తిత్వమునకు ఆదిమూలమగుచున్నది. దీని స్థితి రససాధన వ్యాపారమునకు మాత్రమే పరిమితమగుటచే కావ్యరస విమర్శయందు దీని ప్రస్తావనము నిత్యమగుచున్నది. ఇది అలౌకిక మానస వ్యాపారము కాని, లౌకికము కాదు; ఆధ్యాత్మికము కాదు; తదుభయ మధ్యస్థమును గాదు.''

''కరుణాద్భుత రస సమీకరణ వాదములందు చిత్తద్రవ వికాస స్థితులను రసములని పేర్కొనుటయైనది. వీర రసవాదమున రససాధనలో హృదయము పొందు అవస్థలుగనే అవి గుర్తింపదగినవి. అట్లగుటచే ఆయాస్థితులను సాధించు యత్న విశేషమైన చిత్తప్రవృత్తి రసనామ యోగ్యమై ఆ వాదములందు కానవచ్చు విప్రతిపత్తులను తొలగింపగలుగుచున్నది. ఇట్లు వీరరసవాదము మిగిలిన సమీకరణ వాదములకంటె భిన్నమై నిలువగలదనుటలో నసుమానము లేదు.''

''రసానాం రసః'' అనుటచే వీరము కావ్యరసస్థితిని రాణింపజేయు రసమని భావింపదగియున్నది. సాధ్యములైన రసములకు సాధనమైన హృదయము యొక్క సాధనోత్సాహ ప్రవృత్తి రసము - సర్వరసాను భవస్థితికి మూలకందమగుటచే అది రసములకు (మూలమైన) రసమని చెప్పుటయైనది. దీనిని ఏకైక రసమనుట లేదు మేము; శృంగారాదుల రసస్థితిని మన్నించుచున్నాము కనుక. శాంతరసవాదములోని ప్రకృతిరసము వీరమువలె ప్రవృత్తిరూపము కాదు. కరుణములోని ద్రవస్థితి సంస్కారమే కాని, సాధన ప్రవృత్తి కాదు. అద్భుతము అవస్థయే కాని ప్రవృత్తి కాదు. ఇవి మిగిలిన రసములను వికార, వివర్తరూపములుగా గణించునే కాని, వాని కావ్యరస వ్యక్తిత్వముల నంగీకరింపవు. తన సాధనవలన శృంగారాదులకు రసత్వస్థితిని సంతరించు మానసక్రియ వీరము. అది రసముల వెంట నడచి వానిని సాధించునది. కాని, తానే రసమై తనయందు మిగిలినవాని నన్నింటిని విలీన మొనర్చునది కాదు.

దీనినిట్లు గ్రహించినప్పుడే రసవిమర్శ కుదురును.'' (వివరాలకు చూడండి- రసోల్లాసము (1980.)

ఒక సాహిత్యోద్యమం విమర్శలో విజృంభిస్తే ఎలా ఉంటుందో, ఎలా సమగ్రంగా రూపొందుతుందో నవ్యసంప్రదాయ సాహిత్య విమర్శను పరిశీలిస్తే అవగతమౌతుంది. ఉద్యమ చైతన్యం ప్రయోగాలలో ప్రవాహరూపంగా పరుగు లెత్తుతున్నట్లు గోచరిస్తుంది. తరంగ విన్యాసమే ప్రకియా ప్రగతి. అయితే, సాహిత్య విమర్శ ఒక ఉద్యమం యొక్క పరిణతిని, పరిపక్వతను, దార్శనిక శక్తిని, వివేచనాభివ్యక్తిని ప్రదర్శిస్తుంది.

సాహిత్య విమర్శ ఒకవిధంగా షట్పది. దాని శిరస్సు వినూత్న దర్శనం లేదా సాహిత్య సిద్ధాంతం. రాయప్రోలువారు శృంగార రస వాదాన్ని స్నేహం వైపు మళ్ళించి - దానిని అమలిన శృంగార రససిద్ధాంతంగా ప్రతిపాదించారు; విశ్వనాథవారు నవ్యసంప్రదాయోద్యమ చైతన్య శిఖరంలా కరుణరసాన్ని సర్వ జీవప్రవృత్తి మూలరసంగా ప్రతిపాదించారు; నేను నవ్యసంప్రదాయముగ చైతన్యాన్ని రసదర్శనంగా మార్చుకొని 'ధర్మవీర ఏవ రసానాం రసః' అని ప్రతిష్ఠాపించాను. నవ్యసంప్రదాయోద్యమానికి ఈ నవ్యరస సిద్ధాంతాలు విజయ కేతనాలు! *

**(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు:
ఆదివారం ఆంధ్రప్రభ:11-3-1990)**

# నవ్యసంప్రదాయోద్యమం : సాహిత్యవిమర్శ

ఆంధ్రసాహిత్య విమర్శ వికాసాన్ని వివేచించటానికి అనువుగా నేను ఒక యుగవిభాగాన్ని 'ఆంధ్రసాహిత్య విమర్శ - ఆంగ్లప్రభావం' (1983) అనే గ్రంథంలో ప్రతిపాదించాము. ఆ ప్రణాళిక ఇది—

1. వికాసయుగం - క్రీ.శ. 1874 నుండి 1914 వరకు.

2. కావ్యానుశీలనయుగం - క్రీ.శ. 1914 నుండి 1948 వరకు.

3. శిల్పానుశీలనయుగం - క్రీ.శ. 1948 నుండి 1963 వరకు.

4. సమన్వయయుగం - క్రీ.శ. 1963 నుండి 1970 వరకు.

5. సమీక్షాయుగం - క్రీ.శ. 1970 నుండి నేటిదాకా.

సాహిత్య విమర్శలో అంతర్భాగంగా పరిశోధన దాదాపు 1960 నుండి సమన్వయయుగంలో శక్తిమంతమైన శాఖగా సాగిందని పేర్కొన్నాను. అయితే పరిశోధనలో కూడా వికాసావస్థలనుబట్టి అంతర్విభాగాలను సూచించాను.(చూడు- ప్రాధాన్యాంశ వివక్షాకాలం (వ్యా) ఆదివారం ఆంధ్రప్రభ - 18.6.1988; ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం - (1990) - యువభారతి ప్రచురణ - పు. 79.)

1. పరిశోధన సామగ్రి సేకరణ - విశ్లేషణ కాలం - 19వ శతాబ్ది పూర్వార్ధం.

2. ప్రాధాన్యాంశ వివక్షా కాలం - 19వ శతాబ్ది ఉత్తరార్ధం.

3. సాహిత్య చరిత్ర నిర్మాణ కాలం - 20వ శతాబ్ది పూర్వార్ధం.

4. సాహిత్య చరిత్ర యుగాలను, కవులను, రచనలను, ప్రభావ పరిశీలనలను వ్యష్టిగా, సమష్టిగా విశ్లేషించి, వివేచించిన కాలం సుమారు 1950 నుండి 1960 వరకు.

5. సాహిత్య సిద్ధాంతాలనూ, సమన్వయాలనూ ప్రతిపాదించిన కాలం - సుమారు 1960 నుండి 1970 వరకు.

6. ఎన్నుకొన్న ప్రత్యేకాంశాలను వివిధ దృక్కోణాలతోనో, దృక్పథాల తోనో అనుశీలించినకాలం - సుమారు 1970 నుండి 1980 వరకు.

7. ఏకదేశాంశ విశ్లేషణకాలం - సుమారు 1980 నుండి నేటివరకు.

ఇవి ఖచ్చితమైన రేఖలూ, ఎల్లలూ కావు కాని, పరిణామ పరిశీలనకు పనికి వచ్చే కొన్ని కొండగుర్తులు మాత్రమే. పరిశోధనా, విమర్శా అక్కచెల్లెళ్ళ లాంటివి. అందువలన దగ్గరిపోలికలు రెండింటిలోనూ కనపడుతూ ఉంటాయి. ధోరణిబట్టి, స్వభావాన్నిబట్టి వాటిని ఒకొక్కసారి కలిపిచూడవలసివస్తుంది కాని వీలైనంతవరకు ఆ రెండు ప్రక్రియలనూ విడివిడిగా వివేచించటమే సముచితం.

సాహిత్యవికాస చరిత్రను గమనిస్తే సాహిత్య విమర్శకు సంబంధించిన ఒక అంశాన్ని గమనించవచ్చు. సాహిత్యరంగంలో ఒకక్రొత్త ధోరణిని మొదట తీసుకొని వచ్చేవి సృజనాత్మక ప్రక్రియలు. అంటే కవితలు, నాటకాలు నవలలు మొదలైనవి. అయితే, ఆ ప్రయోగాల వెనుక కూడా విమర్శ ఉంటుంది. కాని, రచయితలు ఆ విమర్శను ముందుకు తీసుకొనిరారు; ప్రయోగాలలో పొదిగి ప్రపంచిస్తారు. అందువలన సహృదయులు మొదట క్రొత్తధోరణినిగాని, ఉద్యమాన్ని గాని కళాప్రయోగాల ద్వారా గుర్తించి ఆస్వాదిస్తారు: క్రొత్తను ఆహ్వానిస్తారు. దీనికి ఆధునిక సాహిత్య చరిత్ర అంతా దృష్టాంతమే.

గురజాడ, రాయప్రోలు, విశ్వనాథ, శ్రీశ్రీ వంటి యుగకర్తలైన మహా కవుల కళాప్రయోగాలు ముందుగా వచ్చాయి; ఆ తరువాత వారి సాహిత్య విమర్శలు వెలువడ్డాయి. కొన్ని సమయాల్లో వారి ధోరణులను వారి విమర్శలు వివరించాయి; వ్యాఖ్యానించాయి. అయితే, వారు సాహిత్యంలో ప్రవర్తింపజేసిన నవ్యధోరణులుగాని, ఉద్యమాలు గాని క్రమంగా కాలూని ప్రజల్లో ప్రచారం చెందుతున్న తరువాత వారి ప్రయోగాలను గురించీ, ప్రక్రియలను గురించీ విమర్శలు శాస్త్రీయంగా అనుశీలించటానికి యత్నించాయి. ఈ సత్యాన్ని స్థూలం గానూ, స్పష్టంగానూ మనం గమనించగలం.

విమర్శ మొదట అవగాహనస్థాయిలో రచయితతో తలయెత్తుతుంది. అది అనుభూతిగా పెంపొంది. ప్రయోగానికి దారి తీస్తుంది. ప్రయోగం పఠితలో అనుభవమార్గం ద్వారా అవగాహనను కల్పిస్తుంది విమర్శ అవగాహనతో కూడిన అనుశీలన పద్ధతిని ఆవిష్కరించి, ప్రయోగం బలపడటానికీ, ప్రాచుర్యం చెంద టానికీ తోడ్పడుతుంది. అంతేకాదు; ప్రయోగంలో గానీ, ప్రక్రియలో గానీ ఉన్న వ్యక్తిత్వాన్నీ, నవ్యతనూ, సృజనాత్మకతనూ పఠితకు ఆస్వాదయోగ్యం అయ్యేటట్లు చేస్తుంది.

అయితే, సాహిత్య విమర్శకూడా ఒక ప్రక్రియయే. దానికీ ఒక స్వతంత్ర జీవితం, ప్రయోగ ప్రజ్ఞ, వికాస విధానం ఉంటాయి. ఈ మూడు లక్షణాలూ దానికి ఏర్పడాలంటే దర్శన శక్తి కావాలి. సాహిత్య విమర్శ దర్శవమూలం. దర్శనంలోని పరిణామమే విమర్శ వికాసమూలం. నవ్యసంప్రదాయోద్యమ కాలంలో విమర్శ రసదర్శనమూలంగా తన అస్తిత్వాన్నీ, అధిక్యతనూ, ఉద్యమశక్తినీ నిరూపించుకొన్నది.

నవ్యసంప్రదాయోద్యమ కాలంలో - అంటే 1933 - 1975 దాకా - సాహిత్య ప్రక్రియలకు మూడు రకాలైన దర్శనాలు ప్రేరణలు కలిగించాయి. అవి - 1. సాహిత్యదర్శనం. 2. సామాజిక దర్శనం. 3. శాస్త్ర దర్శనం. సాహిత్యదర్శనాల్లో రసదర్శనానికి అగ్రతాంబూలం దొరికింది; సామాజికదర్శ నాల్లో మార్క్సిస్టు దర్శనం తలపొలంలో నిలుస్తుంది. శాస్త్రదర్శనాల్లో మనో విశ్లేషణాత్మకాలైన ఫ్రాయిడ్, అడ్లర్, యూంగ్ మొదలైనవారి సిద్ధాంతాలు రంగంలో ఉన్నాయి. ఈ మూడు దర్శనాలూ తెలుగు సాహిత్య ప్రక్రియలలో వివిధ ప్రయోగాలకు కారణాలయ్యాయి. విమర్శ ఈ మూడు దృక్పథాలతో ఆ మూడు రకాల రచనలనూ విశ్లేషించటం, సమన్వయించటం, అనుశీలించటం మొదలుపెట్టింది. దానితోపాటు ఈ మూడింటిలో ఏది ఉత్తమమైంది?' - అని చర్చించటం ప్రారంభించింది. ఆ చర్చలో - ఏ దర్శనం ఉత్తమమైనదో నిర్ణ యించుకొని, దానిని ప్రతిఫలింపజేసుకొన్న రచన ఉత్తమమైందని చెప్పే పద్ధతి ఒకటి సాగితే, దర్శనమేదైనా రచనయొక్క కళాత్మక శక్తినిబట్టి ఉత్తమత్వాన్ని నిశ్చయించాలని మరొక పద్ధతి ముందుకు వచ్చింది. అపైన కళాత్మక శక్తులను నిర్ణయించే విలువలను గురించి వివిధ దృక్కోణాలతో విమర్శలు వెలువడ్డాయి.

ఈ మూడు పద్ధతుల్లో మొదటి పద్ధతి ఉద్యమశీలాన్ని ప్రదర్శించింది. సాహిత్య దర్శనాల్లో రసదర్శనాన్ని అభినవంగా ప్రతిపాదించే నవ్యసంప్రదాయోద్యమం ఒక వైపు; సామాజిక దర్శనాల్లో మార్క్సిస్టు దర్శనాన్ని ఆదర్శంగా గ్రహించే అభ్యుదయ వామపక్షోద్యమం, విప్లవ కవిత్వోద్యమం మరొకవైపు విజృంభించాయి. ఈ రెండింటితో పోల్చుకుంటే మనోవిశ్లేషణాత్మకమైన శాస్త్ర దర్శనం ఒక ఉద్యమస్ఫూర్తిని పొందలేదనీ, ధోరణిగా ప్రవర్తిల్లిందనీ చెప్ప వచ్చు. ఇక రెండవ పద్ధతి విమర్శలో సమన్వయయుగ చైతన్యాన్ని పోషించింది. మూడవ పద్ధతి సమీక్షా ప్రవృత్తిని బలపరిచింది.

రసానుశీలనంలో క్రొత్త త్రోవలు చూపించిన రసదర్శనం నవ్యసంప్రదాయోద్యమ చైతన్య పరిణతదశగా పరిగణించాలి. ఈ ఉద్యమంలో పాల్గొన్న విమర్శకులందరూ ఏదో ఒక రకంగా రసచర్చ చేసినవారే. సాహిత్యప్రక్రియలన్నింటికి రసం జీవచైతన్యంగా భావించినవారే. ఈ ప్రభావం మొదటిరోజుల్లో అభ్యుదయ కవులమీద కూడా కనవడుతుంది. శ్రీశ్రీ తన కవిత్వం, అభ్యుదయ కవిత్వం, బీభత్స రస ప్రధానమైనదని పేర్కొనటం గమనింపదగింది. నవ్య సంప్రదాయంలో ప్రాచ్యలాక్షణికుల రససిద్ధాంతం పాశ్చాత్య విషాదనాటకాలలో అనుభవానికి అందే పాథాస్, కెథారిసిస్ సిద్ధాంతాలకు సంబంధించిన అంశాలను కూడా సంవదించుకొని అభినవరూపం తాల్చింది. మానసిక శాస్త్రానికి సంబంధించిన విశ్లేషణ కూడా రససూత్రానికి అన్వయించిన విమర్శలు ఈకాలంలో వచ్చాయి. భారతీయ రసదర్శనం ఈ కాలంలో పాశ్చాత్య విమర్శ సిద్ధాంతాల మీద కూడా ప్రభావం వేసింది. టి. యస్. ఎలియట్ నుండి న్యూక్రిటిక్స్ వరకూ వెలసిన పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల మీద భారతీయ సాహిత్య ప్రభావం ఉన్నదని నవ్యసంప్రదాయ విమర్శకులు నిరూపించారు. అంటే - ప్రపంచ సాహిత్య సిద్ధాంతాలపై ప్రభావం వేసిన రసదర్శనం నవ్యసంప్రదాయ వాదుల సాహిత్య దర్శనం మార్క్సిస్టు దర్శనం మన దేశంలోకి ప్రవహించిన పాశ్చాత్య సామాజిక దర్శనం, రసదర్శనం మన దేశంనుండి పాశ్చాత్య దేశాలలోకి ప్రసరించిన సాహిత్య దర్శనం. ఒకనాడు బౌద్ధం మనదేశంనుండి ప్రపంచానికి తాత్త్విక దర్శనాన్ని సమర్పించినట్లుగానే, ఆనాడు నవ్యసంప్రదాయ చైతన్యం పాశ్చాత్యానికి తన సాహిత్య తత్త్వ దర్శనాన్ని ప్రసరించింది. ఇటువంటి ఉజ్జ్వలమైన స్థితి ఇంతకుముందెన్నడూ సాహిత్య విమర్శకు ఉన్నట్లు మనకు తెలియదు.

అనుశీలనం అంటే విలువ కట్టటం. ఏ సాహిత్య చరిత్రలోనైనా తరం మారుతున్నప్పుడూ, దృక్పథం మారుతున్నప్పుడూ విలువకట్టే విధానం కూడా మార్పు చెందుతూ ఉంటుంది; దాన్నిబట్టి ప్రమాణాలు కూడా మారుతూ ఉంటాయి. కానీ, విలువకట్టే అనుశీలనం మాత్రం కుంటుపడకుండా కొనసాగుతూనే ఉంటుంది. కట్టమంచివారు కాల్పనిక యుగ ప్రమాణాలతో ఆంధ్ర సాహిత్యాన్నంతా అనుశీలించే పద్ధతికి ప్రాముఖ్యం కల్పించి, ప్రక్రియలన్నింటినీ ఆ ప్రమాణాలతోనే వివక్షా విరహితంగా విమర్శించారు. ఆ పద్ధతి మీద రాళ్ళపల్లి వారూ, దువ్వూరివారూ, విశ్వనాథవారూ తిరుగుబాటు చేశారు. సౌందర్య తత్త్వ సిద్ధాంతాలను మేళవించుకొన్న అభినవ కళాదృష్టి రాళ్ళపల్లిదీ, దువ్వూరిదీ. భారతీయ రసవాదాన్నీ, పాశ్చాత్యుల కెథార్సిస్‌నూ సంవదించి కరుణరస మూలమైన ఆధునిక రసతత్త్వాన్ని అలౌకిక స్థాయినుండి ఆధ్యాత్మికస్థాయివరకూ వ్యాఖ్యానించిన రసదృష్టి విశ్వనాథది. ఈ ముగ్గురూ తత్త్వ దృష్టితో సాహిత్య వికాస మార్గానికి విమర్శద్వారా శాస్త్రీయమైన గతి సూత్రాన్ని నిర్దేశించినవారే. అంటే-విమర్శ నిర్వహించే ఆరవ బాధ్యతను దర్శించి నవ్యసంప్రదాయోద్యమానికి దార్శనిక శక్తిని సంపాదించి పెట్టారన్నమాట!

పాశ్చాత్యులు కూడా కావ్యసౌందర్య తత్త్వదర్శనాన్ని చేసే ప్రస్థానాలు సాగించారు. వాటిలో Realism, Emotionalism, Expressionism, Transcendentalism ముఖ్యమైనవి. వీటిలో చివరిదైన Transcendentalism మీద భారతీయ తత్త్వ దర్శన ప్రభావం బాగా కనిపిస్తుంది. విశ్వనాథవారి విమర్శ పాశ్చాత్యుల Transcendentalism ను భారతీయ దృష్టితో సమగ్రం చేసి వ్యక్తీకరించింది. కాల్పనికోద్యమ విమర్శకులు Expressionism ను బలపరచగా, విశ్వనాథాదులు ఆ తరువాతి యుగాలవారి Transcendentalism ను సాహిత్యరంగంలో స్థాపించారు. అది శిల్పానుశీలన విమర్శగా తెలుగులో ప్రసిద్ధికెక్కింది.

నవ్యసంప్రదాయోద్యమ కాలంలోనే క్రీ. శ. 1963 నుండి 1970 వరకు విమర్శ వికాసంలో సమన్వయ యుగంగా సంభావించాం. సమన్వయం సాహిత్య విమర్శ నిర్వహించే నాల్గవ బాధ్యతగా కూడా నిర్దేశించాం. సమన్వయయుగంలో సృజనాత్మక విమర్శకంటె, సమన్వయాత్మక, విశ్లేషణాత్మక విమర్శ ఎక్కు

వగా వచ్చింది. ఈ రకం విమర్శ చేసేవారు పాశ్చాత్య విమర్శ పద్ధతులనూ, ప్రమాణాలనూ, ప్రక్రియలనూ, పారిభాషిక పదజాలాన్నీ తెలుగు వారికి స్పష్టంగా తెలియపరుస్తూనే, వాటిని దేశీయమైనవాటితో సమన్వయిస్తూ సంవాద విధానాన్ని వ్యక్తం చేశారు. భారతీయ సిద్ధాంతాలతో పాశ్చాత్య సిద్ధాంతాలను తులనాత్మకంగా చర్చించి, ఆంధ్ర సాహిత్యంలో అవి యేవిధంగా ప్రయోగాలలో స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకొన్నాయో వివరించే విజ్ఞతను ప్రకటించారు. భారతీయ దృక్పథానికి పాశ్చాత్య ప్రభావం పరిపోషకద్రవ్యంగా ప్రవర్తిల్లిన పద్ధతిని ప్రవచించారు.

సమన్వయ విమర్శకూ, తత్త్వదర్శన విమర్శకూ మధ్యవర్తిగా ఉండేది అనుశీలనాత్మక విమర్శ. అనుశీలనం అనుభవస్ఫోరకంగా చేస్తూ సాహిత్య మూర్తిమత్వాన్ని సహృదయుల మనోనేత్రాలకు స్ఫురించేటట్లు ఈ విమర్శ సాగుతుంది. ఒక కళాఖండాన్ని చదివిన తృప్తిని కలిగించటంతో పాటు, విమర్శకుడు అనుశీలిస్తున్న అంశంమీద కొన్ని విలువలు కలిగిన నిర్ణయాలను గానీ, ఫలితాంశాలను గానీ అందుకుంటున్న అనుభవాన్ని ఈ విమర్శ కలిగిస్తుంది. శ్రీయుతులు పుట్టపర్తి నారాయణాచార్యులు, పింగళి లక్ష్మికాంతం, కాటూరి వెంకటేశ్వరరావు, జి. వి. కృష్ణారావు, పాటిబండ మాధవశర్మ, గిడుగు సీతాపతి, గుంటూరు శేషేంద్రశర్మ, యస్వీ జోగారావు మొదలైన విమర్శకులు ఈ శాఖను విశిష్టంగా పోషించారు. అనుశీలనాత్మక విమర్శలో పాటించిన శిల్పాన్నీ, అది అందించే అనుభూతినీ దృష్టిలో ఉంచుకొని విశ్లేషిస్తే ముఖ్యంగా రెండు రకాలు గోచరిస్తాయి. ఒకటి - అనుభవస్ఫూర్తికంటె తర్క విస్ఫూర్తికి ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చే విమర్శ. పుట్టపర్తి, గిడుగు సీతాపతి, జి. వి. కృష్ణారావు, గుంటూరు శేషేంద్రశర్మ గారల విమర్శ ఈ కోవకు చెందింది. రెండవది - తర్కస్ఫూర్తికంటె అనుభవదీప్తి ఎక్కువగా ఉండే విమర్శ. దీనిని రాళ్ళపల్లి, పింగళి, కాటూరి, పాటిబండ, యస్వీ జోగారావు మొదలైనవారు పోషించారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో దార్శనిక విమర్శకులు కావ్యతత్త్వ ప్రతిపాదనకు ప్రాముఖ్యమిస్తే, శిల్పానుశీలన విమర్శకులు కావ్యకళా ప్రమాణాలకు ప్రాధాన్యమిచ్చారు. దార్శనికులు సాహిత్యాన్ని సామూహికంగా దర్శించారు;

అనుశీలకులు కావ్యకళారూపాన్నే పరిశీలనకు పరిధిగా ఎన్నుకొన్నారు. ఈ రెండు రకాల విమర్శలోనూ ప్రామాణిక ప్రతిపత్తిని పొందిన విమర్శకులు విశ్వనాథ, రాళ్ళపల్లి, దువ్వూరి. ఈ వ్యాసకర్త కూడా ఆ రెండు శాఖల్లో గణనీయమైన కృషి చేసినవాడే.

ఉద్యమాలకూ, ధోరణులకూ సంబంధించిన వివిధ దృక్పథాలనూ, విభిన్న దృక్కోణాలనూ ఒక క్రమబద్ధంగా అన్వయించి సాహిత్య ప్రయోగ వ్యక్తిత్వాలకు విలువకట్టే పద్ధతి సమన్వయ విమర్శలో బలంగా గోచరిస్తుంది. ఇటువంటి చైతన్యానికి డాక్టర్ సి. నారాయణరెడ్డిగారూ, శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారూ ఉభయ పార్శ్వాలుగా కనపడతారు. నారాయణ రెడ్డి గారి సిద్ధాంతవ్యాసం 'ఆధునిక కవిత్వము - సంప్రదాయములు : ప్రయోగ ములు' (రచన 1962, ప్రచురణ 1967) తెలుగు విమర్శకు ఒక క్రొత్త ఒరవడి తెచ్చిపెట్టింది. సంప్రదాయ స్వరూపాన్నీ, ప్రయోగ స్వభావాన్నీ ప్రాచ్య పాశ్చాత్య దృక్పథాల సమన్వయదృష్టితో సమీక్షించిన ఈ గ్రంథం యుగకర్తల నిర్ణయంలోనూ, భావ కవితాయుగంలో వెలువడిన వివిధ ప్రయోగాల విలువలను నిర్ధారించటంలోనూ ఒక విశిష్ట సమన్వయమార్గాన్ని సమర్పించింది. దీని ప్రభావం తరువాతి విమర్శకులమీద బలంగా గోచరిస్తుంది. నారాయణరెడ్డిగారు చేసిన నిర్ణయాలు నవ్యసంప్రదాయ మార్గంలో నడిచినవారికి మార్గదర్శక సూత్రాలైనాయి; అభ్యుదయ వామపక్షీయులకు చర్చనీయాంశాలైనాయి. నారాయణరెడ్డిగారిది పరిశోధన గ్రంథమైనా విమర్శరంగంలో విశిష్ట ప్రభావం వేసింది.

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు సమన్వయ యుగంలోని మరో గొప్ప విమర్శకులు శ్రీ తిరుమల రామచంద్రగారన్నట్లు-"శ్రీ సుదర్శనంగారు భారతీయ సంస్కృతిపై గాఢాభినివేశం గలవారూ, విదేశ సంస్కృతిలోని సమీచీనాంశాలను గ్రహించి, సమన్వయించి భారతీయ సాహిత్యాన్నీ, దృక్పథాన్నీ సంపన్నం చేయాలనే సమ్యగాగ్రహం కలవారు." (సమాజము : సాహిత్యము-మనవిమాటలు. పు 4.) ఈ స్వభావం సమన్వయ విమర్శకు ఎంత వర్తిస్తుందో, నవ్యసంప్రదాయోద్యమ ప్రవృత్తికి అంత వర్తిస్తుంది. సుదర్శనంగారి విమర్శలో కవి వ్యక్తిత్వానికీ, సంఘానికీ, రచనకూ గల సంబంధాన్ని గుర్తించి, కవి దృక్పథాన్ని కావ్యంలోని ప్రమాణాలతో ఆవిష్కరించే పద్ధతి ప్రధానంగా కనపడుతుంది. కావ్యానుశీలనంలో కవి దృక్పథానికీ కావ్యానికీ గల సంబంధమే నిశ్చిత ప్రమాణ

మనీ వారు పేర్కొన్నారు. ఈ ప్రమాణంతో ఏ కాలంలోనైనా ఏ దృక్పథంతోనైనా రచించబడిన రచనను అనుశీలించవచ్చునని పేర్కొన్నారు వీరి 'సాహిత్యంలో దృక్పథాలు' (1968), 'సమాజము : సాహిత్యము' (1972) అనే వ్యాస సంపుటులు సమన్వయ విమర్శకూ, నవ్య సంప్రదాయంలోని శాస్త్రీయమూ, ఆధునికమూ అయిన దృక్పథానికీ దారులు వేశాయి. "నామటుకు నాకు రసము అంటే 'Unity of moods అని అన్వయించుకోవచ్చునేమో అని తోస్తుంది. ఒక విశిష్టమైన మనఃస్థితిని నాలో కలిగించగల రచనని, రచనాభాగాన్ని లేక వాక్యాన్ని రసవంతమైందిగా చెప్పవచ్చు. అక్కడ మనఃస్థితి అంటే ఒక హృదయానుభూతే కాదు, దానికి అనుబంధమై మేధాగతమైన విశేషభావస్ఫురణ కూడా అని ఉద్దేశం." (సమాజము : సాహిత్యము, పు. 173). సుదర్శనంగారు ప్రదర్శించిన సమన్వయశీలం ఆధునిక విమర్శ కుండవలసిన సజీవలక్షణంగా మాత్రమే కాకుండా, నవ్యసంప్రదాయోద్యమ చైతన్యానికి ఆధునిక స్ఫూర్తిగా కూడా గోచరిస్తుంది.

శిల్పానుశీలన విమర్శ ద్వారా కావ్యాన్ని హృదయంతో అనుభవిస్తున్నట్లు సామాజికుడు సంభావిస్తాడు. సమన్వయ విమర్శలో కావ్యాన్ని మేధతో ఆస్వాదిస్తున్నట్లు అనుభవిస్తాడు. అంటే- నవ్యసంప్రదాయోద్యమంలో సాహిత్య విమర్శ శిల్పానుశీలనయుగం (1948-63)లో సహృదయుని తన్మయీభవనశక్తిని పోషిస్తే సమన్వయయుగంలో (1963-70) ఆలోచనాశక్తిని పెంపొందించింది. కావ్యానుశీలనయుగవిమర్శకంటె విలక్షణత్వాన్ని సాధించటంకోసం శిల్పానుశీలన ప్రవృత్తి ముందుకు వచ్చింది మార్క్సిస్టు విమర్శ దృక్పథంకంటె తన ప్రత్యేకతను నిరూపించుకొనటానికి సమన్వయ విమర్శ ఆలోచనతో పురోగమించింది. సమకాలీన సాహిత్య జీవితంలో నవ్యసంప్రదాయోద్యమ చైతన్యాన్ని ఎప్పటికప్పుడు బలపరిచే సహజ ధోరణులే విమర్శ వికాసంలో వివేచించిన యుగాలు.

నవ్యసంప్రదాయోద్యమ విమర్శ ఒక పదిహేనేళ్ళు అనుభూతిని లక్షించింది. మరొక పదిహేనేళ్ళు ఆలోచనను ఆదరించింది. అనుభూతినుండి ఆలోచనవైపు పయనించిన సాహిత్య విమర్శ శక్తియుక్తులను రెండింటినీ ప్రదర్శించింది.

*

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 18-3-1990)

# విమర్శకు వివేచన వెన్నెముక

సాహిత్యవిమర్శ చరిత్రలో వివేచనాత్మక విమర్శ వెలయించే విమర్శకులు కీలకమైన పాత్ర నిర్వహిస్తూ ఉంటారు. దానికి కారణం విమర్శ నిర్వహించే ఆరు రకాలైన బాధ్యతలలో 'వివేచన' ఒక సంధిస్థానంలో ఉండటమే. ఎలాగంటే వర్ణనాత్మక, విశ్లేషణాత్మక విమర్శలు సాహిత్యంమీద అభిరుచిని పెంచుకోవడానికీ, సాహిత్యంలోని విలువైన విశేషాలను తెలుసుకోవటానికి క్రమంగా తోడ్పడితే, వివేచన సాహిత్యమూర్తిమత్త్వాన్ని శాస్త్రీయంగా నిగ్గుతేల్చి నిరూపించటానికి దోహదం చేస్తుంది. వివేచన ఎంత గాఢంగా సాగితే సమన్వయానికి అంత సౌలభ్యం ఏర్పడుతుంది; అనుశీలనానికి అంత అనుకూల్యం ఏర్పడుతుంది; తత్త్వ దర్శనానికి అంత అనువైన దృక్పథం లభిస్తుంది.

విమర్శకు వర్ణనం, విశ్లేషణం పాదాల వంటివి. వివేచనం నడుము వంటిది లేదా వెన్నెముక వంటిది, సమన్వయం గుండెవంటిది, అనుశీలనం ఊపిరితిత్తుల వంటిది; తత్త్వదర్శనం మెదడు వంటిది. అందువలన నడుము లేదా వెన్నెముక కాళ్ళమీద శరీరం నిలబడటానికి గాని, వంగి పనిచేయటానికి గాని ఎంత అవసరమో, విమర్శ చైతన్యవంతంగా ఉండటానికి వివేచన అంత అత్యవసరం! విమర్శ జీవితాన్ని వివేచన ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ శాసిస్తూ ఉంటుంది. కాబట్టి,యే ఉద్యమకాలంలోనైనా ఆ ఉద్యమనికి ప్రామాణికత్వంలోపాటు అస్తిత్వాన్ని కూడా కల్పించే విమర్శ చైతన్యాలలో వివేచన మొదట లెక్కించవదగింది.

ఇంగ్లీషులో Discrimination, Examination, Investigation, Scrutiny - అనే పారిభాషికపదాలు ఏయే విమర్శ ధర్మాలను బోధిస్తాయో, ఆధర్మాల నన్నింటినీ నిర్వహించే విమర్శనశక్తి వివేచన. ఇది పరిశోధన ప్రవృత్తికి చాల దగ్గరగా ఉంటుంది. కాని, విమర్శకుని ఆత్మీయతను కొంత సంపదించుకొంటుంది. ఆత్మీయత అభిమచి విమర్శ లక్షణం కాదు. అభిరుచిని శాస్త్రీయంగా స్వీయపద్ధతిలో వ్యక్తీకరింపజేసిన తర్కశక్తిగా ఆత్మీయత ఈ విమర్శలో రాణిస్తుంది. వివేచనాత్మక విమర్శ శాస్త్రంలాగా నిష్ఠురంగానే

ఎక్కువపాళ్ళు వర్తిస్తుంది. అయినా, కళలాగా లాలిత్యాన్ని, అనురంజనాన్ని కూడా అనువైనంత అందగించుకొంటుంది. విలువలెరిగి సాహిత్యాన్ని వివేచించి ప్రయోగాల గుణగణాలనూ, సత్యాసత్యాలనూ, బలాబలాలనూ నిగ్గుతేల్చి నిరూపించటమే కాకుండా, ప్రక్రియల స్వరూపస్వభావాలను పరిశీలించి ప్రకటించటమో, పరిష్కరించటమో చేయగల విమర్శశక్తి వివేచన. దీనిని విమర్శ కుండదగిన సహజ లక్షణంగా కొందరు పేర్కొంటారు. కాని, సహజ లక్షణం అనటం కంటె శక్తిమంతమైన లక్షణం అనటం సమంజసం. ఏ ఉద్యమానికైనా ఈ విమర్శ చైతన్యం మూలశక్తిగా పనికి వస్తుంది.

ఆధునిక సాహిత్యోద్యమాలలో నవ్యసంప్రదాయోద్యమం వెలువరించిన సాహిత్య విమర్శకు వివేచనాత్మక విమర్శలు స్థితిని, గతిని కల్పించాయనటంలో అనుమానం లేదు. ఇటువంటి విమర్శలు 1935 - 1975 నడుమ అసంఖ్యాకంగా వచ్చాయి. విమర్శకులు కూడా, స్థూలంగా లెక్కించినా, దాదాపు ఏభై మంది కనపడుతున్నారు ఇది చిన్న విషయం కాదు; ఆధునిక కాలంలో మరే ఉద్యమానికీ ఇంతమంది విమర్శకులు పాల్గొన్న అదృష్టం పట్టలేదు.

అయితే, ఈ విమర్శకులందరూ ఎవరికివారుగా వారికి తోచిన అంశాల మీద విమర్శ వివేకాన్ని వెలయించినట్లు స్థూలంగా గోచరించినా, అందరి కృషిలోనూ అంతర్లీనంగా నవ్య సంప్రదాయోద్యమ చైతన్యం ప్రవహిస్తుంది. వీరందరూ గతానుగతికంగా సమీక్షలు చేసినవారు కారు; తమ పరిశీలనలద్వారా ప్రతిభావంతంగా వినూత్నాంశాలను వెలికితీసి ప్రతిపాదించినవారు.

ఈ ఉద్యమం దాదాపు నలభై ఏళ్ళకు పైబడి బలంగా సాగటం చేత వివేచనాత్మక విమర్శను వెలయించే వారిలో రెండు తరాలవారు స్పష్టంగా గోచరిస్తారు. వీరిలో ఒక సూక్ష్మభేదం కూడా కనపడుతుంది. ముందు తరంవారు గతంకంటె ప్రాచీనాధునిక సాహిత్యాలు సాధించిన క్రొత్త విలువలను నవ్య సంప్రదాయ దృష్టితో నిరూపించినా ప్రక్రియాపరమైన ప్రత్యేకనిష్ఠ వారిలో కానరాదు. అంటే - కవులు చేసిన వినూత్న ప్రయోగాలలోని వినూత్నాంశాలను,

సాంప్రదాయికాంశాలను నిరూపించటంలో నిష్ఠను ప్రకటించిన ఈ తరం ఆ ప్రయోగాల వెనుకనున్న ప్రక్రియా స్వరూపస్వభావాలను అంతగా దృష్టిలో పెట్టుకొనేది కాదన్న మాట!

మరి, రెండోతరంవారి దృష్టి దీనికి సాక్షాత్తు వ్యతిరిక్తం. ప్రక్రియా స్వరూప స్వభావాలు తెలియకపోతే ప్రయోగాన్ని శాస్త్రీయంగా పరిశీలించలేమని ఈతరంవారు నమ్ముతారు; దానికనుగుణంగా విమర్శిస్తారు. ఆధునికులు వినూత్న ప్రయోగాలు చేయటానికి, చేసినవాటిని విశ్లేషించి, వివరించటానికి ఈతరంవారి వివేచన విమర్శ ఎంతో తోడ్పడింది.

ఒక ప్రక్రియలోని వస్తువునూ, రచనా శిల్పాన్నీ మొదటి తరంవారు ఎక్కువగా గౌరవిస్తే, రెండవ తరంవారు ప్రయోగాన్నీ, ప్రక్రియా వైలక్షణ్యాన్నీ నిశితంగా పరిశీలించేవారు. ఇరువురికీ క్లాసిక్ రూపమే ప్రమాణం! తదనుగుణమైన సాహిత్య దృక్పథమే ఉపలక్ష్యం!

మొదటితరం విమర్శకులలో ముఖ్యులు - శ్రీయుతులు వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, గుర్రం వెంకట సుబ్బయ్య, బండారు తమ్మయ్య, నోరి నరసింహశాస్త్రి, కుందూరి ఈశ్వరదత్తు, దీపాల పిచ్చయ్యశాస్త్రి, వేదాల తిరువేంగళాచార్యులు, ఖండవల్లి లక్ష్మీరంజనం, భూపతి లక్ష్మీనారాయణరావు, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, తిరుమల రామచంద్ర, నండూరి రామకృష్ణమాచార్యులు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి, పువ్వాడ శేషగిరిరావు, తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, విన్నకోట మాధవరావు, ఓరుగంటి నీలకంఠశాస్త్రి, గడియారం వేంకట శేషశాస్త్రి, ధూళిపాళ శ్రీరామమూర్తి, కొండూరి వీరరాఘవాచార్యులు, కోరాడ రామకృష్ణయ్య మొదలైనవారు.

రెండవతరం విమర్శకులలో ముఖ్యులు- శ్రీయుతులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీవాత్సవ, తూమాటి దొణప్ప, రావూరి దొరస్వామిశర్మ, అమరేంద్ర, కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి, తిమ్మావజ్ఝల కోదండరామయ్య, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, బాలాంత్రపు రజనీకాంతరావు, నాయని కృష్ణకుమారి, సుప్రసన్న, సంపత్కుమారాచార్య, జి. వి. సుబ్రహ్మణ్యం, వేటూరి

ఆనందమూర్తి, వడలి మందేశ్వరరావు, మాదిరాజు రంగారావు, అక్కిరాజు రమాపతిరావు, అమరేశం రాజేశ్వరశర్మ, వి వి యల్. నరసింహారావు, సర్దేశాయ్ తిరుమలరావు, కె.వి. రమణారెడ్డి, సాళువ కృష్ణమూర్తి, దేవళ్ళ చిన్నికృష్ణయ్య, తుమ్మపూడి కోటీశ్వర రావు, కాళూరి హనుమంతరావు, బుచ్చిబాబు ప్రభృతులు.

మొదటితరం విమర్శకులలో చాలామంది ప్రాచీనకవుల కవితావ్యక్తిత్వాలపై తమ పరిశీలనలను సాగించారు. అంతేకాదు, ఒక్కొక్కరు ఒక్కొక్క మహాకవికి సంబంధించిన సాహిత్యానికి న్యాయవాదుల్లాగా విమర్శరంగంలో నిలిచారు. నవ్యసంప్రదాయయుగ విమర్శ చైతన్యంలో ఇది మొదటి ప్రత్యేకత. అయితే నోరివారు, ఖండవల్లివారు, తిరుమల రామచంద్రగారు, వేదాలవారూ ఆధునిక సాహిత్యంలో కూడా తమ ఒరవడిని, వైఖరిని నిలుపుకొన్నారు.

రెండవతరం వారు అటు ప్రాచీన సాహిత్యాన్నీ, ఇటు ఆధునిక సాహిత్యాన్నీ సమప్రాధాన్య దృష్టితో సవ్యసాచుల్లాగా విమర్శించారు. నన్నయరచన అనువాదం కాదనీ, అనుసృజనమనీ; దానిని స్వతంత్ర కావ్యేతిహాస ప్రమాణాలతోనే అనుశీలించాలనీ ఎలుగెత్తి చాటింది ఇంద్రగంటివారు. అటు తిక్కన రచనలనైనా ఇటు గురజాడ నాటకాన్నైనా ప్రక్రియాపరంగా ఒక కచ్చితమైన అవగాహనకు వస్తే తప్ప, అనుశీలనానికి ఒక ప్రామాణికమైన మార్గం ఏర్పడదని తన విమర్శనంతా ఒక ఉద్యమంలాగా నడిపిన వారు కేతవరపు వారు. శ్రీవాత్సవ, తూమాటి దొణప్ప, కొర్లపాటి, తిమ్మావజ్ఝల, బాలాంత్రపు, వేటూరి, నాయని కృష్ణకుమారి, జి. వి. సుబ్రహ్మణ్యం, సర్‌దేశాయి, రావూరి, శ్రీపాద, సాళువ, దేవళ్ళ, కె వి., వడ్లమూడి, పీవీయల్- వీరందరూ తాము పరిశీలిస్తున్న సాహిత్యంలోని రచనల యొక్క ప్రక్రియాపరమైన పరిజ్ఞానాన్ని ముందుగా శాస్త్రీయంగా ప్రతిపాదించి, ఆపైన దానికనుగుణంగా కావ్యాంశాలను సప్రమాణంగా సంవదించే వివేచనను ఘంటాపథం చేసిన వివేకవంతులు. నేడు ప్రాచీనాధునిక కావ్య ప్రక్రియలలోనూ, దేశిసాహిత్య ప్రక్రియలలోనూ, జానపద సాహిత్య ప్రక్రియలలోనూ ప్రక్రియావికాస విమర్శ ఈ నవ్య సంప్రదాయోద్యమ విమర్శకులు పెట్టిన భిక్షయే.

అమరేంద్ర, శ్రీపాద, సుప్రసన్న, సంపత్కుమారాచార్య, వడలి, మాదిరాజు, తుమ్మపూడి, కాళూరి మొదలైన విమర్శకులు సాహిత్య ప్రక్రియా

దృష్టికంటె ప్రయోగ దృష్టిని ఎక్కువగా సారించారు. అయితే, ప్రతి ప్రయోగం వెనుకనున్న సాహిత్య తాత్త్విక భూమికలను సప్రమాణంగా ప్రతిపాదించటంలో తమదైన ఒక ప్రత్యేకతను విడివిడిగా నిలుపుకొన్నారు.

వివేచనాత్మక విమర్శలు చదివితే ఒక రచనను శాస్త్రీయంగా అధ్యయనం చేస్తున్నామన్న తృప్తి పఠితలకు కలుగుతుంది. అంతేకాదు, ప్రతి కళాఖండాన్నీ ప్రక్రియా పరిజ్ఞానంతో పరిశీలించినప్పుడే దాని ప్రత్యేకత ద్యోతకమౌతుందనీ, ఇతర రచనలకంటె దానికున్న సృజనాత్మక వ్యక్తిత్వం స్పష్టమౌతుందనీ అవగతమౌతుంది దార్శనిక విమర్శకులు సమాజంలో సాహిత్య తత్త్వజిజ్ఞాసను పెంచుతారు. అనుశీలన విమర్శకులు కావ్య రసాస్వాదన నినుమడింపజేస్తారు; సమన్వయ విమర్శకులు కవి దృక్పథానికీ, కావ్యశిల్పానికీ ఉన్న అనుబంధాన్ని చెప్పి ఒక వివేకాన్ని కలిగిస్తారు; వివేచనాత్మక విమర్శకులు సాహిత్యంపట్ల శాస్త్రీయ దృక్పథాన్ని అందిస్తారు. ఇలాగే - విశ్లేషణాత్మక విమర్శకులు సమాజంలో సాహిత్యానుశీలనానికి అనువైన ఉన్ముఖీకరణం సాధిస్తారు; వర్ణనాత్మక విమర్శకులు సామాజికులలో సాహిత్య రసికత్వాన్ని పరిపోషించటానికై ప్రయత్నిస్తారు. వీరందరూ ఒక్కొక్క రకంగా ఒక్కొక్క బాధ్యతను నిర్వహిస్తూనే, ఒక ఉద్యమంలోని విమర్శ బాధ్యతల నన్నింటినీ సమష్టిగా సాధించటానికి యత్నిస్తారన్నమాట! నవ్య సంప్రదాయోద్యమంలో వెలువడిన విమర్శ ఈ బాధ్యతలన్నీ పటిష్ఠంగా నిర్వహించిందనటంలో అనుమానం లేదు. తెలుగులో సాహిత్య పరిశోధనకు జీవధాతువులను నింపింది నవ్య సంప్రదాయ విమర్శయే!

నవ్యసంప్రదాయ విమర్శోద్యమాన్ని ఉపన్యాస వ్యాస ప్రక్రియను ఆలంబనంగా చేసుకొని ఆంధ్రదేశంలోని నలుమూలలా వ్యాపింపజేసిన మహావక్త, విమర్శకుడు దివాకర్ల వేంకటావధానిగారు. ఆయన ఉపన్యాసం మౌలికంగా మలచబడిని ఒక వ్యాసం; వారి వ్యాసం పఠితకోసం లిఖింపబడిన ఉపన్యాసం. ఉపన్యాసానికి దగ్గరగా వ్యాసాన్ని పానుగంటివారు తీసుకొనివస్తే, వ్యాసానికి చేరువగా ఉపన్యాసాన్ని అవధానిగారు తెచ్చారు. ప్రాచీన కావ్యాన్ని గురించిగానీ, ఆధునిక రచనను గురించిగాని అవధానిగారు ఉపన్యసిస్తే, శ్రోతకు విశ్లేషణ - వివేకాన్ని చ్చేది; వర్ణన - ఆసక్తిని పెంచేది. అవధానాలు, కవిసమ్మేళనాలా

కవులను ఉత్సాహపరచినట్లే అవధానిగారి ఉపన్యాసాలు ప్రజల నలా ఉత్తేజపరిచేవి. విశేషమేమంటే - వారి ఉపన్యాసంలో అవధానం ధారణాశక్తిగానూ, కవి సమ్మేళనాలు - వారు పుంఖానుపుంఖంగా ఉదాహరించే పద్యాలలోనూ, విశ్లేషణ వారి ప్రణాళికలోనూ, వర్ణన వారి వివరణ విధాన శిల్పంలోనూ జాలువారి, ఆ ప్రక్రియకు ఒక సమగ్రతను సంతరించిపెట్టాయి. విశ్లేషణ విమర్శకులందరూ అవధానిగారిలాగా మహావక్తలు కారు.

ఇక్కడ, సందర్భం వచ్చింది కాబట్టి, మరొక అంశాన్ని మనవి చేస్తాను. ఆధునికయుగంలో వక్తలుగా రాణించిన కవులు, రచయితలు, విమర్శకులే సాహిత్యోద్యమాలు ప్రజలలోకి ప్రవేశించటానికి వీలుగా తోడ్పడతారని అనటం సత్యదూరం కాదేమో! విశ్వనాథ, పుట్టపర్తి, రాళ్ళపల్లి, కట్టమంచి, దివాకర్ల, దేవులపల్లి, నారాయణరెడ్డి - ఇలా కొంతమంది ప్రతిభావంతులైన రచయితలు మహావక్తలై ఉండటంవల్ల ఉద్యమాలకు ఎంతో మేలు జరిగింది.

నవ్యసంప్రదాయ విమర్శలో విశ్లేషణాత్మక చైతన్యాన్ని పోషించినవారెందరో ఉన్నారు. వారిలో అత్యంత ప్రధానులు - శ్రీయుతులు నిడదవోలు వెంకటరావు, కె. వి. ఆర్. నరసింహం, తాపీ ధర్మారావు, విస్సా అప్పారావు, నేటూరి వెంకటరమణయ్య, మరుపూరి కోదండరామిరెడ్డి, శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి, బి. రామరాజు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, జీరెడ్డి చెన్నారెడ్డి, కె. గోపాల కృష్ణారావు, పల్లా దుర్గయ్య, జి నాగయ్య, కొత్త సత్యనారాయణ చౌదరి, వంతరాం రామకృష్ణారావు, చల్లా రాధాకృష్ణశర్మ, బొడ్డుపల్లి పురుషోత్తం, పి. యశోదారెడ్డి, ఎం. కులశేఖరరావు, టి వి. సుబ్బారావు, ఆర్వీయస్. సుందరం మొదలైనవారు.

అలాగే, వర్ణనాత్మక విమర్శ పద్ధతిలో ప్రసిద్ధులు - శ్రీయుతులు మల్లాది సూర్యనారాయణశాస్త్రి, కురుగంటి సీతారామయ్య, ఖలుసు వెంకటేశ్వర్లు, కేశవపంతుల నరసింహశాస్త్రి, శిష్టా రామకృష్ణశాస్త్రి, పిల్లలమర్రి వెంకట హనుమంతరావు, దేవులపల్లి రామానుజరావు మొదలైనవారు. ఈ తరంలో మరెందరో ఉన్నారు.

నవ్యసంప్రదాయోద్యమం సాగుతున్న రోజుల్లో అభ్యుదయ వామపక్షీయ విమర్శ తెలుగులో అక్కడక్కడా కనపడుతున్నా- అది ఉద్యమస్ఫూర్తిని పొంద లేదు. శ్రీశ్రీ, ఆరుద్ర, కుందుర్తి, ఆవంత్స సోమసుందర్, కొడవటిగంటి, కె.వి.ఆర్., రా రా., బంగోరె, మిక్కిలినేని, మద్దూరి, అద్దేపల్లి, త్రిపురనేని ప్రభృతులు అభ్యుదయ భావాలతో వామపక్షీయ విమర్శను సాగించి, ఆ శాఖకు కొంత ప్రాశస్త్యాన్ని తీసికొనివచ్చారు. కొంతలో కొంత శ్రీశ్రీ విమర్శలో సోషలిస్టు మానవతావాద ధోరణి ప్రతిఫలిస్తుంది; కొడవటిగంటి కుటుంబరావుగారి విమర్శలో సామ్యవాద వాస్తవికత, కుందుర్తి విమర్శలో సామాజిక స్పృహ, కె.వి.ఆర్, త్రిపురనేని మధుసూదనరావుగార్ల విమర్శలో విప్లవ ధోరణులు స్పష్టంగా గోచరిస్తాయి.

పాశ్చాత్య దేశ సాహిత్యాలతో పోల్చుకుంటే తెలుగులో మార్క్సిస్టు విమర్శ ఒక ఉద్యమంగా- కవిత్వంలో వచ్చినట్లు- రాలేదని మార్క్సిస్టు ధోరణి విమర్శకులే భావిస్తున్నారు. "సాహిత్య విమర్శలో మూల సూత్రాలను గురించిన చర్చే ఎక్కువ జరిగింది. సాహిత్యం ఫలానిది చెయ్యాలి, ఫలానిది చెయ్యగూడదు వంటి సూత్రీకరణలే ఎక్కువ జరిగినై.... మార్క్సిస్టు విమర్శకు నమూనాగా గ్రహింపదగిన గ్రంథ విమర్శగాని, ప్రక్రియా విమర్శగాని తెలుగులో ఇంకా రావలసి ఉంది" - అని చేకూరి రామారావుగారూ (ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు - పు 201, 202). "అభ్యుదయ సాహిత్యం మనకు దండిగానే వుంది. కాని, ఆ సాహిత్యంమీద విమర్శే పెద్దగా రానిది. ఏదో అప్పుడప్పుడు సమీక్షలు, వ్యాసాల సంకలనాలు తప్ప వివిధ ప్రక్రియల మీదా, ఒక్కొక్క రచన మీదా, రచయితమీదా సమగ్రమయిన, స్థాయి కలిగిన విమర్శలు, పరిశోధనలు వెలువడలేదు. శ్రీశ్రీ సాహిత్యంమీదే ఈనాటికి సమగ్రమైన విమర్శలేదు. అభ్యుదయ సాహిత్యరంగంలో మేధావులైన విమర్శకులున్నారు. కాని, వారినుండి ఆశించినంత విమర్శాసాహిత్యాన్ని అందుకోలేకపోతున్నాం'' - అని సంజీవమ్మగారూ (అభ్యుదయ - విమర్శ విశేష సంచిక - పు 40) పేర్కొనటం ఇందుకు సాక్ష్యం.

విమర్శ సాహిత్యోద్యమంలో శక్తిమంతమైన సాధనంగా మాత్రమే కాక, స్ఫూర్తిమంతమైన ప్రక్రియగా కూడా పాలు పంచుకొంటుంది. అందువలన సాహిత్యోద్యమమైన నవ్యసంప్రదాయోద్యమంలో సాహిత్య విమర్శ సమగ్ర వికాసాన్ని పొందుతూ ఉద్యమ చైతన్యాన్ని పరిపోషించింది. అభ్యుదయ విప్లవోద్యమాలలో విమర్శకు అటువంటి అవకాశం తక్కువ. ఎలాగంటే - మార్క్సిస్టు విమర్శలో దర్శనం సామాజికం; అనుశీలనం నియంత్రితం; సమన్వయం నిబద్ధం; వివేచనం సాహిత్యానికి స్వతంత్ర స్థితిగతులు లేవన్న సూత్రంచేత నియతం. ఇక విశ్లేషణం, వర్ణనం ఆ విమర్శకు ముందుకు సాగే పదద్వయం. అందువలన దానికి గతి ఉంది కాని, ప్రగతి లేదు నవ్యసంప్రదాయ విమర్శ సర్వాంగ సమృద్ధంగా ఉద్యమ చైతన్యాన్ని సమగ్రంగా సాధించింది. *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు:
ఆదివారం ఆంధ్రప్రభ : 25-3-1990)

# కాదనలేని వాస్తవం నవ్యసంప్రదాయోద్యమం

తెలుగు విశ్వవిద్యాలయం వారు మార్చి 10, 11, 12 తేదీలలో మూడవ అఖిల భారత తెలుగు మహాసభలను బెంగుళూరులో నిర్వహించారు. ఆ సందర్భంగా 'తెలుగువాణి' అనే పేర ఒక ప్రత్యేక సంచికను వెలువరించారు. అందులో కడచిన పాతికేళ్ళలో వచ్చిన సాహిత్యప్రక్రియలలోని ప్రయోగాలనూ, ఉద్యమాలనూ సమీక్షించే వ్యాసాలను కొన్నింటిని ప్రచురించారు.

అందులో 'ఈ పాతికేళ్ళ తెలుగు కవిత్వం' అనే అంశం మీద ఆచార్య చేకూరి రామారావు గారు ఒక వ్యాసం వ్రాశారు. వారి అభిప్రాయం ప్రకారం - "సుమారుగా 1965 నుంచీ వచ్చిన కవితాధోరణులలో ప్రతిభావంతమైన ధోరణులలో ప్రతిభావంతమైన ధోరణులు మూడు: 1. విప్లవోద్యమ కవిత, 2. స్త్రీ చైతన్య కవిత, 3. ఉద్యమేతరమైన ఆలోచనాత్మక కవిత. ఇవికాక, నవ్యసంప్రదాయ కవిత, జాతీయవాద కవిత - అని రెండు ధోరణులున్నట్లు కొందరంటున్నారు. ఇంకా మిగిలి ఉన్న సంప్రదాయాన్ని నవ్యసంప్రదాయంగా పిలుస్తున్నారు. అది కొత్త ధోరణికాదు; జాతీయవాద కవితలో ప్రధానమైనది హిందూ జాతీయత, కమ్యూనిస్టు వ్యతిరేకత. ఈ ధోరణి బలమైన ధోరణిగా నిలద్రొక్కుకున్నట్లు లేదు. ఇవి కాక అనుభూతివాద కవిత అనే పేరుతో కొందరు కొన్ని కావ్యఖండికలను పిలుస్తున్నారు. అనుభూతి ఏ ఉత్తమ కవిత్వానికైనా లక్షణమే కాబట్టి ఇదొక ప్రత్యేక ధోరణిగా కనిపించదు. ఇదొక వాదం కాదు. మంచి కవిత్వంలో కనిపించే ఒక అంశం ఈ పాతికేళ్ళ తెలుగుకవిత్వం ఆధునిక ఆంధ్ర కవిత్వ చరిత్రలో చిరకాలం నిలవదగ్గ కవులనూ, కవితా ఖండికలనూ, కావ్య సంపుటాలనూ మన కిచ్చింది. ఇది ఫలవంతమైన పాతికేళ్ళ కాలం" (పు 22).

ఆచార్య రామారావు గారి వ్యాసం చదవగానే నాకు డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్యగారు 'ఈ దశాబ్దంలో సాహిత్య విమర్శ' అనే వ్యాసంలో

(ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980 - 1990). యువభారతి ప్రచురణ) వ్రాసిన ఈ క్రింది వాక్యాలు జ్ఞాపకానికి వచ్చాయి: "ఈ దశాబ్దంలో ప్రధానంగా గుర్తింపవలసిన ప్రధానాంశం ఒకటి ఉంది. అది దేశీయమయిన విమర్శవిధానం, మార్క్సిస్టు విమర్శవిధానం పరస్పరం తమను తాము స్పష్టం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్న తీరు. ఈ ఉభయరీతులూ ఈ దశాబ్దంలో పడినంత పోటీ మరే దశాబ్దంలోనూ కన్పించదు" (పు. 78). ఈ పోటీ ఎంతవరకు వచ్చిందంటే - ఒక విధానంవారు మరో విధానంవారిని కనీస ప్రమాణాలమేరకు అవగాహనం చేసుకొని వివేచించే సాహిత్య మర్యాదలను పాటించలేని వివాదస్థితికి చేరుకొన్నది. దానితో నేటి కాలపు సాహిత్యంలో నిష్పక్షపాతవైఖరి లేదా ఆబ్జెక్టివిటీ కొంత వరకు లోపిస్తోంది. అయితే, ఒక ఉద్యమానికో, ఒక దృక్పథానికో కట్టుబడ కుండా ఉంటూ సమకాలీన సాహిత్యజగత్తులో రచన సాగించటం కత్తిమీద సాములాగానే కనపడుతోంది. ఆచార్య రామారావుగారు ఈ పాతికేళ్ళ కవిత్వాన్ని గురించి వ్రాస్తూ ఈ మధ్యనే జ్ఞానపీఠ పురస్కారం పొందిన 'విశ్వంభర' ప్రసక్తిగానీ, నారాయణరెడ్డిగారి ప్రయోగాలను గురించిగానీ, శేషేంద్రశర్మగారి వంటి కవులు మరికొందరు ఉన్నారన్న వాస్తవాన్ని గురించిగానీ అసలు ప్రస్తా వించకపోవటం విచారకరం. దానివలన సాహిత్యానికి జరిగే అన్యాయం ఏమీ ఉండదు కాని, వ్యాసకర్త కనీస కర్తవ్యం పాటించలేదన్న కొరత మిగిలి పోతుంది.

ఫిబ్రవరి 4 వ తేదీన యువభారతి 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' అనే అంశంమీద ఒక సదస్సు జరిపి, ఆ వ్యాసాలను ఒక గ్రంథంగా ప్రచురిం చింది. ఆశీర్షికతోనే ఒక వ్యాసం వ్రాస్తూ డాక్టర్ నాయని కృష్ణకుమారిగారు సత్యదృక్పథంతో వాస్తవాలను విశ్లేషించి వివేచించారు, చూడండి -

1. "విరసం ఈ పదిసంవత్సరాలలో తెలుగుసాహిత్యానికి చేసిన మేలొకటి చెప్పక తప్పదు. ఈ దశకంలో 'పాట' ప్రాభవం పెరిగింది .... మౌఖికపద్ధతిని పునరుద్ధరించడమనేది కవితారంగానికి అవసరమని మనం తిరిగి గుర్తించవలసి ఉంది."

2. "అనుభూతి కవితగా నామాంతరం సంపాదించుకొన్న, తొలినాటి భావకవిత ఈ దశకంలో ఎక్కువగానే కనిపిస్తుంది. పది పదిహేను సంవత్స

రాలు (30 - 44) మాత్రం బతికి చచ్చిపోయిందనీ; అది వలాయనవాద కవిత్వం కనుక దీన్ని జనం నిరసించారనీ; చిలకపలుకులు పలికినా, కాల్పనిక కవిత్వం చచ్చిపోలేదనీ; అది పునరుజ్జీవితమై ఈ దశకంలో మరింత శక్తి మంతంగా కనిపిస్తున్నదనీ నిరూపించవచ్చు. ఒక పార్టీ సిద్ధాంతానికో ఇజానికో కట్టుబడి ఉండాలన్న నిబద్ధత లేనిది ఈ కవిత్వం అంతమాత్రంచేత కవి ఆత్మ కథనాన్ని వెలువరించాలే కాని సంఘప్రయోజనం ఉండనక్కరలేదన్న ఊహతో మడికట్టుకున్నవాళ్ళు కాదు వీళ్ళు. వీళ్ళ కవిత్వంలో కూడా సమకాలిక సమస్యలూ స్థితిగతులూ ప్రతిబింబిస్తూ ఉంటాయి, కాకపోతే అటువంటివన్నీ కవిని ఆశ్ర యించుకుని ఉండటంవల్ల కవి ప్రథమ స్థానీయుడూ, కవిత్వం ద్వితీయస్థానీ యమూ అయి భాసిస్తుంటుంది. సమాజ వాస్తవికతతోపాటు కవి స్థానమూ అతని ఆలోచనలకు కూడా ఇక్కడ ప్రాధాన్యం కనిపిస్తుంది."

3. "ఈ దశకానికి సంబంధించిన మరొక వాదం స్త్రీవాద కవిత."

4. ''నవ్యసంప్రదాయవాదమనే కొత్త వాద మొకటి ఈ దశకంలో నిర్దుష్టంగా రూపుదిద్దుకొనే అవకాశం కనపడుతూ వుంది." (పుటలు 5,6,7,13.)

పై విషయాలను గమనిస్తే రామారావు గారికంటె కృష్ణకుమారిగారు విశాల దృక్పథంలో విమర్శక బాధ్యతను నిర్వహించినట్లు కనపడుతుంది. ఆ విషయాన్ని నవ్యసంప్రదాయం, అనుభూతివాద కవిత్వం అనే అంశాలమీద వారిరువురూ ప్రకటించిన అభిప్రాయాలే స్పష్టం చేస్తున్నాయి.

'ఈ దశాబ్దంలో తెలుగుకవిత' (1980 - 90) అనే వ్యాసంలో డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య గారు 'ఎనిమిది ధోరణులు కవితలో ఊపిరిపోసుకొన్న దశాబ్దం ఇది' అని అభివర్ణించారు. అవి— 1. అనుభూతి కవిత, 2. జాతీయ వాద కవిత, 3. స్త్రీ (విముక్తి) వాద కవిత, 4. మానవతాకవిత, 5. తాత్త్విక కవిత, 6. మార్క్సిస్టు కవిత, 7. ఆత్మకథాకవిత, 8. స్మృతి కవిత. వీరి వ్యాసంమీదకూడా చేకూరి రామారావు గారు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. చేరా గారి దృష్టిలో కృష్ణకుమారి గారు అనుభూతి కవిత్వంమీద ప్రకటించిన భావాలు 'అభిమానంతో పాజిటివ్‌గా' ఉన్నాయనీ, దాన్ని 'రిదక్షనిజం' అంటారనీ పేర్కొన్నారు. చేరాగారు పేర్కొన్న 'ఉద్యమేతర కవిత్వం' అనే విభాగం

కంటె కృష్ణకుమారిగారి 'అనుభూతి కవిత్వ' విభాగం చిన్నదనీ అన్నారు. చేరా గారు అనుభూతివాదాన్ని అంగీకరించరు కాబట్టి; ఉంటే ఉద్యమ కవిత్వం, ఉద్యమేతర కవిత్వమే ఉండాలి ఈ దశాబ్దంలో అనే భావం కలవారు కాబట్టి వారి విశ్లేషణ మరి అలాగే ఉంటుంది. చేకూరి రామారావుగారు వీరభద్రయ్య గారి విభాగాన్ని గూడా యథాతథంగా అంగీకరించలేదు. "ఒక్క తంగిరాల సుబ్బారావుగారి కోసం ఆత్మకథా కావ్యశాఖ, ఒక్క కుందుర్తికోసం స్మృతి కావ్యశాఖ ఏర్పరచి ఈ దశాబ్దపు కవితా ధోరణులలో కలపటం అనవసరం. ఆ లెక్కన సంప్రదాయ పద్ధతిలో ఎన్నో కావ్యాలు వస్తూనే ఉన్నాయి. వాటిని కూడా ఒక శాఖగా చెప్పొద్దా? ఇక వీరి మానవతావాదం ఒక చెత్తబుట్ట. ఎక్కడా ఇమడనివాడు ఇక్కడ ఇమిడిపోతాడు. ఏ తాత్త్విక నేపథ్యమూ లేనివాళ్ళకు దీన్ని సులభంగా అతికించవచ్చు. దీనివల్ల నష్టమూ లేదు, లాభమూ లేదు" అని వ్యాఖ్యానించారు. (చేరాతలు : 4-3-1990.)

వీరభద్రయ్యగారికి వ్యాసం వ్రాయటానికి ఎంత స్వాతంత్ర్యం ఉందో చేరాగారికి దాన్ని విమర్శించటానికి అంత స్వాతంత్ర్యం ఉంది. అయితే, ఒక వాస్తవాన్ని లోకం గమనిస్తూ ఉంటుంది. ఒక విమర్శకుడు కొన్ని విషయాల్లో అతి స్థూల విభజనాన్నీ, మరికొన్ని విషయాల్లో అతి సూక్ష్మ విభజనాన్నీ సాగిస్తున్నప్పుడు ఆ రెండు పద్ధతుల్లో ఒక నియమాన్నో, సంయమనాన్నో పాటిస్తున్నాడా- లేదా? అని సహృదయులు పరీక్షిస్తారు. చేరాగారు తమకు అభిమానాంశమైన విషయంలో సూక్ష్మ. సూక్ష్మాంశభేదాలను పాటిస్తారు. ఒక్కొక్కసారి ఒకరకమైన రచన ఒక ధోరణిని కల్పించినట్లున్నా దానిని గుర్తించి గొప్పగా వ్యాఖ్యానిస్తారు. వారి దృక్పథంలో పడకపోతే 'విశ్వంభర వంటి కావ్యాన్నైనా సరే, ఎంతటి - 'ఆధునిక మహాభారతాన్నైనా' సరే, సంప్రదాయం అనే పేరుతోనో, మిగిలి ఉన్న సంప్రదాయమని వారు భ్రమించే నవ్య సంప్రదాయం పేరుతోనో బుట్టదాఖలు చేస్తారు. ఇక్కడ వీరిది స్థూల దృష్టే కాని, సూక్ష్మ దృష్టి కాదు. వారికి సూక్ష్మ దృష్టి వస్తుతః ఉన్నది. కాని, అది 'నియంత్రిత ఆలోచనలకు' అంకితమైనట్లుగా ఉంది. లేకపోతే - మానవతావాదాన్ని చెత్తబుట్టగా చిత్రించటం చేరాకే సాధ్యం. వీరభద్రయ్యగారి మానవతావాదం చేరాగారనుకున్నట్లు తాత్త్విక నేపథ్యం లేనిది కాదు. ఏమైనా ఇటువంటి విమర్శలు

చూచి లోకం ఏమనుకుంటోందో కూడా మనం గమనించాలి — "ఇంకా లోతుకు పోయి చూస్తే ఆధునిక సాహిత్యానికి సంబంధించి మనం ఇంకా శాస్త్రీయ విమర్శనా ప్రమాణాలను ఏర్పరచు కోలేదనిపిస్తుంది. సిద్ధహస్తులనిపించుకొన్న విమర్శకుల రాతల్లోకూడా 'ఇంప్రెషనిజ'మే తొంగిచూస్తున్నది. మార్క్సిస్టు విమర్శనాపద్ధతి అంటూ ఒకటున్నది గానీ, దాని వినియోగం 'యాంత్రికం'గానే ఉంటున్నది...." (వివరాలకు చూడండి - 'సమకాలీన కవిత్వ.... నియంత్రిత ఆలోచనలు' - సాహిత్యప్రభ - ఆంధ్రప్రభ - 19-2-90.)

విమర్శరంగంలో ఈనాడు సిద్ధహస్తులైన విమర్శకులు చాలమంది ఉన్నారు. వారందరు శాస్త్రీయ విమర్శనా ప్రమాణాలు పాటిస్తున్నారా- లేదా? అనే పెద్ద ప్రశ్నను తలకెత్తుకొని ఖరపగిలేటట్లు చర్చించినదానికంటె ముందుగా వారు విమర్శకుల కుండవలసిన ప్రాథమిక క్రమశిక్షణ (డిసిప్లిన్)ను పాటిస్తున్నారా- లేదా? అని వితర్కించుకోవటం ముఖ్యం, ఆ క్రమశిక్షణలో కూడా 'ఓం నమః' లనైనా గౌరవిస్తున్నారా- లేదా అని పరిశీలించటం మరీ ముఖ్యం.

మచ్చుకొకటి మనవి చేస్తాను: అభ్యుదయ వాదానికి సంబంధించిన కవితోద్యమం ఉంది. లేదా, విప్లవవాదులకు సంబంధించిన కవిత్వం ఉంది. ఆ ఉద్యమాలకు సంబంధించిన పారిభాషిక పదజాలం ఏర్పడి ఉంది. ఆ పద జాలాన్ని ఆ ఉద్యమకారులు ఏ సాంకేతికమైన అర్థంతో వాడతారో, ఏ అర్థంతో దానిని రూఢికెక్కిస్తారో ఆ అర్థంలోనే, ఆ సందర్భంలో విమర్శకులు - వారు ఏ ఉద్యమాలకు సంబంధించినవారైనా - వాడటం క్రమశిక్షణలో మొట్టమొదటి లక్షణం. అభ్యుదయవాదుల 'సామాజిక స్పృహ'ను నవ్య సంప్రదాయవాది 'ప్రకృతి వర్ణన ప్రీతి'గా అర్థం చేసుకొని విమర్శలో వాడితే అది విమర్శవరంగా ఒక అరాజకం; క్రమశిక్షణారాహిత్యం. అలాగే విప్లవోద్యమ నేతలు 'నిబద్ధత'కు చెప్పే అర్థాన్ని తప్పించి 'అస్తిత్వవాదా'నికి సంబంధించిన కళాకారుని అభిప్రాయాన్ని ప్రామాణికంగా గ్రహించి విప్లవ కవిత్వాన్ని విమర్శించటం కూడా దోషమే అవుతుంది. అలా చేస్తే అభ్యుదయోద్యమవాదులూ, విప్లవవాదులూ అలా అన్నవారికి అసలు ఉండవలసిన అవగాహన కూడా లేదని అనవచ్చు. అందులో తప్పులేదు. అయితే, ఈ ప్రమాణాన్ని అభ్యుదయ వామపక్షీయులూ, మార్క్సిస్టు విమర్శకులూ, విప్లవవాదులూ కూడా పాటించాలి. ఇది అసలు ఒక పక్షంవారికి మాత్రమే సంబంధించిన ప్రమాణం కాదు అందరికీ అన్నికాలాల్లోనూ అన్ని సందర్భాలలోనూ వర్తించే ప్రమాణం.

ఈ దృష్టితో గమనిస్తే ఆచార్య చేకూరి రామారావుగారు మానవతావాదాన్ని గురించి చేసిన వ్యాఖ్యానం గానీ, నవ్యసంప్రదాయోద్యమం గురించి ప్రకటించిన అభిప్రాయంగానీ పైన పేర్కొన్న ప్రాథమిక ప్రమాణాన్ని కూడా మన్నిస్తున్నట్లు కనవడలేదు పై పెచ్చు వక్రీకరిస్తున్నట్లు కూడా స్పష్టమౌతుంది.

నవ్యసంప్రదాయవాదం చేరాగారికి నచ్చకపోవచ్చు. నవ్యసంప్రదాయవాదం అనేది అసలు ఉండటానికి వీలులేదని వారు భావించవచ్చు. అంతమేరకు వారు తమ భావాలను ప్రకటిస్తే ఎవరికీ అభ్యంతరం లేదు. పైపెచ్చు ఎదుటి వారికొక అభిప్రాయముందని గౌరవించటం కూడా న్యాయం. అయితే, చేకూరి రామారావు గారు "ఇంకా మిగిలి ఉన్న సంప్రదాయాన్ని నవ్యసంప్రదాయంగా పిలుస్తున్నారు" అని నవ్యసంప్రదాయవాదుల అభిప్రాయాన్ని తాము నివేదిస్తున్నారు. ఇది ఎలా ఉందంటే - సామాజిక స్పృహ అంటే ప్రజాజీవితవర్ణన ప్రీతిగా మార్క్సిస్టులు భావిస్తారు అని చెప్పినట్లుగా ఉంది. నా అభిప్రాయం ఏమిటంటే - 'ఇంకా మిగిలి ఉన్న సంప్రదాయాన్ని' నవ్యసంప్రదాయవాదులు నవ్యసంప్రదాయమని పిలవటం లేదు. చేరాగారు 'వారు అలా పిలుస్తున్నా'రని తాము చెవుతున్నారు. ఇది 'మిస్ రిప్రెజెంటేషన్.'

నవ్యసంప్రదాయవాదాన్ని గురించి తెలుగులో కొందరైనా ఆలోచిస్తున్నట్లు వారి మాటలు స్పష్టం చేస్తున్నాయి మానవతావాదాన్ని గురించి ఒక్క తెలుగు వారే కాక ప్రపంచంలో తత్త్వవేత్తలూ సాహితీద్రష్టలూ రచయితలు కూడా ఎందరో ఆలోచిస్తున్నారు. వీరభద్రయ్య మానవతావాదం అంటూ వేరే లేదు. ఇవన్నీ చేరాగారికి తెలుసు. మరి నవ్యసంప్రదాయాన్ని గురించిగాని, మానవతావాదాన్ని గురించిగానీ ఆ ఉద్యమవాదుల పరిభాషలో అర్థాలేమిటో చేరాగారు సహృదయతతో, సంయమనంతో గ్రహించి వివేచించవలసిన బాధ్యత కూడా స్వీకరించవలసి ఉంది. ''నవ్యసంప్రదాయమంటే గతానుగతికంగా వచ్చే సంప్రదాయ సాహిత్యంగా భ్రమించే వీలులేదు. దీనివల్ల సమగ్రావగాహన కలుగదు. పరంపరగా వచ్చే విశ్వసనీయములైన పురాణేతిహాసముల అనువాదాలేవీ నవ్యసంప్రదాయంలో చేరవు. ఎందుకంటే, వీటిల్లో సమకాలీన స్పందం చేరలేదు" అన్న ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యగారి మాటలనైనా గమనించి ఉన్నా కొంత బాగుండేది. (వర్తమాన కవిత్వ దర్శనం (వ్యా) - అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు (1987) - పు. 90 ). కడచిన అయిదేళ్ళుగా నవ్యసంప్రదాయాన్ని నిర్వచించి, వివరించి, విశ్లేషించి, వివేచించి, నిరూపిస్తున్న రచయిత

లెందరో ఉన్నారు. వారి మాటలు, చర్చలు, విమర్శలు నవ్యసంప్రదాయ శబ్దానికి ఒక రూఢిని కల్పించాయి మిగిలిన ఉద్యమాలకు చెందిన ఏ విమర్శకులైనా ఆ పదాన్ని వారే అర్థంలో వాడారో ఆ రూఢ్యర్థంలోనే, పారిభాషికపదంగానే వాడటం ప్రాథమిక మర్యాద. దాన్ని తప్పించివాడితే వక్రీకరణం!

ఎవరెన్ని రకాల వక్రీకరించినా, ఎన్నిరకాలుగా వాస్తవాలను గుర్తించకపోయినా, ఎవరెన్ని వ్యూహాలు పన్ని ఒక ఆలోచన ధారను అరికట్టటానికి యత్నించినా- ఆరంభమైన ఈ ఉద్యమం ఆగదు. అభ్యుదయ విప్లవధోరణులకు ప్రతిగా 1935 నుండి 1975 దాగా అన్ని ప్రక్రియలలో పొంగి, ఉద్యమంగా వ్యాపించిన నవ్యసంప్రదాయాన్ని గుర్తించకపోవటం చరిత్రను వక్రీకరించటమే అని యువతరం గొంతెత్తి ప్రశ్నిస్తున్న కాలమిది. ఈ ప్రశ్నిస్తున్నవారు నవ్యసంప్రదాయ యుగానికే చెందినవారు కారు; ఈ దశాబ్దిలో మరో క్రొత్త సాహిత్యోద్యమానికి నాంది పలుకుతున్న 'మానవ వికాసవాదులు.'

వీరు నవ్యసంప్రదాయ యుగాన్ని గుర్తించి సాహిత్య చరిత్రలో దానికివ్వదగిన స్థానాన్ని గురించి ప్రజాహృదయ న్యాయస్థానంలో వాదిస్తున్నారు. జనవాణిచ్చే తీర్పును రూపొందిస్తున్నారు. సాహిత్యపు విలువలను వివేచించే ఆధునికతను ఆవిష్కరిస్తున్నారు. వీరి దృష్టిలో 1975 తరువాత సాహిత్య చరిత్రలో ప్రక్రియాపరంగా 'ఆధునిక కావ్యేతిహాస' యుగమనీ, 'సమీక్షాయుగ'మనీ రెండు యుగాలు వర్తిస్తాయి. ఉద్యమాలపరంగా విప్లవధోరణి తరువాత 'మానవ వికాస చైతన్య' ధోరణి వర్తిల్లుతున్నది.

నవ్య సంప్రదాయోద్యమం అన్ని ఉద్యమాలలాగానే ఎదురొచ్చే ప్రశ్నలను ఎదుర్కొంటూ ఎత్తులకు ఎదుగుతున్నది. సంప్రదాయం చచ్చిపోయిందని భ్రమించినవారికి 'నవ్యసంప్రదాయ' శబ్దం చిరంజీవిగా తిరిగివచ్చిన ఆశ్చర్యం కలిగించింది. ఆ నవ్య' శబ్దం తీసివేస్తే మరలా చచ్చిపోతుందేమోనని కొందరు గొంతు చించుకొన్నారు. అది మరలా చనిపోవటానికి రాలేదని ధ్రువపడింది. ఇప్పుడు మరో ప్రశ్న - మార్క్సిజం కానిదంతా నవ్య సంప్రదాయమనేనా మీ అభిప్రాయం? అని కాదు; కడచిన పది వ్యాసాలలో చెప్పినట్లు ఒక విశిష్ట సాహిత్యోద్యమ స్ఫూర్తితో సాగిన నలభైయేళ్ళ తాత్త్విక, ప్రాయోగిక, అనుశీలనాత్మక ప్రక్రియా ప్రపంచం - ఆధునిక సాహిత్యచరిత్రలో ఏ ఉద్యమానికీ తీసిపోని చైతన్యం - నవ్యసంప్రదాయోద్యమం. *

(సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు :
ఆదివారం ఆంధ్రప్రభ : 1-4-1990)

# విశ్వనాథ : జ్ఞానపీఠ పురస్కారం

'జ్ఞానపీఠ' పురస్కారం పొందిన మొదటి తెలుగు కవి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. ఆయనకు ఆ గౌరవం లభించటం అర్హతవలన కలిగింది కాని, అదృష్టంవలన సంభవించింది కాదని ఆంధ్రులందరూ భావించారు. జ్ఞానపీఠం మీద కూర్చోదగినంత ఎత్తు విశ్వనాథ ఉన్నారని అందరూ అంగీకరించారు. ఆ పురస్కారం ఆయన కొక అలంకారం మాత్రమే. ఆయనే నిజానికి అలంకారానికి అలంకారం!

విశ్వనాథ రచనల నన్నింటినీ దృష్టిలో ఉంచుకొని, ముఖ్యంగా వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని పరిగణించి జ్ఞానపీఠ పురస్కారం ప్రదానం చేయటం జరిగింది అంటే విశ్వనాథ కవిగా, నవలాకర్తగా, నాటకకర్తగా, విమర్శకుడుగా రచించిన వివిధ ప్రక్రియలలో కవిగా ఆయన చేసిన విశిష్ట ప్రయోగం 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం' ఉదాత్తమైనదిగా సాహితీమర్మజ్ఞులు గుర్తించారన్నమాట! ఒక మాట నిజం. విశ్వనాథ కల్పవృక్షం పోటీకోసం, బహుమతికోసం వ్రాసిందికాదు. అది ఒక ఉద్యమంగా ఉద్భవించింది; ఉద్యమాన్ని సృష్టించింది; తాను చరిత్రలో నిర్వహించిన పాత్రకు తగిన గౌరవాన్ని సమకాలీన సాహిత్యరంగంలో పొందింది. జ్ఞానపీఠ పురస్కారం విశ్వనాథ అందుకొన్నప్పుడు, ఆ గౌరవం ఒక మహాకవికి లభించిందనీ, లేదా, ఒక మహాకావ్యానికి కలిగిందనీ - మాత్రమే తెలుగువారు తలంచి సంతృప్తిపడలేదు. దాదాపు ఒక అర్ధ శతాబ్దం ఆంధ్ర సాహిత్యానికి తన ప్రయోగంచేత ఒక ప్రామాణికతను సృష్టించి, తన ఆలోచనచేత ఒక క్రొత్త సంప్రదాయాన్ని అనుభవింపజేసి, తన జీవిత విమర్శచేత సాహిత్యానికి సమగ్ర మానవీయ చైతన్య దృక్పథాన్ని ప్రసాదించి, తాను జీవిస్తున్న జాతియొక్క ఆత్మ ధర్మాన్నీ, స్వాతంత్ర్య సంస్కారాన్నీ, సమకాలీన సాంఘిక సమస్యల సమతౌల్య విచారాన్నీ, ప్రాచ్య పాశ్చాత్య జీవన విధానంలోని విలువల వివేచనాన్నీ భారతీయ దృక్పథంతో విశ్వజనీనంగా విలోకించే వివేకాన్ని సాహిత్యంద్వారా సమాజానికి

అందించి - ఒక ఉద్యమంగా, మహా ప్రవాహంగా, ఒక యుగ చైతన్యంలా, ఒక అనంత జ్వాలాతోరణంలా జీవిస్తున్న ప్రతిభామూర్తికి జాతి సమర్పించుకొన్న కృతాజ్ఞతాంజలిగా తోచింది

విశ్వనాథవారి సాహిత్య వ్యక్తిత్వాన్ని విలువ కట్టేటప్పుడు ఒక విషయం మనం గుర్తుంచుకోవాలి వెయ్యేళ్ళ మన తెలుగు సాహిత్యంలో 'మహాకవి' అని పిలువదగినవారిలో కానీ, ఆధునికాంధ్ర సాహిత్యంలో 'మహా రచయిత' అని పేర్కొనదగినవారిలోగానీ విశ్వనాథను కాదని వదలిపెట్టే అవకాశం ఆయన మనకు కల్పించలేదు. మార్క్సిస్టు భావజాలం మాత్రమే మహా కవిత్వ ప్రమాణాలకు ప్రాతిపదికగా భావించే వర్గ దృక్పథానికి ఆయన మహాకవి కాకపోవచ్చు; తిరుగుబాటు ధోరణిని బహురూపాలలో, వివిధ ప్రక్రియలలో ప్రదర్శించిన రచయితలే మహా రచయితలని భావించేవారికి ఆయన మహా రచయిత కాక పోవచ్చు. అయితే, ఈనాడు మార్క్సిస్టు దృక్పథ మొక్కటే జీవితాన్ని సమగ్రంగా దర్శించగలదనే భ్రమలు తొలగిపోయాయి. వర్గ సంఘర్షణలో చితికిపోయిన మౌలిక మానవత్వపు విలువలను గుర్తించి, వాటిని పునరుజ్జీవింప చేసికొనటానికి తగిన ఆధునికమైన ఆలోచనలను ఆచరణయోగ్యంగా రూపొందించు కొంటున్న ప్రపంచాన్ని నేడు మనం కళ్ళారా చూస్తున్నాం. 'పదండి ముందుకు' అని ఎవరైనా ఈనాడు మనల్ని పిలిస్తే, వెనుక కొకసారి చూచుకొని పునరాలోచించకుండా ముందుకు వరుగెత్తే పారవశ్యం మనకు లేదు. ప్రతి పిలుపులో రాజకీయం ప్రతిధ్వనిస్తున్నదని పసికట్టే ప్రజ్ఞ ఈ రోజు పసిబాలునిలో కూడా కనబడుతోంది. భావజాలాన్ని మాత్రమే చూచి బ్రహ్మరథాన్ని పట్టే రోజులు పోయాయి. భావజాలాన్ని విమర్శించుకొని భవిష్యత్తును నిర్మించుకొనే పరిపాకం ప్రజలకు అందించగలిగే సాహిత్యాన్ని సమాజం ఎల్లప్పుడూ కోరుకొంటుంది. విశ్వనాథ సత్యనారాయణగారు అటువంటి సంస్కారాన్ని తన సాహిత్యం ద్వారా తన సమకాలీన సమాజానికి అందించాడు ఈనాడు తన జాతి ఉత్తమ సాహిత్యమంటే ఏది? అని ఆలోచించుకొనటానికి ఆధారమైన వివేకాన్ని ఆయన సృష్టించాడు.

మరొక మనవి. విశ్వనాథవారు తమ జీవితకాలంలో సృష్టించిన సాహిత్యాన్నంతా కలిపి ఒక పూర్ణవలయంగా గ్రహిస్తే దాదాపు ఇరవయ్యో శతాబ్దపు

పూర్వార్ధంలో జీవిస్తున్న తెలుగు సమాజం పొందిన పరిణామాలూ, ఆ పరిణామ దశలలో జాతి పొందిన సుఖదుఃఖాలూ, మారుతున్న కాలంలో జీవితపు విలువలను గురించి ప్రజలు సాగించే తర్కవితర్కాలూ, వాటి వాస్తవిక అనుభవాల అనుశీలనాలూ, వాస్తవిక సమాజ జీవితంలోని పరిపూర్ణతా సాధనాత్మకమైన జీవునివేదన, కాల్పనిక, ఆదర్శజీవితాల అంచులకై సాగించే అన్వేషణ, పంచ కోశాత్మక ప్రవృత్తుల ద్వారా ప్రపంచం సాధించే పరిపూర్ణానుభూతి యొక్క కళాత్మకాభివ్యక్తి, సామాజిక సాంస్కృతిక జీవిత మథనం, ప్రపంచ సమస్యలకు పరిష్కారం భారతీయ దర్శనమే ఇవ్వగలుగుతుందన్న ఆత్మవిశ్వాసం- ఇలా అన్నీ కలిసి ఒక సజీవ చలనచిత్రంలా మన కన్నులముందు ప్రత్యక్షమౌతున్నాయి. విశ్వనాథ వాఙ్మయం ఒక అర్ధశతాబ్ది సజీవ సమాజ జీవితం.

ఒక్క ప్రశ్న వేసుకొందాం - విశ్వనాథ సాహిత్యంలో ప్రతిఫలించినంత సమకాలీన సజీవసమాజం మరే కవి రచనలలోనైనా ప్రతిఫలించినట్లు చెప్పగలమా? కష్టం. ఈ శతాబ్దంలోని విభిన్న భావజాలాలకు ప్రాతినిధ్యం వహించే రచయితలు, వారి రచనలు ప్రత్యేక ఉద్యమ తరంగాలుగా సాహిత్యంలో కనపడుతూ ఉండవచ్చు. అయితే, ఆ రచనలు కానీ, ఉద్యమాలు కానీ సాహితీ రంగంలోనూ, సామాజిక రంగంలోనూ గతంనుండి విచ్ఛిత్తిని సాధించలేక పోయాయన్నది ఈనాడు అందరూ అంగీకరిస్తున్న చారిత్రిక వాస్తవం. ఆ విచ్ఛిత్తి కలగకపోవటానికి ఆ బలమైన కారణం ఏమి అయి ఉంటుంది? అన్నది నేటి సామాజిక శాస్త్రజ్ఞులను, ఆ ప్రమాణాలతో సాహిత్యాన్ని సమీక్షించే సాహిత్య విమర్శకులను పట్టిపీడిస్తున్న పెద్ద సమస్య. దాదాపు 1935 నుండి గతం నుండి విచ్ఛిత్తిని సాధిద్దామని ఎన్నో ఉద్యమాలు వచ్చాయి. సాహిత్యంలో వాటి పాద ముద్రలు గోచరించాయి. అయినా, విచ్ఛిత్తి సాధ్యపడలేదు. అవిచ్ఛిన్నత అంతరించకుండా అభినవరూపంతో అవతరిస్తూ ఆధునికతను సంతరించుకొంటూ వస్తున్నది. ఈ బలం ఎక్కడిది? ఎవరిది? తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు 1935-1975 నడుమ తన బలాన్ని సమర్థవంతంగా ప్రదర్శించిన నవ్య సంప్రదాయోద్యమానిది. ఆ ఉద్యమానికి నాయకుడు విశ్వనాథ సత్యనారాయణ.

అవిచ్ఛిన్నతను సంప్రదాయం అనే అలవాటు ఈ దేశంలో ఉంది. విచ్ఛిత్తిని కోరేవారు సంప్రదాయ విచ్ఛిన్నతను సంలక్షించారు. విచ్ఛిత్తి అసాధ్యం

అని తెలిసింది పదేళ్ళక్రితమే సమన్వయమే కాని సంపూర్ణవిచ్ఛిత్తి ఈ సంస్కృతిలో అసంభవం ఇది సార్వకాలిక చారిత్రికవాస్తవం అని చెప్పేవారూ ఉన్నారు. విభిన్న సంస్కృతులు, విభిన్న భావజాలాలు, విభిన్న ఆచార వ్యవహారాలు, విభిన్న సామాజిక వ్యవస్థలు పరస్పరం సన్నిహితమైనప్పుడు, సంఘర్షణ పడినప్పుడు, పాలిత పాలకవర్గ చైతన్యాలుగా ఘర్షణపడినప్పుడు ఏర్పడే సంక్షోభం 19, 20వ శతాబ్దాలలో స్పష్టంగా ప్రతిఫలించింది. తెలుగు సాహిత్యంలో ఆ చైతన్యం 20వ శతాబ్దిలో తురంగలిస్తుంది. ఇందులో తీవ్రవాదులు ప్రాతవ్యవస్థకు బదులు క్రొత్త వ్యవస్థను ఏర్పరచాలని ఉద్యమిస్తారు. తీవ్రవాదం ఎప్పుడూ కొన్ని విలువలను వెలివేయగలగవచ్చు; కొన్నిటిని తొందరపడి ఖండించవచ్చు; కాని సమాజాన్ని, సాహిత్యాన్ని గతం నుండి తెగత్రెంపులు చేయలేదు. బలవంతంగా క్రొత్త వ్యవస్థను నెత్తురుతో కలిపిన అడుసులో బిగించి నిలిపినా, కొద్ది కాలానికి పునాదుల్లో కూరుకొనిపోయిన గతం, బురుజులమీద క్రొత్త చిగుళ్ళు కొమ్మలు విరిగినంత వేగంగా వేళ్ళు తెగవు. తెలుగులో 1935-75 మధ్య వచ్చిన కొన్ని ఉద్యమాలు తీవ్ర ధోరణిని ప్రదర్శిస్తున్నప్పుడు, క్రొత్తలోని మంచిని, చెడునూ విమర్శిస్తూ, గతంలోని గొప్పదనాన్ని, బలహీనతలనూ వివేచిస్తూ, క్రొత్తగా రూపొందవలసిన వర్తమానాన్ని గురించి ఆలోచనాశీలంతో, ఆవేదనతో సాగించే శాంతియుతమైన అవిచ్ఛిన్న జాతీయ చైతన్యోద్యమం నవ్యసంప్రదాయోద్యమం.

నవ్యసంప్రదాయోద్యమాన్ని నాలుగు కోణాలతో దర్శించవచ్చు. ఒకటి-సాంస్కృతికకోణం, రెండు-సామాజికకోణం, మూడు-తాత్త్వికకోణం, నాలుగు-కళాత్మకకోణం పాశ్చాత్య సంస్కృతి మనకు పరిచయమైన తరువాత మన సాంస్కృతిక విలువలను పునర్విమర్శించుకొని, వాటిని అభినవంగా పునస్సృష్టి చేసుకొనే యత్నంలో కానవచ్చే సంస్కరణోద్యమాలు మొదటి తెగకు చెందుతాయి. సంస్కరణోద్యమాలు హేతువాద దృష్టిలో నిలువని విలువలను విమర్శించి సామాజిక సాంస్కృతిక చైతన్యాన్ని పునర్వ్యవస్థీకరించటానికి యత్నించాయి. కాని, సమూల విచ్ఛేదాన్ని కోరలేదు. పైపెచ్చు అటువంటి యత్నాలను నిరోధించాయి. సంస్కరణోద్యమాల వలన గతం వర్తమాన వ్యవస్థకు తగినట్లుగా పరిష్కరింపబడింది. నవ్య సంప్రదాయానికి ఈ చైతన్యం ఒక కోణం.

సామాజికంగా మన దేశంలో చెప్పుకోదగిన ఉద్యమం స్వాతంత్ర్యోద్యమం, అందులోనూ గాంధీ మార్గానికి చెందిన సత్యాగ్రహోద్యమం ప్రెంచి, రష్యన్ విప్లవాల తరువాత సాయుధ విప్లవం కంటె సమస్యల పరిష్కారానికి శాంతివిప్లవం శక్తివంతమైన సాధనమని ప్రపంచానికి చాటిచెప్పిన రాజకీయ చైతన్యం సత్యాగ్రహోద్యమం. నేటి ప్రపంచంలో సైనిక తిరుగుబాట్లకంటె ప్రజాస్వామ్య మార్గాలు; సాయుధ విప్లవంకంటె సత్యాగ్రహ విప్లవం; పాలకుడు పాలితుని స్వాతంత్ర్యాన్ని కాదనే హక్కు మానవ అస్తిత్వానికే విరుద్ధమనే నైతిక దృక్పథం; మనిషి పుట్టిన తరువాత భౌతికంగా, ఆర్థికంగా, నైతికంగా, వైజ్ఞానికంగా, కళాత్మకంగా, ఆధ్యాత్మికంగా స్వయంగా, సామూహికంగా వికసించే ప్రయత్నాన్ని పోషించే ప్రభుత్వ వ్యవస్థ అభిలషణీయం కాని, ఎటువంటి నియంత్రణను కూడా సభ్యమానవసమాజం సహించరాదనే స్వేచ్ఛాసూక్తం భారతదేశం స్వాతంత్ర్యోద్యమం ద్వారా ప్రపంచానికి చాటి చెప్పింది. మార్క్సు మార్గం కంటె ప్రపంచానికి నేడు గాంధీమార్గం ఎక్కువగా ఆమోదయోగ్యంగా కనపడుతున్నది. సామాజికంగా నవ్య సంప్రదాయానికి ఈ చైతన్యం ఒక కోణం.

తాత్త్వికంగా భారతదేశం ఎప్పుడూ ముందంజ వేస్తూనే ఉంది. ఎందువల్లనంటే, భారతీయ దర్శనం శాస్త్రీయమైనది కాబట్టి. అది తలుపులూ, కిటికీలూ తెరిచి పెట్టుకొన్న విశాల కుటీరం లాంటిది. అన్ని వైపులనుండీ వచ్చే భద్రమైన ఆలోచనల నన్నింటినీ భారతీయత గ్రహిస్తుంది. ఎప్పటికప్పుడు క్రొత్తపాతల మేలు కలయిగా భవిష్యత్తులోకి సృజనాత్మకంగా, ప్రయోజనాత్మకంగా చొచ్చుకొని పోతుంది. నాటి రామకృష్ణ పరమహంస నుండి, నేటి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి వరకు వివేకానంద, రమణమహర్షి, అరవింద ఘోష్ మొదలైన వారి దర్శనాలు అన్నీ అంచెలంచెలుగా ఆధునిక భారతీయ తాత్త్విక దర్శనశక్తిని వికసింపజేశాయి. ఈ దర్శనాలన్నీ శాంకర అద్వైత దర్శనాన్ని మూలంగా చేసుకొని శాఖలుగా విస్తరించినవే అందువలన ఆధునిక తాత్త్విక దర్శన వికాస చైతన్య స్ఫూర్తిని వెలార్చేది నవ్య సంప్రదాయంలోని మరొక కోణం.

నవ్యసంప్రదాయం కళారంగంలో కూడా ప్రవర్తిల్లింది. చిత్రకళాశిల్ప నృత్యనాట్య నాటక కళలలో నవ్యసంప్రదాయోద్యమాలు భారతీయ కళాదృక్పథానికి క్రొత్త సమన్వయప్రయోగ శక్తులను ప్రసాదించాయి. సాహిత్యరంగం మరేరంగానికి తీసిపోదు. తీసిపోలేదు అందులోనూ మన తెలుగుసాహిత్యం ఈ శాఖలో అత్యంత శక్తిమంతంగా జీవించింది.

సాహిత్యశక్తి దర్శనంమీదా, ప్రయోగంమీదా, సాహిత్యస్వ్రూహమీదా, సమాజస్పందనమీదా ప్రధానంగా ఆధారపడి ఉంటుంది. ఈ నాలుగింటిలో నవ్యతను సాధించించింది నవ్యసంప్రదాయోద్యమం. దీనినిగురించి కూలంకషంగా చెప్పాలంటే ఒక గ్రంథమే అవుతుంది. ఈ పత్ర కాలపరిమితిని దృష్టిలో ఉంచుకొని దిఙ్మాత్రంగా పేర్కొంటాను.

నవ్యసంప్రదాయం మొదట కాల్పనిక కవిత్వయుగ చైతన్యం నుండి విడివడి తిరుగుబాటు ప్రకటించింది. ఎందువల్లనంటే, దార్శనికమైన అభిప్రాయ భేదం వలన. సూత్రప్రాయంగా చెప్పాలంటే - కాల్పనిక సాహిత్యం పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల మూలబలం కలది. అయితే, అది తెలుగులో వెలుగులు నింపే నాటికి పరిస్థితులు తారుమారుగా మారాయి. ఆదునికయుగంలో టి యస్. ఎలియట్ నుండి న్యూక్రిటిక్స్‌దాకా వ్యాపించియున్న సాహిత్యజగత్తుపై భారతీయ సాహిత్య దర్శన ప్రభావం గోచరిస్తున్న రోజులవి. 1935 నాటికి రాజకీయంగా, తాత్త్వికంగా, సాహిత్య దర్శనపరంగా భారతీయులు పాశ్చాత్య దేశాలమీద, సంస్కృతులమీదా, సాహిత్య దర్శనాలమీదా ప్రభావం ప్రసరిస్తూ తమ జాతీయ వ్యక్తిత్వంమీద ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించుకొంటున్నారు. ఈ చైతన్యానికి శక్తి మంతమైన ఉద్యమ రూపాన్ని ఇచ్చినవారు నవ్యసంప్రదాయవాదులు, వారికి ఎదురులేని సేనాపతి విశ్వనాథ.

విశ్వనాథవారు 'రసము వేయిరెట్లు గొప్పది' అంటే ఆయనను సాహిత్యాన్ని వెయ్యేళ్ళు వెనక్కు తోస్తున్న సంప్రదాయవాదిగా మార్క్సిస్టులు మొదలైనవారు పేర్కొంటారు. మరి వారికి కనపడని వినపడని, సత్యమేమిటంటే- ప్రపంచ భాషా సాహిత్యాలలో కావ్యానుశీలన పద్ధతిలో విశ్వజనీనంగా పనికివచ్చే సాహిత్య సిద్ధాంతం రససిద్ధాంత మని సమకాలీన ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య దార్శనికులు, కవులు, విమర్శకులు ఉద్ఘోషించటం; మన సాహిత్యప్రస్థానాలలోని ధ్వని, వక్రోక్తి, ఔచిత్య, గుణ, రీతి, రస సంప్రదాయాలే పాశ్చాత్య సాహిత్య విమర్శోద్యమాలలో పెక్కింటికి పరోక్షప్రేరకాలైనవని విమర్శకులు వివేచించటం. ఉదాహరణకు ఇద్దరు ప్రసిద్ధాంగ్లాచార్యుల మాటలు మనవి చేస్తాను—

"So great and perpetually modern is the speculative thought of India, writes Joad, that the latest novelties of the 20th century turn up casually as it were and as matters taken for granted Prof. Edgerton exhorts all interested in literary aesthetics to study Dhvani carefully and Prof.

Brough points out that Sanskrit poetics as at least as well worth reading as Aristole's Poetics or Horace's Ars Poetica and in many ways much more sensitive in its approach to poetry than either of these works Still no outstanding critic deigns to take notice of it Caudwell refers to Dhvani in his 'Illusion and Reality' and Myers in his 'The Near and the Far' refers to Rasa, Susan Langer devotes a paragraph to this in her 'Feeling and Form "

Prof K.R. Viswanadham

(Emotional Effect : Katharsis and Rasa (Essay)—
Literary criticism : European and Indian Traditions :
Ed : C.D. Narasimhiah : p. 101.)

"When we examine it (New criticism) closely, we will find it to be one sided reformulation of the guna, alankara, and riti theories of Ancient India."

—Dr. P.S. Sastri

(New criticism - As a Movement (1974) - p. 7.)

నవ్యసంప్రదాయంలో పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలమీద భారతీయ సాహిత్య దర్శనాల నీడలు పడుతున్నవన్న ధీమాతో సాహిత్య ధిషణాహంకారం 'రసము వేయిరెట్లు గొప్పది' అన్న రంకె వేసినట్లు వినిపిస్తుంది విశ్వనాథ వాక్కులలో.

నవ్యసంప్రదాయవాదుల రసదర్శనం పాశ్చాత్యుల విషాదాంతనాటకంలోని కాథార్సిస్ అనుభవంలోని స్వభావాన్ని తనలో సంవదించుకొన్న అభినవరూపం, తెలుగులో విషాదగంభీర నాటకాలలో కాని, విషాదాంత నాటకాలలోకాని, చారిత్రక కావ్యప్రయోగాలలో గాని, రామాయణ కల్పవృక్షంలో పోషింపబడిన జీవునివేదనలో గాని, విషాదాంత కావ్యాలలో గాని- రసపోషణ శిల్పం పాతబడ్డ పద్ధతి నాశ్రయించలేదు. ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాల సమన్వయదృష్టితో నవ్యంగా రూపొందింది. నవ్యసంప్రదాయం ఈ నవ్యరస సూత్రాన్ని దర్శించింది. దీనికి ప్రవక్త విశ్వనాథ.

నవ్య సంప్రదాయం అభ్యుదయోద్యమాన్నీ, మార్క్సిస్టు హేతువాద ధోరణులనూ అసమగ్రాలని భావించి సమగ్ర మానవ జీవిత దర్శనం భారతీయ తాత్త్విక దర్శనమని గాఢంగా విశ్వసించింది. భారతీయదర్శనం స్థితగతి కలది కాదు; పరిణామ శీలమైనదే. తాత్త్వికంగా సాగుతున్న నవ్యసంప్రదాయ ధారను సాహిత్యంలో సంవదించుకోవటం ఈ సాహిత్యోద్యమ స్వభావం వీరి ఉద్దేశ్యంలో మార్క్సిజం మానవాభ్యుదయానికి మొదటిమెట్టు మాత్రమే; హేతువాదం మానవ అనుభవ సత్యమైన అతీంద్రియ స్థితిని గమనించకపోవటంచేత బుద్ధి వయనించి నంతమేరవరకే అది దర్శింపగలదని వీరు భావిస్తారు ఒక్కమాటలో చెప్పాలంటే- నవ్య సంప్రదాయవాదులు సామాజిక భౌతికాభ్యుదయం నుండి ఆధ్యాత్మికాభ్యుదయం దాకా మానవ వికాస ప్రస్థానం సాగినప్పుడే జీవితం సమగ్రం, సంపూర్ణం అవుతుందని భావిస్తారు. శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఈ దర్శనానికి కళాత్మక విశ్వరూపం.

ఇక ప్రయోగం సంగతి ఆలోచిద్దాం. విశ్వనాథవారు చేపట్టిన ప్రక్రియలన్నింటిని పట్టీగా చెప్పటం ఈ విద్వగోష్ఠిలో అనవసరం మన అందరికీ తెలుసు - విశ్వనాథ వచనపద్యం తప్ప అన్ని ప్రక్రియలనూ, పట్టింది బంగారం చేశారని. సమకాలీన కవులుగాని నాటకకర్తలుగాని, నవలారచయితలుగాని, గేయకావ్యకర్తలుగాని, కథా రచయితలుగాని చేసిన ప్రయోగాలన్నింటికంటె విలక్షణమైనవి, విశిష్టమైనవి అయిన ప్రయోగాలు విశ్వనాథవారు చేసి చూపించారు. క్రొత్తకు క్రొత్తదనాన్ని నేర్పిన ప్రయోగకర్త ఆయన. అర్ధ శతాబ్ది కాలంలో ఆవిర్భవించిన ప్రయోగాలు - వివిధ ఉద్యమాలకు పతాకలుగా నిలిచినవి - అన్నీ కలిసి ఒకవైపు ఉంచితే, వాటికి దీటైన ప్రక్రియలన్నింటినీ తానూ వెలయించటమే కాకుండా, నవ్యసంప్రదాయ ప్రత్యేకతను చాటిచెప్పే ప్రయోగాలను గూడా జోడించి - అన్ని ఉద్యమాలూ కలిసి ఒక యెత్తు; నవ్యసంప్రదాయం ఒక్కటీ ఒక్కయెత్తు అని ప్రయోగించి నిరూపించిన ప్రజ్ఞామూర్తి విశ్వనాథ.

కవిత్రయం వదలిపెడితే భాగవతం పోతన్నకు మిగిలినట్లు, వచనకవిత విశ్వనాథ చేపట్టకపోతే కుందుర్తికి, ఆధునిక కావ్యకర్తలకూ మిగిలింది. అయితే, కుందుర్తి వస్తుతః విశ్వనాథ శిష్యుడు కాబట్టి, నవ్యసంప్రదాయోద్యమ ప్రభావంతో, వచనపద్యాన్ని అన్ని ప్రక్రియలలోనూ ప్రవేశపెట్టటానికి యత్నించాడు. విశ్వనాథను వైరభక్తితో సేవించాడు కుందుర్తి. వచన కవులు కొందరు పద్యం నడుము విరుగగొట్టబోయి దుడ్డుకర్రను విరుగగొట్టుకొన్నారు విశ్వనాథ పద్యం

మొక్కవోలేదు; గేయం గొంతు పూడుకొనిపోలేదు; నవ్యసంప్రదాయం నవ్యతను కోల్పోలేదు. వచనపద్యాన్ని ఆధునిక కావ్యకళలకు వదలివేశాడు విశ్వనాథ. ఇప్పుడు వచనపద్యంకంటె విశ్వనాథ పద్యమే తేలిగ్గా అర్థమౌతుంది అని అనుకొనేంత అభ్యుదయాన్ని సాధించాం!

అభ్యుదయవాదులు సాహిత్యానికి- విశేషించి కవితకు, కవితకు సంబంధించిన ప్రక్రియలకు సామాజిక దర్శనం మూలమని వ్యాఖ్యానించే యత్నం చేశారు. నవలా ప్రక్రియకు ప్రధానమైన సామాజిక వాస్తవికతను కవితా ప్రక్రియలకు కూడా ప్రధానమని ప్రతిపాదించారు. వారి వాదం సాహిత్య జగత్తులో నిలవాలంటే రససిద్ధాంతాన్ని కాదనాలి. అందువలన రసవాదాన్ని సంప్రదాయ వాదంగా, ఫ్యూడల్ వ్యవస్థకు సంబంధించిందిగా చెప్పి, కవిత్వం ఆనందాన్ని అందించటంకోసం కాదు, జాతిలో కార్యశీలాన్ని, ఉద్యమ ప్రవృత్తిని కలిగించటానికే ఉపయోగించాలని వాదించారు. ఆంధ్ర సాహిత్య చరిత్రలో మొట్టమొదటి సారి కవిత్వానికి సాహిత్య సిద్ధాంత ప్రాతిపదికను కాదన్నవారు అభ్యుదయ వామపక్షీయులు విప్లవ కవులు, దీన్ని వ్యతిరేకించి సామాజిక చైతన్యాన్ని రస దర్శనంగా మార్చుకొనే సాహిత్య ప్రక్రియలను చేపట్టి అపూర్వంగా నిర్వహించి నవ్యసంప్రదాయోద్యమాన్ని సాగించారు నవ్యసంప్రదాయ కవులు, నవ్యసంప్రదాయ కవులది సామాజిక సాహిత్య స్పృహతో సాగిన నవ్యరస మార్గమనటం మరింత సమంజసం!

భారత జాతిని మరచిపోని మానవజాతి దృక్పథం నవ్యసంప్రదాయ వాదులది. 'నరజాతి చరిత్ర సమస్తం'లో మన జాతి చరిత్ర గతార్థంగా అభ్యుదయ వామపక్షీయులు భావిస్తారు. ఒక జాతి వికాసంలో కలిగే పరిణామాలను ఆ జాతి యొక్క చారిత్రిక సాంస్కృతిక ఆధ్యాత్మిక ప్రాతిపదికలను ఆధారంగా చేసికొని వ్యాఖ్యానించాలనీ, ఆ పరిణామం ఒక జాతి చరిత్రలో విలక్షణంగా గోచరించినా, ప్రపంచ జాతి వికాస చరిత్రకు విపరీతంగా భాసించదనీ, జాతుల మధ్య కలిగే సంబంధ బాంధవ్యాలు కారణంగా జాతి వికాస చరిత్ర ప్రగతి పథంలో పురోగమిస్తుందనీ, అందువలన జాతి ప్రపంచానికిచ్చే జీవన విధానం, దార్శనిక శక్తి మీదనే దేశం, లేదా, జాతి వ్యక్తిత్వం గౌరవింపబడుతుందనీ నవ్యసంప్రదాయ వాదులు నమ్ముతారు. అందువలన వారిది మౌలికంగా జాతీయవాద దృక్పథం; పర్యంతంగా విశ్వ దృక్పథం వారి జీవన దర్శనం భౌతిక స్థాయిలో మొదలై, ఆధ్యాత్మికస్థాయివరకూ వ్యాపించి ఉంటుంది. వారి దృష్టిలో సాహిత్యం భౌతికాధ్యాత్మిక స్థితులకు వారధి. సమాజానికిలాగానే సాహిత్యానికి కూడా స్వతంత్ర

ప్రతిపత్తి ఉంటుందనీ; రెండింటికీ పరస్పర సంబంధం, ప్రత్యేక పరిణామ పద్ధతి ఉంటాయనీ నవ్యసంప్రదాయవాదులు విశ్వసిస్తారు. సమాజ దర్శనాన్ని మార్చే శక్తి సాహిత్య దర్శనానికి ఉంటుందని నమ్ముతారు. ఒక్కొక్కసారి సమకాలీన సమాజ పరిస్థితులకంటె అతీతంగా ఆలోచించి భవిష్యద్దర్శనాన్ని తాత్త్వికంగా కవి కళా మార్గంద్వారా వ్యక్తీకరిస్తాడనీ నవ్యసంప్రదాయులు వివేచిస్తారు.

నవ్యసంప్రదాయోద్యమంలోని నాలుగు కోణాలూ సాహిత్యోద్యమంలో సంగమించాయి. అందువలన అది సమగ్రచతుర్భుజం. సామాజిక సమస్యలను సాహిత్యస్పృహతో వ్యక్తీకరించే కళా మార్గం నవ్యసంప్రదాయులది. విశ్వనాథ సాహితి ఈ పద్ధతికి విగ్రాహరూపం. ఆయన నవల నెలా, ఎన్నిరకాలుగా ప్రయోగించవచ్చునో, అలాగే కావ్యాన్ని, నాటకాన్ని ఎన్నిరకాల శిల్పాలతో ప్రదర్శించవచ్చునో తెలిసి చేసి చూపినవాడు. ఒకనాడు సంస్కృత సాహిత్యంలో వ్యాసుడటువంటి పని చేసి చూపించాడు ఆధునిక సాహిత్యంలో ఆధునిక ప్రక్రియలతో విశ్వనాథ అభినవ వ్యాసునిగా తనను తాను ప్రదర్శించుకొన్నాడు, ప్రక్రియలకన్నింటికీ క్లాసిక్ ప్రమాణాలూ, ఎపిక్ లక్షణాలూ సంవదించుకొన్న ప్రక్రియావళల పరిపూర్ణత్వాన్ని ఆధునికాంధ్ర సాహిత్యానికి అందించాడు.

ఇటువంటి వాటికి - ఒక 'వేయిపడగలు,' ఒక 'నర్తనశాల,' ఒక 'కిన్నెరసాని పాటలు,' ఒక 'ఏకవీర,' ఒక 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం'- ఇలా ఎన్నింటికో విశ్వనాథ తలపొలంలో నిలుస్తాడు.

జ్ఞానపీఠ పురస్కారం ఒక వ్యక్తిగా విశ్వనాథకా?

ఒక పరిపూర్ణ ప్రక్రియగా 'శ్రీమద్రామాయణ కల్పవృక్షానికా?'

లేదా—

విశ్వనాథలోని మహా రచయిత నాయకత్వం వహించి నిర్వహించిన నవ్యసంప్రదాయోద్యమానికా?

నవ్యసంప్రదాయోద్యమ నందన వనంలో కల్పవృక్షం విశ్వనాథ సాహితీ వ్యక్తిత్వం. భారతీయ జ్ఞానపీఠానికే అది అమూల్యాలంకారం! *

[ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ 1990 ఆగస్టు 18 నుండి 20 వరకు "దక్షిణభారత జ్ఞానపీఠ బహుమతి గ్రహీతలు - వారి విశిష్ట సేవ" అనే అంశంమీద నిర్వహించిన యు.జి.సి. జాతీయ సదస్సులో సమర్పించిన పత్రం.]

[అప్పటి వ్యాసశీర్షిక : నవ్యసంప్రదాయ ప్రయోక్తగా విశ్వనాథ.]



